చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభ

# లీ షావ్ - చీ నివేదిక



[ చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభకు
కేంద్రకమిటీ తరఫున సమర్పింపబడ్డ
రాజకీయ నివేదిక ]



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ - 2.

# చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభ

# లీ షావ్ - చీ నివేదిక

[ చైనా కమ్యూనిస్టుపార్టీ 8వ మహాసభలో కేంద్రకమిటీ తరఫున సమర్పింపబడిన రాజకీయ నివేదిక ]

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ-2

# విషయ సూచిక

# చైనా కమ్యూనిస్టుపార్టీ 8వ మహాసభకు కేంద్రకమిటీ నివేదిక

## లీ - షావ్ చీ

(చైనా కమ్యూనిస్టుపార్టీ ఎనిమిదవ మహాసభకు లీషావ్ - చీ సమర్పించిన కేంద్రకమిటీ రాజకీయ నివేదిక పూర్తిపాఠం)

కామ్రేడ్స్,

మనపార్టీ సప్తమ జాతీయమహాసభ జరిగి యిప్పటికి 11 సంవత్సరాలైంది. ఈ పదకొండు యేళ్ళలోను, ప్రపంచ ప్రాధాన్యంగల రెండు గొప్ప చారిత్రక పరిణామాలు మన దేశంలో సంభవించాయి. చైనాప్రజలు 1949 లో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, నిరంకుశ పెట్టుబడిదారీవిధానాలఅభివృద్ధినిరోధకపాలనను కూలదోశారు. గత సంవత్సర ఉత్తరార్ధభాగంలోను, ఈ యేడు పూర్వార్ధ భాగంలోను వ్యవసాయం, చేతిపరిశ్రమలు, పెట్టుబడిదారీ పరిశ్రమలు, వాణిజ్యం వీటిలో సోషలిస్టు పరివర్తన తెచ్చేందుకు మనపార్టీ ప్రజలకు నాయకత్వం వహించి, పరిపూర్ణమైన నిర్ణయాత్మకమైన విజయం సాధించింది. ఈ రెండు విజయాల

వల్ల మన దేశంయొక్క ఆంతరంగిక సంబంధాలలోను, విదేశ సంబంధాలలోను అత్యంతప్రధానమైన మార్పులు వచ్చాయి.

ఇప్పటికీ అమెరికా దురాక్రమణదారుల స్వాధీనంలో వున్న తైవాన్‌దీవిని మినహాయిస్తే, గత వంద సంవత్సరాలుగా మన ప్రజల నెత్తినెక్కి పెత్తనం చేస్తూ వచ్చిన విదేశ సామ్రాజ్యవాద శక్తులన్నింటినీ మన మాతృదేశంనుంచి మెడ పట్టి బయటకు గెంటివేశాం. చైనా దేశం స్వతంత్ర సర్వాంసహాధికారంకల్గిన మహాదేశంగా రూపొందింది.

## వివిధ వర్గాల పరిస్థితి

విదేశ సామ్రాజ్యవాదానికి కీలుబొమ్మగా తయారైన నిరంకుశ గుత్తాధిపత్య పెట్టుబడిదారీవర్గాన్ని చైనాభూభాగంలో నామరూపాలు లేకుండా మొత్తంగా తుడిచిపెట్టేశాం.

బహు కొద్ది ప్రాంతాలను మినహాయిస్తే, ఫ్యూడల్ భూస్వాములనుకూడా మొత్తంగానే రద్దుచేశామని చెప్పవచ్చు. ధనికరైతులనుకూడా ఒకవర్గంగా రద్దుచేసే కార్యక్రమం కొనసాగుతోంది. ఇంతకు పూర్వం రైతులను దోచుకుంటూన్న భూస్వాములలోను, ధనికరైతులలోను మానసిక పరివర్తన తీసుకొచ్చి, వారు నూతన తరహా జీవితాన్ని ప్రారంభించేటట్టు, స్వయంగా కష్టించి జీవించేటట్టు చేస్తున్నాం.

జాతీయబూర్జువావర్గానికి చెందిన వారిలో మానసిక పరివర్తన ప్రారంభమైంది. వారు దోపిడీదార్ల జీవితం విరమించి, శ్రామిక జీవితం ప్రారంభించారు.

రైతాంగంలో అత్యధికులు, ఇతర శ్రమజీవులు సమిష్టి కృషిలో నిమగ్నులైన సోషలిస్టు శ్రమజీవులుగా మారి పోయారు.

రాజ్యాంగ నిర్వహణలో కార్మికవర్గం నాయకత్వం వహించే వర్గంగా మారింది. దానిసంఖ్య పెరిగింది. వర్గ చైతన్యం ఆ వర్గంలో బాగా వేరూనింది. ఆ వర్గంయొక్క సాంస్కృతిక సాంకేతిక స్థాయి బాగా వృద్ధి చెందింది.

మేధావుల భావాలుకూడా మార్పుచెందాయి; తత్ఫలితంగా ఆ వర్గం సోషలిజంకోసం పాటుబడే సుసంఘటిత శక్తిగా తయారైంది.

మన దేశంలోని జాతులన్నీ కలిసి ఒక సమైక్య సోదర కుటుంబంలా జీవిస్తున్నాయి.

కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన గల నూతన ప్రజాతంత్ర ఐక్య సంఘటన మరింత విస్తృత ప్రాతిపదికపై పటిష్ఠవంతమైంది.

సుస్థిరశాంతికోసం, మానవాభ్యుదయంకోసం సోవియట్ యూనియన్ నాయకత్వాన కృషిచేస్తున్న సోషలిస్టుశిబిరంలో మన దేశం సముచిత స్థానం ఆక్రమించింది. సోవియట్ మహాదేశంతోనూ, నూతన ప్రజాతంత్ర దేశాలతోనూ అభేద్యమైన స్నేహ సహకార సంబంధాలను నెలకొల్పుకుంది. అమెరికా దురాక్రమణను అరికట్టి, కొరియా దేశాన్ని ఆదుకునేందుకు మన దేశ ప్రజలు జయప్రదంగా యుద్ధం సాగించి, సామ్రాజ్య

వాద దురాక్రమణదారుల ఉన్మత్త ప్రవర్తనను అరికట్టారు. అంతర్జాతీయ సంబంధాలలో సహజీవనానికి సంబంధించిన పంచశీలాలను తు. చ. తప్పకుండా పాటించాలని మన దేశం కోరుతోంది. ప్రపంచంలో మన దేశంయొక్క ప్రతిష్ఠ పెరిగింది.

## ప్రజల్లో విప్లవోత్సాహం

ఈ పరిణామాలన్నిటిఫలితంగా, మన దేశంలోని 60 కోట్ల జనానీకంలో అపూర్వమైన విప్లవోత్సాహం, విప్లవోత్తేజం వెల్లి విరిశాయి: అంతేకాదు, ప్రపంచప్రజల దృష్టియావత్తు చైనా దేశం పైకి మళ్ళింది; పీడిత జాతులకు, పీడిత ప్రజలకు నూతన ఆశాజ్యోతిగా అది కన్పించసాగింది.

చైనా దేశాన్ని సాధ్యమైనంతత్వరలో సోషలిస్టు మహా దేశంగా అభివృద్ధి చేయటమే ఈ నాడు మన పార్టీముందున్న ముఖ్య కర్తవ్యం. అందుకోసం విముక్తిపొందిన, సుసంఘటితు లవుతున్న కోటానుకోట్ల ప్రజలపై మనం ఆధారపడాలి; ఇంటా బయటా ఏకత్రాటిపైకి తీసుకరావటానికవకాశంవున్న శక్తు లన్నిటిని సమైక్యం చేయాలి. మనకు అనుకూలంగా వున్న పరి స్థితులన్నింటినీ పూర్తిగా సద్వినియోగం చేసుకోవాలి. ఆవిధంగా చైనాను సాధ్యమైనంత త్వరగా సోషలిస్టు మహాదేశంగా అభి వృద్ధి చేయాలి.

ఈ గురుతర కర్తవ్యాన్ని జయప్రదంగా నిర్వర్తించ గలగాలంటే, గతంలో మనం సాగించిన పోరాటాల అనుభవాల మంచి గుణపాఠాలు గ్రహించాలి; మన దేశంలో సోషలిస్టు

పరివర్తనను పూర్తిచేయాలి; సోషలిస్టు నిర్మాణాన్ని యింకా జోరుగా సాగించాలి; మన దేశ రాజకీయ జీవితాన్ని యింకా బాగా తీర్చి దిద్దుతూ, సర్వగుణ శోభిత మొనర్చాలి. అంతర్జాతీయవ్యవహారాలను సరిగా నిర్వహించుకోవాలి. పార్టీని యితోధికంగా పటుతరం చేసుకోవాలి. మన మహాసభలో ఈ విషయాలన్నిటినీ చర్చించి, కాటిపైచేసే నిర్ణయాలు పార్టీ సభ్యులకు, దేశప్రజలకు నూతనోత్సాహమిస్తాయి. ఇప్పటికే సాధించిన విజయాల ప్రాతిపదికపై మరింత మహత్తరమైన విజయాలు సాధించటానికి అవి నూతనోత్తేజం కలిగిస్తాయి.

# 1. పరివర్తనదశలో పార్టీ సాధారణ కార్యవిధానం

పదకొండు సంవత్సరాలక్రితం జరిగిన పార్టీ సప్తమ మహాసభ ఈ క్రింది కర్తవ్యాన్ని పార్టీ ముందుంచింది:

"ప్రజలను కార్యాచరణకు పురిగొల్పండి. ప్రజా సైన్యం యొక్క సంఖ్యను పెంపొందించండి. దురాక్రమణదారులను ఓడించేందుకూ, నవచైనాను నిర్మించేందుకూ యింటా బయటా ఏక చ్ఛాత్రిపైకి తీసుకురావటానికి వీలున్న శక్తులన్నింటినీ సమైక్యం చేయండి."

ఈ కర్తవ్యాన్ని మనం 1949 లో పూర్తిచేశాం.

## కొమింటాంగ్ వినాశకర పంథా

అభివృద్ధి నిరోధకులు తరచు బుద్ధిపూర్వకంగానే వినాశకరపంథా అవలంబిస్తారు. పార్టీ సప్తమ మహాసభ దేశంలోని ప్రజాతంత్ర శక్తులతో కలిసి మిశ్రమ ప్రభుత్వం స్థాపించుదామని కొమింటాంగ్‌కు విజ్ఞప్తి చేయాలని నిర్ణయించింది.

జపానుపై యుద్ధం ప్రారంభమైన తొలి సంవత్సరాల లోనే జపానుకు వ్యతిరేకంగా ఐక్యకార్యాచరణకై మన పార్టీ కొమింటాంగ్‌తో ఒప్పందం కుదుర్చుకొంది. అటుతర్వాత, ముఖ్యంగా ప్రతిఘటనయుద్ధం (జపాను వ్యతిరేకయుద్ధం) ముగిసిన తర్వాత, అంతర్యుద్ధాన్ని నివారించాలన్న వాంఛతోను, శాంతి యుతంగా సామాజిక, రాజకీయ సంస్కరణలు తీసుకురావాలన్న దృష్టితోను మన పార్టీ అనేకసార్లు కొమింటాంగ్‌తో శాంతియుత సంప్రతింపులు సాగించింది. దేశంలో శాంతిని నెలకొల్పి పునర్నిర్మాణ కృషి సాగించే నిమిత్తం అనేక ఇతర ప్రజాస్వామిక పక్షాలతో కలిసి మనం 1946 లో కొమింటాంగ్‌తో ఒక ఒప్పందానికి వచ్చాం. కాని, అమెరికా సామ్రాజ్యవాదుల అండ చేరి అంట కాగిన కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులు ఆ ఒప్పందాన్ని ఉల్లంఘించి, దేశమంతటా పెద్ద ఎత్తున అంతర్యుద్ధాన్ని ప్రారంభించారు. చైనా ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్న శక్తులను — అంటే చైనాకమ్యూనిస్టుపార్టీని, తదితర అభ్యుదయ ప్రజా స్వామిక శక్తుల్నీ — సమూలంగా తుడిచిపెట్టాలనే దుర్బుద్ధితో వారు ఆయుద్ధాన్ని ప్రారంభించారు. కాని వారు తప్పుడు అంచ

నాలు వేసుకున్నారు. మన పార్టీ ఒకప్రక్క శాంతియుతమైన సంస్కరణలకోసం కృషిచేస్తూనే, మరొకప్రక్క ఏమాత్రం ఏమరపాటుకు లోనుకాకుండా జాగ్రత్తపడింది, ప్రజల ఆయుధాలను భద్రపరచింది. ఆనాటి మన కార్యవిధానం ఇది: కొమింటాంగ్ కనుక శాంతిని వాంఛిస్తూంటే, శాంతియుత పరిస్థితులలో అది సంస్కరణలు అమలు జరపకోరితే, అది నిజంగా ప్రజలకు శ్రేయోదాయకమైనదే; దానికోసం మనం శక్తివంచనలేకుండా కృషిచేస్తాం. ఆదేసమయంలో మరొకవిషయాన్ని కూడా మనం గుర్తించాం. కేవలం మన మొక్కరమే శాంతిని వాంఛిస్తున్నంత మాత్రాన శాంతి సిద్ధించదు; ఆనాడు పాలకపక్షంగావున్న కొమింటాంగ్ కూడా శాంతిని వాంఛిస్తేనే శాంతి సాధ్యపడుతుంది. అందువల్ల, ఒకవేళ సర్వసన్నద్ధమైన అభివద్ధి నిరోధకులు బుద్ధిపూర్వకంగా ప్రజలపై యుద్ధాన్ని రుద్దితే, వారి ప్రయత్నాలను వమ్ము చేసేందుకుకూడా మనం తగినంతగా సన్నద్ధమై వున్నాం. ప్రజాశక్తులన్నింటినీ సమీకరించి, వారిని ఓడించటానికీ, యుద్ధాగ్నిజ్వాలలు రగిల్చినవారిని ఆ అగ్నిగుండంలోకి త్రోసి శలభాల్లాగా పూడ్చటానికీ మనంసిద్ధంగానే వున్నాం. మనం ఆనాడు అనుసరించిన కార్యవిధానం సరియైనదేనని చరిత్ర నిరూపించింది. ప్రజాశక్తులను సర్వనాశనం చేయాలని బయలుదేరిన దుష్టశక్తులే ప్రజాశక్తుల జగన్నాథ రథచక్రాలక్రింద సర్వనాశనం అయాయి.

ప్రజలు అభివృద్ధి నిరోధకులవలె యుద్ధప్రియులు కారు. అందువల్ల మనం యుద్ధకాలంలో సహితం సాధ్యమైన ప్రతి

చోట, శాంతియుతపద్ధతులలో విముక్తిని సాధించటంకోసం కృషి చేశాం. పెకింగ్, స్యూయాన్, చాంగ్షా, కున్మింగ్, పశ్చిమ జెగువాన్, సింకియాంగ్, టిబెట్ లను శాంతియుతంగా విముక్తి చేయటానికి సంప్రతింపులు జరిపి, అందులో కృతకృత్యులమయాం కూడా. కాని, ప్రజలు విధిలేక ఆయుధాలను చేపట్ట వలసిన పరిస్థితు లేర్పడినప్పుడు, అది వారి తప్పుకాదుగదా! అలాంటి పరిస్థితులు ఏర్పడినప్పుడుకూడా ప్రజలు ఆయుధాలు చేపట్టరాదనీ, దాడిచేసే శత్రువుకు లొంగిపోవాలనీ చెప్పటం అవకాశవాదవంథా తప్ప వేరుకాదు. రాజకీయాధికారం హస్తగతం చేసుకోటానికి పరిస్థితులు ప్రతిపక్షమైవున్నపుడు విప్లవ మార్గం చేపట్టటమా, అవకాశవాదపంథా అనుగమించటమా అన్నప్రశ్న ఉత్పన్నమైంది. పైగా అది 60 కోట్లమంది ప్రజలకు సంబంధించిన ప్రశ్న. మనపార్టీ విప్లవమార్గమే చేపట్టింది. కనుకనే ఈనాడు చైనాలో ప్రజారాజ్యం అవతరించింది.

చైనాలో ప్రజారాజ్యం ఏర్పడటంతోను, కార్మికవర్గం కోటానుకోట్ల రైతులతో పటుతరమైన ఐక్యతను సాధించడంతోను దేశమంతటా పరిపాలనాధికారం కార్మికవర్గం చేతిలోకి వచ్చింది. కార్మికవర్గపార్టీయైన కమ్యూనిస్టుపార్టీ దేశంమొత్తంపై రాజ్యాధికారం నిర్వహించటంలో నాయకపాత్రను నిర్వహించసాగింది. అందుచేత, నూతన ప్రజాతంత్ర నియంతృత్వాం నిజానికి కార్మికవర్గనియంతృత్వమే నని చెప్పాలి. ఆవిధంగా మనదేశంలో బూర్జువాప్రజాతంత్ర విప్లవాన్ని సరాసరి శాంతియుతపద్ధతులలో కార్మికవర్గ - సోషలిస్టు విప్లవంగా పరివర్తన

చేయడం సాధ్యపడింది. చైనా ప్రజారాజ్యం అవతరించటం తోనే మనదేశంలో బూర్జువా ప్రజాతంత్ర విప్లవం ప్రధానంగా పరిపూర్తి అయిందనీ, కార్మికవర్గ సోషలిస్టువిప్లవం — అంటే పెట్టుబడిదారీవిధానం నుంచి సోషలిజానికి పరివర్తన చెందే దశ — ప్రారంభమైందనీ చెప్పవచ్చు.

## పరివర్తన దశయొక్క ముఖ్యలక్షణాలు

మన దేశంలో పరివర్తన దశకు సంబంధించిన ప్రధాన లక్షణాలు ఏమిటి ?

ఒకటి : మన దేశం పారిశ్రామికంగా వెనుకబడివుంది. సోషలిస్టు వ్యవస్థను స్థాపించాలంటే, ముందుగా మనం సోషలిస్టు పరిశ్రమలను, ముఖ్యంగా భారీపరిశ్రమలను నెలకొల్పుకోవాలి. తద్వారా వ్యవసాయ దేశంగావున్న చైనాను పారిశ్రామిక దేశంగా అభివృద్ధిచేయాలి. అయితే ఇది జరగటానికి చాలాకాలం పడుతుంది.

రెండు : మన దేశంలో కార్మికవర్గానికి మిత్రులు గ్రామాలలోని రైతాంగం, పట్టణాల్లోని పెటీబూర్జువావర్గంమాత్రమేకాదు; జాతీయ పెట్టుబడిదారీ వర్గంకూడా కార్మిక వర్గానికి మిత్రులే. ఈ కారణంవల్ల, మన పాత ఆర్థిక వ్యవస్థను పరివర్తన చేయటానికి వ్యవసాయం, చేతిపరిశ్రమల విషయంలోనే కాక, పెట్టుబడిదారీ పరిశ్రమలు, వాణిజ్యం విషయంలో కూడా శాంతియుత పరివర్తన పద్ధతులనే అవలంబించవలసి

వుంటుంది. దీనిని క్రమక్రమంగా సాధించవలసి వుంటుంది. ఇందుకుకూడా ఎంతో కాలం పడుతుంది.

## పార్టీ కార్యవిధానం

మన దేశంలోని యదార్థ పరిస్థితులను పరిగణనలోకి తీసుకొన్న పార్టీ కేంద్రకమిటీ, పరివర్తన దశలో మనపార్టీ ఈ క్రింది సాధారణ కార్యవిధానాన్ని అనుసరించాలని నిర్దేశించింది: క్రమక్రమంగా సోషలిస్టు పారిశ్రామికీకరణను సాధించాలి; అలాగే వ్యవసాయాన్ని, చేతిపరిశ్రమలను, పెట్టుబడిదారీ పరిశ్రమలను, వాణిజ్యాన్ని క్రమక్రమంగా దీర్ఘ కాలంలో సోషలిస్టు పరివర్తన కావించాలి. తొలుత 1952 లో, జాతీయ ఆర్థిక పునరుద్ధరణదశ పూర్తి కాగానే,మనం ఈ కార్యవిధానాన్ని ప్రకటించాం. 1954లో జాతీయ ప్రజా ప్రతినిధి సభ (పార్లమెంటు) దీనిని ఆమోదించింది. పరివర్తన దశలో ప్రభుత్వం నిర్వర్తించవలసిన కీలక కర్తవ్యం ఇదేనని చైనా ప్రజారిపబ్లిక్ రాజ్యాంగంలో స్పష్టంగా పేర్కొనబడింది.

పరివర్తనదశలో పార్టీ నిర్వర్తించవలసిన సాధారణ కార్యవిధానం ప్రతి రంగంలో మనం సాగించేకృషికి కరదీపిక లాంటిది. దానినుంచి విడివడి పెడమార్గంపట్టితే, ఇటు మితవాద పొరపాట్ల పూబిలోనో అటు అతివాద పొరపాట్ల కూపంలోనో కూరుకుపోవటం సంభవిస్తుంది.

పార్టీ సాధారణ కార్యవిధానంనుంచి విడివడి, మిత వాదంవైపు మొగ్గే పెడధోరణి మన పార్టీలో గత కొలది

సంవత్సరాలలో తలెత్తింది. ఈ పెడధోరణి గలవారు కేవలం బూర్జువా ప్రజాతంత్రవిప్లవమే విజయమవటంతో సంతృప్తి చెంది, అక్కడితో విప్లవాన్ని ఆపుచేయాలన్నట్లు వాదిస్తూ వచ్చారు. మన విప్లవాన్ని సోషలిస్టు విప్లవంగా మార్చటాన్ని వ్యతిరేకించారు. సోషలిస్టుమార్గంలో పార్టీ మొత్తం రైతాంగాన్ని ముందుకు తీసుకుపోగలదన్న విశ్వాసం వారికి లేదు. చైనాలో సోషలిస్టువ్యవస్థాపనకు మొత్తం ప్రజాసామాన్యాన్నంతటినీ పార్టీ నడవగలదన్న నమ్మకంవారికిలేదు. పార్టీ సాధారణ కార్యవిధానం నుంచి విడివడి, అతివాదంవైపు మొగ్గేపెడధోరణి కలవారుకూడా లేకపోలేదు. అలాంటి ధోరణికలవారు తెల్లవారేటప్పటికి దేశంలో సోషలిజం స్థాపించాలన్నట్లు వాదిస్తూవచ్చారు. మనదేశంలో జాతీయ బూర్జువావర్గాన్ని ఒక వర్గంగా తుడిచిపెట్టటంకోసం, ఏదోవిధంగా ఆవర్గంయొక్క ఆస్తిపాస్తులన్నింటినీ స్వాధీనం చేసుకొనేపద్ధతినిఅనుసరించాలని వారంటారు. లేదా పెట్టుబడిదారీవరి శ్రమలను, వాణిజ్యాన్ని దివాలా తీయించేందుకు ఏదోఒక చర్య తీసుకోవాలంటారు. సోషలిజంవైపు ఒక్కొక్క అడుగే వేసు కుంటూముందుకు సాగాలన్న విషయాన్ని వారు అంగీకరించరు. శాంతియుతపద్ధతులలో మనం సోషలిస్టు లక్ష్యంచేరుకోవచ్చు ననే నమ్మకం వారికిలేదు. ఈ రెండు పెడధోరణులను మనపార్టీ తిరస్కరించింది; వాటిని తీవ్రంగా ఖండించింది. మనపార్టీ కనుక ఈ రెండు ధోరణులలో ఏ ఒకదాన్ని ఆమోదించినా, సోషలి జాన్ని స్థాపించటం సాధ్యంకాదు. ఈ నాడు మనం ఇంత జయ ప్రదంగా సోషలిజాన్ని నిర్మిస్తూ వుండగలిగేవాళ్ళమూ కాదు.

పరివర్తన దశలోని సాధారణ కార్యవిధానం ప్రకారం, జాతీయార్థికాభివృద్ధికి మనం తొలిపంచవర్ష ప్రణాళికను ప్రారంభించాం. పరివర్తన దశకు సంబంధించిన కీలక కర్తవ్యాన్ని నిర్వర్తించటానికి మూడు పంచవర్ష ప్రణాళికల కాలం పడుతుందని పార్టీ కేంద్రకమిటీ మొదట్లో అంచనావేసింది. దేశాన్ని పారిశ్రామికవంత మొనర్చటానికి మూడు పంచవర్ష ప్రణాళికల కాలమో, అంతకన్న యింకా కాస్త యెక్కువకాలమో తీసుకుంటుందన్న విషయాన్ని తొలిపంచవర్ష ప్రణాళికను అమలు జరపటంలో మనం గడించిన అనుభవం కూడా ధృవీకరించింది. అయితే, మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలోనే సోషలిస్టు పరివర్తనను ప్రధానంగా పూర్తి చేయటం సాధ్యమని యిప్పుడు తేలిపోయింది. కాగా, ఏవో కొన్ని ప్రాంతాలను మినహాయిస్తే, రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలో సోషలిస్టు పరివర్తన పూర్తి చేయబడుతుంది.

## 2. సోషలిస్టు పరివర్తన

వ్యవసాయంలోను, చేతిపరిశ్రమల్లోను, పెట్టుబడిదారీ పరిశ్రమల్లోను, వాణిజ్యంలోను సోషలిస్టు పరివర్తన తీసుకురావటంలో మనం యిప్పటికే నిర్ణయాత్మకమైన విజయం సాధించాం.

ఈ సంవత్సరం జూన్ మాసాంతంవరకు సేకరించిన సంఖ్యా వివరాలనుబట్టి, చైనా దేశంలోగల మొత్తం 12 కోట్ల రైతు

కుటుంబాలలో 11 కోట్ల కుటుంబాలు — అంటే నూటికి 91.7 వంతులు — వ్యవసాయ సహకార సంస్థలలో చేరి నట్లు స్పష్టమవుతోంది. వ్యవసాయసహకారసంస్థలలో చేరిన కుటుంబాలలో 3½ కోట్ల కుటుంబాలుమాత్రం ప్రాథమిక స్వభావంగల్గిన సహకారసంస్థలలో వున్నారు. మిగతా 7½ కోట్ల కుటుంబాలు — అంటే అత్యధికమైన కుటుం బాలు — ఉన్నత స్థాయికిచెందిన వ్యవసాయసహకారసంస్థ లలో చేరివున్నారు. పశుగణాభివృద్ధి విషయంలోకూడా పరస్పర సహాయ సహకారాలు వృద్ధిచెందాయి.

దేశమంతటాగల చేతిపరిశ్రమదారులు వివిధరూపాల ఉత్పత్తిసహకారసంస్థలలో సభ్యులుగా చేరారు. మొత్తం చేతిపరిశ్రమలలో నూటికి 90 మంది పారిశ్రామిక ఉత్పత్తి సహకారసంస్థలలోనైతేనేమి, ఉత్పత్తి సహకార గ్రూపులలో నైతేనేమి, సరఫరా — విక్రయసహకార సంస్థలలోనైతేనేమి సభ్యులుగా చేరారు. వ్యక్తిగతంగా చేపలుపట్టుకొని జీవించే వారిలోను, ఉప్పు తయారుచేస్తూ జీవించేవారిలోను, రవాణా వృత్తులలో కష్టపడి జీవిస్తున్నవారిలోను చాలామంది సహకార సంస్థలలో సభ్యులయ్యారు.

ఇక పెట్టుబడిదారీ పరిశ్రమల్లోను, వాణిజ్యంలోనుచాలా భాగం ప్రభుత్వ - ప్రయివేట్ సంయుక్త నిర్వహణ క్రిందికి వచ్చాయి.

వ్యక్తిగత వ్యాపారస్తులుకూడా సాధారణంగా సహకార సంస్థలలో సభ్యులుగా చేరిపోయారు. వారు ప్రభుత్వం తరఫున

కొనుగోలు చేసే, లేదా సహకార వాణిజ్యం సాగించే సంస్థలలో చేరటమో, వాటితరఫున కమీషన్ ఏజెంట్లుగా పని చేయటమో జరుగుతోంది.

1955 ఉత్తరార్థభాగంలో మన దేశమంతటా సోషలిస్టు పరివర్తన ఉద్యమం ఉవ్వెత్తున మహావెల్లువగా విజృంభించిన సమయంలోనే మనం చాలవరకు ఈ విజయాలను సాధించాం.

ఈ సోషలిస్టు పరివర్తన వెల్లువ ఏదో ఆకాశంనుంచి హఠాత్తుగా ఊడిపడలేదు. 1949 లగాయతు మన దేశంలో పరిణామం చెందుతూ, పరిపక్వమవుతూన్న వివిధ సామాజిక పరిస్థితుల పర్యవసానమే ఆ మహావెల్లువ.

## పారిశ్రామిక విధానం

చైనా దేశ ఆర్థిక నవనాడులను తమ గుప్పెట్లో పెట్టుకొన్న నిరంకుశ పెట్టుబడిదారీ వర్గంచే నిర్వహించ బడుతున్న పరిశ్రమ లన్నింటినీ, చైనా ప్రజా ప్రభుత్వం హస్తగతం చేసుకొంది. అలా హస్తగతం చేసుకొన్న పరిశ్రమలలో జపాను లొంగిపోయిన తర్వాత కొమింటాంగ్ ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్న జపాను, జర్మనీ, ఇటాలియన్ పరిశ్రమలుకూడా వున్నాయి. వాటన్నిటినీ సోషలిస్టు పరిశ్రమలుగా, ప్రభుత్వ యాజమాన్యం క్రిందవున్న పరిశ్రమలుగా మార్చివేశాం. పెద్దపెద్ద బ్యాంకులను, దాదాపు అన్ని రైల్వే మార్గాలను, ఇనుము ఉక్కు పరిశ్రమల్లో ఎక్కువవాటిని, భారీ పరిశ్రమల్లో కీలకభాగాలను, వాడుకం వస్తువుల నుత్పత్తిచేసే

పరిశ్రమలలో ప్రజావసరమైన శాఖలను ప్రజాప్రభుత్వం స్వాధీనం చేసుకొంది. దీనివల్ల మన ఆర్థిక వ్యవస్థలో సోషలిస్టు రంగానికి పునాది ఏర్పడింది; నాయకత్వ స్థానం సిద్ధించింది.

అటుతర్వాత ప్రభుత్వ యాజమాన్యంక్రిందవున్న పరిశ్రమలను, రవాణా శాఖలను, అభివృద్ధిచేయటానికి ప్రజాప్రభుత్వం కృషిచేసింది. 1949 లో జరిగిన మొత్తం పారిశ్రామికోత్పత్తిలో ప్రభుత్వ పరిశ్రమల ఉత్పత్తి 26.3 శాతం మాత్రమే; కాగా, 1952 లో అది 41.5 శాతానికి, 1955 లో 51.3 శాతానికి పెరిగింది.

## బ్యాంకులు

వ్యక్తుల ఆధీనంలోగల అన్ని బ్యాంకులను, తాకట్టు శాలలను (మనీషాప్స్) ప్రజాప్రభుత్వం సర్వ సమన్వితమైన ప్రాతిపదికపై ప్రభుత్వ—ప్రయివేట్ బ్యాంకులుగా మార్చింది. అలాంటి బ్యాంకులన్నీ ఈనాడు ప్రభుత్వ బ్యాంకులకు లోబడి పని చేస్తున్నాయి. బ్యాంకురుణాలు, భీమా వ్యాపారం, వెండి బంగారు వ్యాపారం, విదేశీ మారకం—ఇవన్నీ కూడా ప్రస్తుతం ప్రభుత్వం చేతిలో కేంద్రీకృతమై ఉన్నాయి. విదేశ వాణిజ్యాన్నీ విదేశ మారకాన్నీ కంట్రోలుచేసే పద్ధతిని ప్రజాప్రభుత్వం అమలు జరుపుతోంది. దేశమంతటా వస్తు సరఫరా, విక్రయ సహకార సంస్థలను ప్రజాప్రభుత్వం స్థాపించింది. తద్వారా దేశ వ్యాప్తమైన, ఒకేవిధమైన, బలీయమైనప్రభుత్వ వాణిజ్యవ్యవస్థను రూపొందించి, ప్రధానమైన పారిశ్రామిక ముడి సరుకులపైన,

ప్రధానమైన వాడకం వస్తువులపైన కంట్రోలు సంపాదించింది. వాణిజ్య వృత్తులన్నిటినీ క్రమంగా జాతిపరంచేసింది. దేశీయ మార్కెట్టులో సోషలిస్టు వాణిజ్యంయొక్క అగ్రస్థానాన్ని పటిష్ఠ మొనర్చింది.

మన దేశంలో బలీయమైన సోషలిస్టు ఆర్థికవిధానం వృద్ధిచెందటంవల్ల వ్యవసాయంలోను, చేతి పరిశ్రమలలోను, పెట్టుబడిదారీపరశ్రమలలోను, వాణిజ్యంలోను సోషలిస్టు పరివర్తనతీసుకురావటానికి భౌతికపునాది ఏర్పడింది. అయితే సోషలిస్టు పరివర్తనను తీసుకొచ్చే సందర్భంలో మనం చైనాదేశ పరిస్థితులను దృష్టిలోవుంచుకొని తమ కార్యవిధానాలు రూపొందించుకోవాలి; చర్యలు గైకొనాలి. ఎందుకంటే మన రైతులలో అధికసంఖ్యాకులు, చేతిపరిశ్రమలలో ఉన్నవారిలో అత్యధికులు ఉత్సాహంగా సమిష్టి ఆర్థికవిధానాన్ని స్వీకరించటానికి, జాతీయపెట్టుబడిదారీవర్గంఅంటే అయిష్టత చూపకుండా సోషలిస్టు పరివర్తనను అంగీకరించటానికి ఆపని చేయటం చాలా అవసరం.

మనం రూపొందించిన కార్యవిధానాలు, అమలు జరుపుతున్న చర్యలు ఏమిటి ? వ్యవసాయం, చేతిపరిశ్రమలు, పెట్టుబడిదారీపరిశ్రమలు, వాణిజ్యం — వీటి సోషలిస్టు పరివర్తనకు సంబంధించిన ఉద్యమాన్ని గురించి సంగ్రహంగా ఇక్కడ ప్రస్తావించడం అవసరం.

## వ్యవసాయ రంగంలో మన కృషి

మొదట వ్యవసాయ రంగంలో సోషలిస్టు పరివర్తనను ఎలా తీసుకొస్తున్నామో చూదాం.

సమగ్రమైన భూసంస్కరణలను పూర్తిగా అమలు జరిపిన పిమ్మట మనం వ్యవసాయ సహకారోద్యమాన్ని ప్రారంభించాం. వ్యవసాయ సంస్కరణలు అమలుజరిపేటప్పుడుకూడా మనపార్టీ కేవలం పరిపాలనా ఉత్తర్వులను జారీచేసి రైతులకు భూములను పంచిపెట్టే సునాయాస పద్ధతిమీదనే ఆధార పడలేదు. ప్రజారాజ్యం అవతరించినతర్వాత, మూడేళ్ళపాటు రైతాంగంలో, ముఖ్యంగా పేదరైతుల్లో వర్గచైతన్యం ఉద్దీపింప చేయటానికి మనం అహర్నిశలు కృషిచేశాం. ఆసందర్భంలోనే ఎప్పటికప్పుడు ప్రజల భావాలను తెలుసుకొంటూ, వాటి ప్రకారం కార్య విధానాలను రూపొందించే ప్రజామార్గం అవలంబించాం. తద్వారా రైతాంగంలో నూతనవర్గ చైతన్యం తీసుకువచ్చి, రైతులే స్వయంగా వ్యవసాయసంస్కరణ పోరాటాన్ని సాగించేటట్లు చేయగలిగాం. దానికోసం అంతకాలం వెచ్చించటం అనవసరమేనా - అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. పూర్తిగా అవసరమనే మన అభిప్రాయం. ఎందుకంటే, మనం అనుసరించిన పద్ధతివల్ల రైతు ప్రజాసామాన్యం తమ కాళ్ళ మీద తాము నిలబడ్డారు. తమంతట తాము సుసంఘటితులయ్యారు. కమ్యూనిస్టుపార్టీ సారథ్యాన్ని, ప్రజాప్రభుత్వ నాయకత్వాన్ని వారు తు. చ. తప్పకుండా అనుసరించారు. గ్రామాలలోని పరిపాలనా బాధ్యతలను, సాయుధబలాల నిర్వహణను

వారు తమ చేతులలోకి తీసుకున్నారు. ఆవిధంగా, వ్యవసాయ సంస్కరణలు అమలు జరపటంవల్ల ఆర్థికరంగంలో భూస్వాము లను ఒక వర్గంగా తుడిచిపెట్టగలగటమే కాక, ధనికరైతులను చాలవరకుబలహీనవర్గగలగటమే కాక, రాజకీయంగాభూస్వాము లను ఒక వర్గంగా కూలద్రోయటం, ధనిక రైతులను వేరు చేయటంకూడా సాధ్యపడింది. చైతన్య విలసితులైన అశేష రైతుజనానీకం భూస్వాముల పీడనను, ధనికరైతుల దోపిడీని హేయమైన విషయంగా పరిగణించసాగారు. ఆవిధంగా ఉత్త రోత్తరా వ్యవసాయ రంగంలో తీసుకురావలసిన సోషలిస్టు పరివర్తనకు సుముఖమైన పరిస్థితులు ఏర్పడ్డాయి. వ్యవసాయ సహకారోద్యమం మరింత త్వరిత గతిని అభివృద్ధి చెందటానికి అవకాశమేర్పడింది.

విప్లవానికి పూర్వం చైనా గ్రామీణ జనాభాలో నూటికి 60 లేక 70 వంతులు పేదరైతులుగానో వ్యవసాయ కూలీలుగానో వుండేవారు. పేదరైతులను మనం కార్మికవర్గ తుల్యులుగాను, వ్యవసాయ కూలీలను కార్మిక వర్గంగాను పరిగణించవచ్చు. బూర్జువా ప్రజాతంత్ర విప్లవంపట్ల మాత్రమే కాక, సోషలిస్టు విప్లవంపట్లకూడా వారు అత్యంతాసక్తిని వ్యక్తం చేశారు. వ్యవసాయ సంస్కరణలు అమలు జరిగినతరువాత, రైతుల ఆర్థిక పరిస్థితి బాగుపడింది. పేద రైతులలోను, వ్యవ సాయ కూలీలలోను చాలామంది మధ్యతరగతి రైతులుగా మారిపోయారుకూడా. అయినప్పటికీ గ్రామీణ ప్రజానీకంలో నూటికి 60 నుంచి 70 వంతులవరకు పేదరైతులుగానో, తత్తు

ల్యులుగానో వున్నారనే చెప్పాలి. చైనా గ్రామీణ ప్రాంతాలలో జన సాంద్రత అధికంగా వుండటమూ, సాగవుతున్న భూ విస్తీర్ణం తక్కువగా వుండటమూ అందుకు ముఖ్య కారణం. దేశంలో సాగుకు లాయకైన భూమి సగటున తల ఒకటికి మూడు 'మూ'లు మాత్రమే (అంటే అర ఎకరం). దక్షిణ చైనాలోని అనేక ప్రాంతాలలో సాగుకులాయకైన భూమి సగటున తల 1కి ఒక మూ లేక అంతకన్నా తక్కువ ఉంది. అందువల్ల పేద రైతులు ఎవరికి వారే సొంతంగా సేద్యం చేసుకొంటే సుఖప్రదమైన జీవితం గడపవచ్చునన్న హామీ లేదు. అందువల్ల గ్రామీణ జనాభాలో అత్యధికులుగావున్న పేదరైతులు, ఆర్థిక స్థితి అంత బాగాలేని రైతులు పార్టీ పిలుపును ఉత్సాహంతో అందుకొని, వ్యవసాయ సహకారపంథాను స్వీకరించటానికి యిష్టపూర్వకంగా ముందుకు వచ్చారు.

## వ్యవసాయ సహకారోద్యమం

వ్యవసాయసంస్కరణలు అమలుజరపటం పూర్తికాగానే దేశవ్యాప్తంగా పరస్పరసహాయక సంస్థలద్వారా వ్యవసాయోత్పత్తిని సాగించాలని రైతులకు మనం పిలుపుయిచ్చాం. రైతులంతాకలిసి,సమిష్టిగాపనిచేస్తారు కనుక, పరస్పరసహాయసంస్థలో సోషలిస్టుబీజం మొలకెత్తింది. రైతులు "ఎవరికివారే స్వయంగా సాగుచేసుకోటం"కన్నా, పరస్పరసహాయక సంస్థలద్వారా వ్యవసాయపనులు సాగించుకోటం లాభప్రదం కనుక 1952 లో మొత్తం రైతుకుటుంబాలలో నూటికి 40 వంతులు ఆ సంస్థలలో చేరాయి. 1954 నాటికి ఆశాతం 54 కు పెరిగింది. అలా

ఏర్పడిన పరస్పరసహాయకసంస్థల ప్రాతిపదికపై, సామ్యవాదతుల్యమైన వ్యవసాయోత్పత్తిదారుల సహకారసంస్థలను క్రమక్రమంగా నెలకొల్పాలని 1952 లో కేంద్రకమిటీ నిశ్చయించింది (రైతులు తమ భూములను షేరులరూపంలో సహకార సంస్థలకు అప్పగిస్తారు. ఆ ప్రోగుబడిన భూమిఅంతా ఒకే యాజమాన్యంక్రింద సాగుచేయబడుతుంది. అయితే భూమి, ప్రధానమైన ఉత్పత్తిసాధనాలు రైతులకే చెందివుంటాయి) ఇలాంటి సహకారసంస్థలు 1951 సంవత్సరాంతానికి దేశం మొత్తంమీద 300 మాత్రమే వుండేవి. అయితే పరస్పర సహాయకసంస్థలకన్నా కూడ ఈ సహకారసంస్థలు మరింత లాభదాయకమైనవని రైతులు గుర్తించేకొలదీ వాటిసంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. 1955 సంవత్సర పూర్వార్థభాగంలో వ్యవసాయోత్పత్తిదారుల సహకారసంస్థలు 6,70,000 కు పెరిగాయి. వాటిలో దాదాపు 1 కోటి 70 లక్షల రైతుకుటుంబాలు సభ్యులుగా చేరారు. రైతుప్రజాసామాన్యంలో వ్యవసాయ సహకారోద్యమంపట్ల గల ఉత్సాహాన్ని, ఆసక్తినీ పార్టీలోని యథాస్థితి వాదభావాలు కలవారు చంపుతున్నారని గ్రహించి కేంద్రకమిటీ, కామ్రేడ్ మావోసేటుంగ్ వెంటనే ఆ లోపాన్ని 1955 ఉత్తరార్థభాగంలో సరిదిద్దారు. దానితో వ్యవసాయ సహకార సంస్థల సంఖ్య మరీ విపరీతంగా పెరగసాగింది. తరువాత ప్రాథమిక తరహాకు చెందిన ఆ సహకార సంస్థలు త్వరత్వరగా ఉన్నత తరహాకు చెందిన సోషలిస్టు స్వభావం కలిగిన సహకారసంస్థలుగా మారిపోసాగాయి. సోషలిస్టు స్వభావంకల్గిన సహకారసంస్థలలో వ్యక్తిపరమైన

భూమి, ప్రధాన ఉత్పత్తి సాధనాలు కూడా సమిష్టిపరమై పోయాయి. దానివల్ల వ్యవసాయోత్పత్తిని మరింత సమర్థవంతంగా సాగించడం వీలైంది.

మనపార్టీ క్రమంగా ఒక చర్య తరువాత మరొకచర్య తీసుకోటమే సముచితమైన విషయమని అనుభవంకూడా రుజువు చేసింది. వ్యవసాయ సహకారోద్యమం వల్ల తమకు ఎంతో లాభం చేకూరుతుందని రైతులు స్వానుభవంలో గ్రహించేటానికి పార్టీ అనుసరించిన పద్ధతి ఉపయోగపడింది. సమిష్టి ఉత్పత్తి విధానానికి రైతులు క్రమంగా అలవాటుపడ్డారు. వ్యక్తిపరంగా వున్న భూములను, తద్వారా ప్రధానమైన ఉత్పత్తి సాధనాలను సమిష్టిపరం చేయటానికి రైతులు హృదయపూర్వకంగా, ఎలాంటి అయిష్టత వ్యక్తం చేయకుండా అంగీకరించారు. కనుక హఠాత్తుగా అమలు జరిపే మార్పులవల్ల కలిగే కష్టనష్టాలన్నింటిని నివారించటానికి, వాటిని చాలవరకు తగ్గించటానికి వీలు చిక్కింది.

వ్యవసాయ సహకారోద్యమం విషయంలో పార్టీ అనుసరించిన విధానం ఎట్టిదో చూదాం: పేదరైతులూ, వ్యవసాయ సంస్కరణలు అమలుజరిపిన తరువాత మధ్యతరగతి రైతులుగా మారినవారూ వ్యవసాయ సహకార సంస్థలలో నాయకత్వ స్థానం వహించేటట్లు పార్టీ జాగ్రత్తలు తీసుకొంది. అదేసమయంలో మధ్యతరగతి రైతులతో గట్టి ఐక్యతనుకూడా సాధించింది గ్రామీణప్రాంతాల జనాభాలో ఆర్థికంగా కాస్త సంపన్నవంతులైనమధ్యతరగతిరైతుల శాతం బహుకొద్దిదే అయినప్ప

త్రికీ, మధ్యతరగతి రైతులలో క్రిందివారిపైన, చివరకు పేదరైతులపైన వారిపలుకుబడి యిప్పటికీ ఎక్కువగానేవుంది. మన దేశంలో ఆర్థికంగా కాస్తసంపన్నవంతులైన మధ్యతరగతి రైతులంతా మొత్తంమీద కమ్యూనిస్టుపార్టీని, ప్రజాప్రభుత్వాన్ని బలపరుస్తున్నారనే చెప్పాలి. వారిలో వ్యవసాయసంస్కరణ వల్ల విముక్తి పొందినవారు చాలమంది ఉన్నారు. అయినప్పటికీ, వ్యవసాయ సహకారోద్యమం విషయం వచ్చేసరికి వారిప్పటికీ వూగిసలాటను ప్రదర్శిస్తూనేవున్నారు. మధ్యతరగతి రైతులతో ఐక్యతను పటుతరంచేయాలంటే, మనం యిష్టపూర్వక కార్య విధానానికి తు. చ. కట్టుబడివుండాలి. వ్యవసాయసహకారోద్యమం ఉభయ తారకమైనదన్న విషయం మధ్యతరగతి రైతులను నచ్చచెప్పాలి. 'ఇష్టపూర్వకం, ఉభయతారకం' అన్న విధానాన్ని అందరి విషయం లో, ముఖ్యంగా మధ్యతరగతి రైతుల విషయంలో, పాటించాలి అయితే ఇష్టం లేని మధ్యతరగతి రైతులను బలవంతాన వ్యవసాయ సహకార సంస్థలలో చేర్పించటం నిషిద్ధమని మాత్రమే చెప్పి పార్టీ పూరుకోదు; వ్యవసాయ సహకార సంస్థలు స్థాపించబడిన తొలి దశలో, పేద రైతులను, తత్తుల్యులైన వారిని మాత్రమే మొదట సభ్యులుగా చేర్చుకోవాలనీ, ఆర్థికంగా కాస్త సంపన్నులైన మధ్యతరగతి రైతులను సర్వసాధారణంగా చేర్చుకోవద్దనీకూడ పార్టీ స్పష్టంచేసింది. అంతేకాదు; మధ్యతరగతి రైతులు సహకారసంస్థలలో చేరేముందుగాని, చేరిన తర్వాతగానీ వారి ప్రయోజనాలను భంగపర్చటం కూడదనికూడా పార్టీ హెచ్చరించింది; అలాగే మధ్యతరగతి రైతులుకూడా సహకార

సంస్థల పరంచేసే తమ ఉత్పత్తి సాధనాలను సాకుగా తీసుకొని, స్వార్థం ఈడేర్చుకోటానికి ప్రయత్నించరాదని హెచ్చరించింది. కనుక పేదరైతుల ప్రయోజనాలను భంగపర్చటానికి మధ్య తరగతి రైతులకు పార్టీ ఏమాత్రం అవకాశం ఈయజాలదని వేరే చెప్పనక్కర్లేదు. ఆహారధాన్యాల విషయంలో ప్రభుత్వం అనుసరించిన సరియైన విధానంకూడా మధ్యతరగతి రైతులలో చక్కగా పనిచేసింది. ఆహారధాన్యాలను, తదితర వ్యవసాయ సరుకులను ప్రణాళికాబద్ధమైన పద్ధతిలో ఖరీదుచేసే, అమ్మే ఏర్పాటును ప్రభుత్వం 1953 లో అమలుజరిపింది; వ్యవసాయ సరుకులకు సరసమైన ధరలను నిర్ణయించింది. దానితో మార్కెట్టులో వ్యవసాయసరుకులపై వ్యాపారం సాగిస్తూ ఆర్జించే పెట్టుబడిదారీ లాభాలు అంత మొందించబడ్డాయి. ఎంత ధాన్యాన్ని ఖరీదుచేయాలి అన్న విషయాన్ని ప్రభుత్వం 1955 లో మరొకసారి నిర్ణయించి, లోగడ జరిగిన పొరపాటును దిద్దుకొంది. ఆ సంవత్సరానికి అవసరమైన ధాన్యంకన్నా 7 వేల కట్టీలు ఎక్కువధాన్యాన్ని ఖరీదుచేయాలన్న పూర్వనిర్ణయాన్ని ప్రభుత్వం మార్చుకొంది. దానివల్ల ప్రభుత్వం ఎక్కువ ధాన్యాన్ని బలవంతాన ఖరీదుచేసుకుపోతుందన్న అపోహాలు రైతులలో లేకుండాపోయాయి. మధ్యతరగతిరైతులతో ఐక్యత సాధించాలన్న కార్యవిధానాన్ని పార్టీ అనుసరించినందువల్లనూ, పెట్టుబడిదారీమార్గం చేపట్టాలనుకోటం ఇక వెర్రితనమేనని మధ్యతరగతిరైతులు గుర్తించినందువల్లనూ, సహకారసంస్థల శ్రేష్ఠతను వారు గ్రహించినందువల్లనూ సహకారసంస్థలు స్థాపించినందువల్ల ఉత్పత్తి హెచ్చుతున్నదని వారు గమనించి

నందువల్లనూ, మధ్యతరగతి రైతులలో అధికసంఖ్యాకులు తమ వూగిసలాటనుంచి బయటపడి, సహకారసంస్థలలో చేరుతాా మంటూ ఉత్సాహంతో ముందుకొచ్చారు.

ఇకపోతే, లోగడ భూస్వాములుగా వున్నవారి విషయంలోను, ధనిక రైతుల విషయంలోను పార్టీ అనుసరించిన విధానం ఏమిటో చూద్దాం. నిన్న మొన్నటిదాకా భూస్వాములుగా వున్నవారు, ధనిక రైతులు సహకారోద్యమ కార్యకలాపాలను దెబ్బ తీయకుండా అరికట్టేందుకు వారి ప్రయత్నాలు వమ్ము చేసేందుకు గత కొలది సంవత్సరాలలోను పార్టీ రైతులను ఆయత్తపర్చింది. వ్యవసాయ సహకారోద్యమం ప్రారంభమైన తొలిదశలో పూర్వపు భూస్వాములను, ధనిక రైతులను అసలు సహకారసంస్థలలో చేరనీయలేదు. వ్యవసాయ సహకారోద్యమం పూర్తిగా విజయవంతమైనట్లు రూఢి ఐన తర్వాతనే, వారిని సహకార సంస్థలలో చేరనిచ్చాం. "పనిని బట్టి వేతనం" అన్నసూత్రం వారి విషయంలో కూడ వర్తింప చేశాం. అయితే ఆయా స్థానిక పరిస్థితులనుబట్టి వారికి విభిన్నమైన ప్రతిపత్తి (స్టేటస్) యివ్వవచ్చునని నిర్ణయించాం. వారిలో మానసిక పరివర్తన తీసుకువచ్చి, నూతన జీవితం ప్రారంభించటానికి వారికి అవకాశం కల్పించాలన్న దృష్టితో ఆపనిచేశాం.

పైన పేర్కొన్న కార్యవిధానాలను అనుసరించి నందువల్ల వ్యవసాయ సంస్కరణలు అమలుజరిపిన అనంతరం నాలుగు సంవత్సరాలలోనే దేశమంతటా వ్యవసాయరంగంలో సోషలిస్టు పరివర్తనను ప్రధానంగా పూర్తి చేయగలిగాం. ఆ

విధంగా దేశవ్యాప్తంగా వివిధ తరహాలకు చెందిన ప్రాథమిక తరహా మొదలుకొని ఉన్నత తరహా వరకు చెందియున్న దాదాపు ఒకకోటి వ్యవసాయ ఉత్పత్తి దారుల సహకార సంస్థలలో 11 కోట్ల రైతుకుటుంబాలను చేర్పించగలిగాం.

## చేతిపరిశ్రమల రంగం

ఇక చేతి పరిశ్రమలలోను, వ్యష్టిపరమైన ఇతర రంగాలలోను సోషలిస్టు పరివర్తనను ఎలా తీసుకొచ్చామో యిప్పుడు పరిశీలిద్దాం.

ఏదో కొద్దిమందిని మినహాయిస్తే, మన దేశంలోని వ్యక్తిగత చేతి పరిశ్రమదారులలో అత్యధికులు తాము తయారు చేసే సరుకులను స్వయంగా అమ్ముకోలేని స్థితిలో వున్నారు. అందుకు వారు ప్రభుత్వ వాణిజ్యశాఖలపైన ఆధారపడవలసి వస్తోంది. అలాగే సరుకులకోసం, తమ సరుకులను విడుదల చేసుకొనేందుకు, పెట్టుబడి ఋణాలకు సరఫరా విక్రయ సహకార సంస్థలపైననో, పెట్టుబడిదారీ పారిశ్రామిక సంస్థలపైననో ఆధారపడవలసి వస్తున్నది. వారిలో చాలామంది పరిస్థితి నికృష్టంగా తయారైంది. జబ్బుపడినా, గాయపడినా, చనిపోయినా మరే ఆధరువు లేకుండా పోతోంది. వారి ఉత్పత్తి విధానం చాలా పురాతనమైనది; ఆధునిక యంత్రాలు రానటంతో వారి వృత్తి నశించిపోయే ప్రమాదం వచ్చినట్లుగా వారు భావించారు. అందువల్ల ఆర్థిక వ్యవస్థలో ప్రసన్న [illegible] నాయకత్వాన తామంతా ఒక్కటై తమను ఎదుర్కొనే కష్టా

లను అధిగమించవచ్చునని వారు ఆశిస్తున్నారు మొత్తం జాతీయ ఆర్థిక వ్యవస్థయొక్క ప్రయోజనాల దృష్ట్యా చూవినా, చేతి పరిశ్రమల ఉత్పత్తిని కొనసాగిస్తూ దాన్ని పెంపొందించవలసిన అవసరంవుంది. దేశీయ మార్కెట్టుయొక్క అపారమైన అవస రాలను తీర్చగలగటం మాత్రమే కాక, విదేశీ మార్కెట్టు అవస రాలనుకూడా చేతి పరిశ్రమలు కొంతవరకు తీర్చగలవు. చైనా దేశంలో వ్యక్తిగత జాలరులు, ఉప్పు పరిశ్రమదారులు, లాగుడు బండి కార్మికులు, మోతమోసే ముఠా కార్మికులు చిన్నచిన్న వ్యాపారస్తులు, చిల్లర బేరగాళ్ళు, గణనీయమైన సంఖ్యలో వున్నారు. వారి పరిస్థితికూడా చేతి పరిశ్రమదారుల పరిస్థితి మాదిరిగానే నికృష్టంగా వుంది.

చేతి పరిశ్రమలలోను, చేపలుపట్టేవృత్తిలోను, ఉప్పు పరిశ్రమలోను, రవాణా వృత్తులలోను సోషలిస్టు పరివర్తనను సాధారణంగా సహకారపద్ధతులపై సాధించవలసియుంటుంది. గత కొలదిసంవత్సరాలలోను ఈరంగాలలో సహకారోద్యమం ఉర కలు వేసుకుంటూ ముందుకుసాగింది. 1955 సం॥ నాటికి మొత్తం చేతిపరిశ్రమదారులలో నూటికి 29 మంది చేతిపరిశ్రమదారుల సహకారసంస్థలలో సభ్యులుగా చేరారు. అయితే, ఈ సంవత్సరం పూర్వార్థభాగంలో చేతిపరిశ్రమదారుల సహకారోద్యమం మహోధృతంగా ముందుకు పోయింది. కొత్తగా స్థాపించబడిన ఈ సహకార సంస్థలలో కొన్ని ఉత్పత్తిదారుల గ్రూపులనుంచి పరివర్తన చెందాయి. అయితే ఈసహకారసంస్థలలో ఎక్కువ భాగంమాత్రం సరాసరి సహకారసంస్థల రూపంలో స్థాపించ

బడ్డాయి. ఇవిగాక, పెట్టుబడిదారీ పద్ధతులలో నిర్వహించబడు తున్న చేతిపరిశ్రమలలో చిన్నభాగం, అలాగే నావలు, ఎడ్ల బళ్ళు కూడా పెట్టుబడిదారీ పరిశ్రమలు, వాణిజ్యంతోపాటే ప్రభుత్వ — ప్రయివేట్ సంయుక్త యాజమాన్యంలోకి తీసుకు రాబడ్డాయి.

చిన్నచిన్న వ్యాపారస్తులు, చిల్లర బేరగాళ్ళు కూడా వాణిజ్య రంగంలోని వ్యక్తిగత పరిశ్రమ దారులే. సోషలిస్టు పరివర్తనలో వారు సహకారమార్గం చేపట్టారు. సహకార స్టోర్స్‌ను, సహకార గ్రూపులను వారు స్థాపించుకొన్నారు. వాటిలో కొన్ని సహకార సంస్థలు పెట్టుబడిదారీ పరిశ్రమలు వాణిజ్యంతోపాటే, ప్రభుత్వ-ప్రయివేట్ సంయుక్త యాజమాన్యం లోకి వచ్చాయి. చిన్న వ్యాపారస్తులు, చిల్లర బేరగాళ్ళు కలిసి స్థాపించుకొన్న సహకార గూ్రపులు ప్రభుత్వ వాణిజ్యశాఖల తరఫున, సరఫరా విక్రయ సహకార సంస్థల తరఫున కమిషన్ ఏజెంట్లుగా పనిచేస్తున్నాయి. సహకార గ్రూపులకు చెందినవారు సాగించే వ్యాపారం పూర్వ పద్ధతులలోనే, కొనుగోలు తిరిగి అమ్మే పద్ధతిలోనే సాగుతూంది. విక్రయదారులకుకూడా ఆ పద్ధతి అనుకూలమైనది. సామాజిక అవసరాలదృష్ట్యా ఆ వ్యాపార నిర్వహణలో పాతపద్ధతులే కొనసాగించబడుతాయి.

### పెట్టుబడిదారీ పరిశ్రమలు

చివరకు పెట్టుబడిదారీ పరిశ్రమలలోను, వాణిజ్యంలోను సోషలిస్టు పరివర్తనను ఎలా తీసుకొచ్చామో చూదాం.

మన దేశంలో ప్రబలమైన స్థానం ఆక్రమించుకొని కూర్చున్న బడా బూర్జువావర్గం సామ్రాజ్యవాదులతో లాలూచీపడ్డ నిరంకుశ బూర్జువావర్గం. ఇంతకుముందే వివరించినట్లు, విప్లవక్రమంలో ఆ వర్గాన్ని మొత్తంగా తుడిచిపెట్టివేశాం. విప్లవానికిపూర్వం చైనాలో ఒకప్రక్క జాతీయబూర్జువావర్గానికీ, మరొకప్రక్క సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, నిరంకుశబూర్జువా వర్గాలకూ మధ్య వైరుధ్యాలుండేవి. బూర్జువా ప్రజాతంత్రవిప్లవదశలో జాతీయబూర్జువావర్గం ద్వంద్వాత్మక పాత్ర నిర్వహించింది. ఒకవైపు ఆ వర్గం సామ్రాజ్యవాదానికీ అభివృద్ధినిరోధక కొమింటాంగ్ పాలనకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో, కొన్ని పరిస్థితులలో పాల్గొనటానికి సిద్ధపడింది; మరొకవైపు ఆపోరాటంలో తరచు వూగిసలాడుతూ రాజీపడటానికికూడ సంసిద్ధతను వ్యక్తంచేస్తూ వచ్చింది. చైనాలో ప్రజారాజ్యం నెలకొన్నతర్వాత, నూతన ప్రజాతంత్ర నియంతృత్వాన్ని బలపర్చటానికి ఆ వర్గం సిద్ధపడింది; సమిష్టికార్యక్రమాన్నీ, ప్రజాపాలననూ ఆమోదించింది. సామ్రాజ్యవాదాన్ని ఇకముందుకూడా వ్యతిరేకించటానికి ఆ వర్గం సుముఖంగావుంది. వ్యవసాయసంస్కరణలు అమలుజరపాలని కోరింది. అయితే పెట్టుబడిదారీవిధానాన్ని అభివృద్ధిచేయాలన్న బలీయమైన వాంఛకూడా ఆ వర్గానికి లేకపోలేదు. అందువల్ల జాతీయబూర్జువావర్గం విషయంలో మనం అనుసరించే విధానం గతంలోవలెనే ఇకముందుకూడా ఒకవైపు సఖ్యతనెరపుతూ, అదేసమయంలో పోరుసాగించేదిగా వుంటుంది. ఆవిధంగా మనం పోరాటంద్వారా ఐక్యతను సాధించాలి ఇంకా వివరంగా

చెప్పాలంటే, కార్మిక - కర్షక ఐక్యసంఘటన ప్రాతిపదికపై కార్మికవర్గం జాతీయబూర్జువావర్గంతో రాజకీయసఖ్యత నెరపు కొంటూ వుంటుంది. ఆర్థికదృష్టితో చూస్తే, పెట్టుబడిదారీ పరిశ్రమలకు, వాణిజ్యానికి రెండు లక్షణాలున్నట్టు ద్యోతకం కాగలదు. ఒకటి: జాతీయసౌభాగ్యానికి, ప్రజల జీవనప్రమాణాభివృద్ధికి ప్రయోజనకరమైన మంచి లక్షణాన్ని అవి కలిగియున్నాయి. కనుకనే పెట్టుబడిదారీ పరిశ్రమలను, వాణిజ్యాన్ని ఉపయోగించుకొంటూ, వాటిని పరిమితంచేస్తూ, సోషలిస్టు పరివర్తన చెందేటట్లు చూడాలనే విధానాన్ని ప్రభుత్వం అనుసరిస్తోంది. ఇందుకు అనుగుణంగానే కార్మిక వర్గం జాతీయ బూర్జువావర్గంతో ఆర్థికసఖ్యతను (ఎకనమిక్ ఎలయన్స) స్థాపించుకొన్నది. జాతీయ ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వరంగం పెట్టుబడిదారీరంగంపై ఆధిపత్యం కలిగియుందన్న సంగతి ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి. ఆవిధంగా ప్రభుత్వపెట్టుబడిదారీవిధానానికి చెందిన వివిధరూపాలద్వారా క్రమక్రమంగా పెట్టుబడిదారీ వ్యష్టి యాజమాన్యవ్యవస్థ సోషలిస్టు సమిష్టి యాజమాన్యవ్యవస్థగా పరివర్తన చెందేటట్లు చూస్తున్నాం.

పెట్టుబడిదారీ పరిశ్రమలను, వాణిజ్యాన్ని ఉపయోగించుకొనే విధానం జాతీయ బూర్జువా వర్గానికి ఆమోదకరమైనందున మాత్రమేకాక, పరివర్తనదశలో ఆ విధానం అనుసరించవలసిన ఆవశ్యకత ఉన్నందువల్ల కూడా దానిని ప్రభుత్వం అవలంబిస్తోంది. మన దేశం విముక్తమైన తరువాత తొలి రోజులలో సామ్రాజ్యవాద దోపిడీలవల్ల అభివృద్ధి

నిరోధక కొమింటాంగ్ ముఠా పాలనవల్ల ఛిన్నాభిన్నమైన జాతీయ ఆర్థిక వ్యవస్థను పునరుద్ధరించటానికి మనం భగీరథ ప్రయత్నం చేయవలసివచ్చింది. అంతేకాక, మన దేశ ఆర్థిక విధానం వెనుకబడి వుండటం, చిన్నఎత్తున ఉత్పత్తి చేసే విధానమే ప్రబలంగా వుండటం కారణంగా, అందుబాటులో వున్న ఆర్థిక శక్తులన్నింటినీ ఉపయోగంలోకి తీసుకురావలసిన అవసరం ఏర్పడింది. ఆ విధంగా ఉపయోగించుకొని, జాతీయ ఆర్థిక వ్యవస్థను త్వరత్వరగా మనం పునరుద్ధరించుకొన్నాం. అభివృద్ధి చేసుకొన్నాం. గత కొలది సంవత్సరాలలోను ప్రభుత్వ రంగంయొక్క అభివృద్ధికి అగ్ర తాంబూలమిస్తూ, "ఇటు పబ్లిక్ ప్రయోజనాలను, అటు ప్రయివేట్ ప్రయోజనాలను పరిగణనలోకి తీసుకొని, ఇటు కార్మికులకు అటు పెట్టుబడి దారులకు లాభదాయకమైన" విధానాన్ని మనం అనుసరించాం. ముడిసరుకుల కేటాయింపు, తదితర విషయాలలో మొత్తంమీద ప్రయివేట్ రంగాన్నికూడా సమానదృష్టితోనే చూస్తూ వచ్చాం. ఆ విధంగా వ్యక్తుల యాజమాన్యంలో పని చేసే కార్మికులకు నిరుద్యోగబాధ లేకుండా తప్పించాం; పెట్టుబడి దారులుకూడా లాభాలు ఆర్జించుకోగలిగారు. ఈ విధానంవల్ల జాతీయ సౌభాగ్యానికీ, ప్రజల జీవనాభివృద్ధికీ ప్రయోజనకారి యైన, పెట్టుబడిదారుల పథకంలోగల పరిశ్రామిక వాణిజ్య సంస్థలు మూలపడకుండా పనిచేశాయి; కొంతవరకు అవిఅభివృద్ధి చెందాయికూడా. మన జాతియ ఆర్థిక వ్యవస్థను పునరుద్ధరించుకొని, అభివృద్ధి చేసుకొనేదశలో జాతీయ ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వరంగానికి పెట్టుబడిదారీ పరిశ్రమలు, వాణిజ్యం చేదోడు

వాదోడుగా ఉపకరించాయని మన అనుభవం చాటుతోంది. పెట్టుబడిదారీ పరిశ్రమలను, వాణిజ్యాన్ని ఉపయోగించుకొనే విధానాన్ని అనుసరించినందువల్ల, రైతులకు అవసరమయ్యే సరకులను కొంతవరకు సమృద్ధిగా సరఫరాచేస్తూ, వాటికి మారుగా రైతులు పండించే ఆహార ధాన్యాలను, పారిశ్రామిక ముడి సరుకులను, తదితర వ్యవసాయ సరుకులను సేకరించ టానికి ప్రభుత్వానికి వీలు చిక్కింది; మార్కెట్టులో ధరలను స్థిరీకరించటానికి దోహద మిచ్చింది. అయితే మనం అనుస రించిన ఈ విధానం పెట్టుబడిదారీ విధానాన్ని హద్దూ పద్దూ లేకుండా అభివృద్ధి చెందనిచ్చే విధానంమాత్రంకాదు. జాతీయ సౌభాగ్యానికిగానీ, ప్రజల జీవనాభివృద్ధికిగానీ ప్రయో జన కరంకాని వినాశకర లక్షణాలుకూడా పెట్టుబడిదారీ పరి శ్రమలలోను, వాణిజ్యంలోను వుంది. ఈ వినాశకరలక్షణాన్ని అదుపాజ్ఞలలో పెట్టే విధానాన్ని కూడా ప్రభుత్వం అమలు జరిపితీరాలి. పెట్టుబడిదారీ పరిశ్రమలను, వాణిజ్యాన్ని ఒక ప్రక్క ఉపయోగించుకుంటూనే మరొక ప్రక్క వాటిని పరిమితం చేసేవిధానాన్ని మనం అనుసరిస్తున్నాం.

పెట్టుబడిదారీ పరిశ్రమల పైన, వాణిజ్యంపైన ప్రభు త్వం విధించే పరిమితులకూ బూర్జువావర్గంయొక్క సంకుచితవర్గ ప్రయోజనాలకూ మధ్య ఘర్షణలు తలెత్తక మానవు. అనేక మంది పెట్టుబడిదారులు ఈ పరిమితులను వ్యతిరేకిస్తారు; వాటిని ఉల్లంఘించటానికి ప్రయత్నిస్తారు. పరిమితుల విధింపు, విధించిన పరిమితులకు ప్రాతికూల్యం—ఈ రెంటి మధ్యనే ప్రధానంగా

గత కొలది సంవత్సరాలుగా మన దేశంలో వర్గపోరాటం సాగు తోంది. ముఖ్యమైన వర్గవైరుధ్యం - కార్మిక వర్గానికీ, బూర్జువా వర్గానికీగల వైరుధ్యం - అదే. ప్రజారాజ్యం నెలకొన్నప్పటి నుంచీ, ప్రభుత్వ రంగానికీ ప్రయివేట్ రంగానికీ మధ్య పోరాటం "పరిమితుల విధింపు, విధించిన పరిమితులకు ప్రాతికూల్యం" అనే రూపంలోనే సాగుతూంది. పన్నుల విధింపు; మార్కెట్టు ధరలు; ప్రయివేట్ పరిశ్రమలకు ఉత్పత్తి సరుకులకోసం అదనపు ఆర్డర్లు ఏమరతులపై యివ్వాలి; ప్రయివేట్ పరిశ్రమలలో తయారయ్యే వస్తువులను ప్రభుత్వం ఏమరతులపై ఖరీదుచేయాలి, విక్రయిం చాలి; ప్రభుత్వం తరఫున ప్రయివేట్ పారిశ్రామిక సంస్థలు చిల్లర పంపిణీదారులుగాను, కమీషన్ ఏజెంట్లుగాను ఏమరతు లపై పనిచేయాలి—మున్నగురూపాలలో ఆపోరాటం వ్యక్తమవు తూంది. ఈ విషయంలో 1950 వసంతకాలంలో విశృంఖలమైన లాభార్జనకు వ్యతిరేకంగాను, ధరల స్థిరీకరణకొరకు ప్రధానమైన పోరాటాలు సాగించాం. అటు తరువాత 1952 లో 'పూఫాన్' ఉద్యమం నడిపాం (పూఫాన్ ఉద్యమం అంటే అయిదు దుష్టచర్య లకు వ్యతిరేకంగా సాగించబడిన ఉద్యమం. ఆ అయిదు దుష్ట చర్యలు ఇవి: ప్రభుత్వోద్యోగులకు లంచాలివ్వటం, పన్నులను ఎగవేయటం, ప్రభుత్వ ఆస్తిని దొంగిలించటం, కాంట్రాక్టులలో ప్రభుత్వాన్ని మోసగించటం, ప్రభుత్వ వర్గాలనుంచి ఆర్థిక సమాచారాన్ని కాజేయటం.) పెట్టుబడిదారులలో అనేకమంది జాతీయసౌభాగ్యానికి, ప్రజలజీవితానికి భంగకరమైన విధంగా చట్టవిరుద్ధచర్యలు జరిపారు కనుక ఈపోరాటాలు సాగించవలసి వచ్చింది ఆ చట్ట విరుద్ధ కార్యకలాపాలను అరికట్టటానికి తీవ్ర

మైన చర్యలు తీసుకోవలసివచ్చింది. ఈ పోరాటాలు సాగించే సందర్భంలో పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థపై అమితమైన పరిమితులు అమలు జరిపే పొరపాటుచేయకుండాను, అవసరమైన దానికన్నా ఎక్కువ పరిమితులు విధించే తప్పిదం చేయకుండాను జాగ్రత్తలు తీసుకొన్నాం. ఈ పోరాటాల విషయంలో పార్టీ యొక్క, ప్రభుత్వంయొక్క కీలకవిధానం ఇది: చట్ట విరుద్ధ కార్యకలాపాలు సాగిస్తున్న కొంతమంది పెట్టుబడిదారులను ప్రజలనుంచి, బూర్జువావర్గంనుంచికూడా వేరు చేయాలన్న దృష్టితోనే ప్రభుత్వచట్టాలను ఉత్తర్వులను పాటించటానికి సిద్ధంగాఉన్న పెట్టుబడిదారులలోని అధిక సంఖ్యాకులను సమీకరించాలన్న లక్ష్యంతోనే మనం ఆపోరాటాలుసాగించాం.

## ప్రభుత్వ పెట్టుబడిదారీవిధానం

పెట్టుబడిదారీపరిశ్రమలలోను, వాణిజ్యంలోను సోషలిస్టు పరివర్తన తీసుకురావాలన్న లక్ష్యంతో ప్రభుత్వంవాటిని ఉపయోగించుకుంటూ పరిమితం చేయాలన్న విధానాన్ని పార్టీ అమలు జరిపింది. ఈ పరివర్తన రెండు అంచెలలోపూర్తవుతుంది. పెట్టుబడిదారీ విధానాన్ని ప్రభుత్వపెట్టుబడిదారీ విధానంగా పరివర్తన చెందేటట్టు చేయుటం మొదటి అంచె; అటుతర్వాత పెట్టుబడిదారీ విధానాన్ని సోషలిజంగామార్చటం రెండో అంచె. కార్మికవర్గ నాయకత్వాననగల రాజ్యంలో ప్రభుత్వపెట్టుబడిదారీవిధానం అంటే అర్థంఏమిటి? మనమే పరిమితులను నిర్ణయించి, అలా నిర్ణయించిన పరిమితులను అమలుజరపగల పెట్టుబడిదారీవిధానమే ప్రభుత్వ పెట్టుబడిదారీవిధానం అని

లెనిన్ వివరించారు. ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం అనేది ఒక పరివర్తన దశ మాత్రమే. ఆదశలో క్రమంగా పరివర్తనను ఆమోదించేందుకు జాతీయబూర్జువావర్గానికిఅవకాశం కల్పిస్తాం; ప్రభుత్వ నాయకత్వాన, కార్మికవర్గ నాయకత్వానఆ పరివర్తన కొనసాగుతుంది. పారిశ్రామికముడిసరుకులపైప్రభుత్వానికిగుత్తాధిపత్యం వుంది. మొదట పరిశ్రమలవిషయం చూదాం: 1950 లో అమలుజరిగిన పద్ధతిప్రకారం ప్రయివేటు పారిశ్రామిక సంస్థలకు ప్రభుత్వమేముడిసరుకులను సరఫరా చేస్తుంది. ఆ పరిశ్రమలలో తయారయ్యే సరుకులకుప్రభుత్వమే ఆర్డరిస్తుంది; ప్రయివేటు పరిశ్రమలలో తయారయ్యే వస్తువులనుప్రభుత్వమే ప్రత్యేకంగా ఖరీదుచేసిఅమ్ముతుంది. ఈవిధంగా తొలిచర్యగా, ప్రయివేటుపరిశ్రమలను ప్రభుత్వపెట్టుబడిదారివిధానం పరిధిలోకి తీసుకొచ్చాం. 1954 వచ్చేసరికి, పెట్టుబడిదారీ పరిశ్రమలలో సోషలిస్టు పరివర్తన తీసుకొచ్చేందుకు మరికొన్నిచర్యలు తీసుకొన్నాం. వ్యక్తుల యాజమాన్యంలోగల పరిశ్రమలను ఒక క్రమపద్ధతిలో ప్రభుత్వ-ప్రయివేట్ సంయుక్తయాజమాన్యంలోకితీసుకొచ్చాం. ఆవిధంగా వ్యక్తులయాజమాన్యంలోగల ముఖ్యమైన పెద్దపెద్ద పారిశ్రామిక సంస్థలలో చాలాభాగం ప్రభుత్వ - ప్రయివేట్ సంయుక్తయాజమాన్యంలోకి వచ్చాయి. ఇక పోతే వాణిజ్యం విషయంచూదాం. ప్రధానమైన వ్యవసాయ, పారిశ్రామిక వస్తువులన్నింటిపైనా ప్రభుత్వ సహకార వాణిజ్య సంస్థలద్వారా ప్రభుత్వం గుత్తాధిపత్యం సంపాదించింది కాబట్టి, ప్రయివేట్ వాణిజ్యసంస్థలకు ప్రభుత్వం మొత్తం సరుకులన్నింటిని అమ్మి,

వాటిచేత సరియైన ధరలకు అమ్మించే ఏర్పాట్లు చేయగల్గుతోంది. 1954 నాటికి, ప్రాథమికమైన ప్రభుత్వ పెట్టుబడిదారీ స్వభావాన్ని కలిగియున్న వాణిజ్య సంస్థలసంఖ్య—అంటే ప్రభుత్వం తరపున చిల్లర పంప కందార్లుగాను, కమీషన్ ఏజంట్లుగాను పనిచేస్తున్న వాణిజ్య సంస్థలసంఖ్య-గణనీయంగా అభివృద్ధి చెందింది. 1955 ఆకు రాలుకాలం సీతాకాలంమధ్య వ్యవసాయ సహకారోద్యమం పరవళ్ళు తొక్కుతుంటూ పొంగులు వారటంతో, గ్రామీణ ప్రాంతాలలో పెట్టుబడిదారీవిధానం కలకాలానికి తిరిగి తలెత్త కుండా అరికట్టటానికి ఆ విధంగా ప్రాతిపదికను సమకూర్చ గలిగాం. తద్వారావర్గశక్తుల బలాబలాల్లో ప్రధానమైనమార్పు తీసుకొచ్చాం. పెట్టుబడిదారీ పరిశ్రమలను, వాణిజ్యాన్ని మొత్తంగా ప్రభుత్వ - ప్రయివేట్ సంయుక్త యాజమాన్యం లోకి తీసుకురానటానికి పరిస్థితులను పరిపక్వ మొనర్చాం. ఒకే శాఖకు చెందినపరిశ్రమన్నలన్నింటిని ప్రభుత్వ—ప్రయివేట్ యాజమాన్యంలోకి తీసుకురావటం అన్నది మన దేశంలో ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం యొక్క అత్యున్నతరూపం అని చెప్పవచ్చు. అంతేకాదు, పెట్టుబడిదారీ యాజమాన్యాన్ని సమ గ్రమైన సోషలిస్టు సమిష్టి యాజమాన్యంగా మార్చటంలో అది ఒక గొప్ప నిర్ణయాత్మకమైన చర్య అని చెప్పవచ్చు.

ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానంద్వారా, అంటే శాంతి యుత పరివర్తన పద్ధతులలో, సోషలిజాన్ని సాధించటంకోసం బూర్జువావర్గం వ్యక్తిగత యాజమాన్యంలోగల ఉత్పత్తి సాధ నాలను జాతిపరం చేయటానికి కొంత ధనమిచ్చి క్రమక్రమంగా

స్వాధీనం చేసుకొనే విధానాన్ని మనం అనుసరిస్తున్నాం. ఒకే శాఖకు చెందిన ప్రయివేట్ పరిశ్రమలను మొత్తంగా ప్రభుత్వ - ప్రయివేట్ సంయుక్త యాజమాన్యంలోకి తీసుకు రావటానికి ముందు, ఆయా పరిశ్రమలలో వచ్చే నికరలాభాలలో కొంత వాటాను (అంటే నాలుగోవంతు) పెట్టుబడిదారులకు కేటాయించాం. ఆపరిశ్రమలను మొత్తం ప్రభుత్వ—ప్రయివేట్ సంయుక్త యాజమాన్యంలోకి తీసుకొచ్చిన తర్వాత పెట్టుబడిదారులకు వారి పెట్టుబడిపై కొంతకాలం వరకు ప్రభుత్వం నిర్ణీతమైన వడ్డీ చెల్లించే పద్ధతిని అమలుజరుపుతున్నాం. అంతేకాదు; పనిచేయగలిగిన స్థితిలోవున్న పెట్టుబడిదారులకు, వారి ప్రతినిధులకు ప్రభుత్వశాఖలు పనులను చూపించాయి. పనిచేయలేని. వారి బ్రతుకుతెరువుకు ఆధరువు చూపించాయి. కొంత ధనమిచ్చి స్వాధీనం చేసుకొనే విషయంలో ఈ చర్య కూడా అవసరమే. కొన్ని చారిత్రక పరిస్థితులలో కార్మికవర్గం కొంత ధనమిచ్చి బూర్జువావర్గంయొక్క ఆ స్తిపాస్తులను స్వాధీనం చేసుకొనే విధానాన్ని అనుసరించవచ్చుననీ, ఆవిధానం ప్రయోజనకరమైనదనీ మార్క్సు, లెనిన్ లిద్దరూ స్పష్టంచేశారు ఈ విధానం సరియైనదేనని మనవిప్లవక్రమంలోకూడా రూఢిఅయింది.

## పెట్టుబడిదారులలో మానసిక పరివర్తన

పెట్టుబడిదారీవిధానంలో సోషలిస్టు పరివర్తన తీసుకు వచ్చే క్రమంలో, ఒకప్రక్క పరిశ్రమలలో అట్టి పరివర్తన తీసుకొస్తూనే, మరొకప్రక్క వ్యక్తులలోకూడా మానసికపరివర్తన తీసుకురావడానికి కృషిచేశాం. ఇంకా స్పష్టంగా చెప్పా

లంటే, పరిశ్రమలలో పరివర్తన తీసుకొస్తూనే, మరొకప్రక్క పెట్టుబడిదారులలో క్రమంగా బోధనాపద్ధతులద్వారా మానసిక పరివర్తన తీసుకురావటానికి పనిచేశాం. దోపిడిదారులుగా వుంటున్న పెట్టుబడిదారులు నిజమైన శ్రమజీవులుగా మారి, కష్టపడి జీవించటానికి అవకాశం కల్గిస్తున్నాం. జాతీయబూర్జువా వర్గంతో వెంటనే సమైక్యమై, ఆ వర్గానికి వ్యతిరేకంగా పోరాడుతూ, పోరాటాలద్వారా ఐక్యతను స్థాపించాలన్న మన విధానం యొక్క ప్రధానలక్ష్యం పెట్టుబడిదారులలో మానసికపరివర్తన తీసుకరావటమే. పెట్టుబడిదారీరంగం పై విధించే పరిమితులు, బూర్జువావర్గం సాగించే చట్టవిరుద్ధకార్యకలాపాలకు వ్యతిరేకంగా మనం సాగించే పోరాటాలు ఆచరణలో పెట్టుబడిదారులకు కనువిప్పుకావటానికి తోడ్పడతాయి. ప్రయివేట్ పరిశ్రమలలో మార్పులు తీసుకువచ్చి సమగ్రమైన ఏర్పాట్లుచేయటంద్వారాను, అన్నిపక్షాల ప్రయోజనాలను పరిగణనలోకి తీసుకొని సర్వసమన్వితమైన ప్రణాళికను తయారుచేయడంద్వారాను పెట్టుబడిదారులు సక్రమంగా తమ పాత్రను నిర్వహించటానికి వీలు కలుగుతుంది. వారికి కనువిప్పుకావటానికి ఇవికూడ తోడ్పడతాయి. సోషలిస్టుపరివర్తన క్రమంలో నిర్మాణాత్మక వైఖరిని అవలంబించినవారిని మనం హర్షించాం. కాగా, అనుమానపీడితులై వ్యవహరించినవారికి విషయాలు బోధించాం. వారు తమ అనుమానాలను నివృత్తిచేసుకొనేవరకు తొందరపడకుండా ఆగుతామనికూడా చెప్పాం. ఇకపోతే ప్రతిఘటించినవారికి వ్యతిరేకంగా అవసరమైనంతవరకు పోరాటం సాగించాం; అలాంటివారిలోకూడా మానసికపరివర్తన తీసుకు

రావాలన్నదే మన అభిమతం. ఈవిధంగా వివిధరకాల వ్యక్తుల పట్ల మనం వివిధరకాల వైఖరులను అవలంబించబట్టేకూడా, పెట్టుబడిదారులకు క్రమంగా వివేకోదయం అయింది.

అంతేకాదు. వారిలో మానసిక పరివర్తన తీసుకు రావటానికి మనం మరికొన్ని పద్ధతులుకూడా అవలంబించాం. వారిని సమావేశపర్చి ఉపన్యాసాలు ఏర్పాటుచేశాం; చర్చలు జరిపించాం; క్లాసులు పెట్టి బోధించాం పెట్టుబడి దారులను, వారి కుటుంబాలలోని వారిని సమీకరించి, అధ్యయనం ఏర్పాటుచేశాం. పెట్టుబడిదారులు తమలో తాము విమర్శ, ఆత్మ విమర్శ చేసుకొనేటట్లు ప్రోత్సాహించాం. వారికి విషయాలు బోధించి, సిద్ధాంత లికమకను పోగొట్టటానికి కృషి చేశాం. పెట్టుబడిదారులలో అభ్యుదయకరభావాలుగల, అంటే సోషలిస్టు పరివర్తనను సమర్థించేవారి సిద్ధాంత స్థాయిని పెంపొందించటంకోసం, మధ్యస్థవైఖరి నవలంబించినవారూ పాత మనస్తత్వం కలవారూ క్రమంగా తమ వైఖరులను మార్చు కొని, అభ్యుదయభావాలు కలిగినవారిని అనుగమించేటట్లు చేయటంకోసం కరడుగట్టిన యథాస్థితి వాదులను వేరుచేయ టానికి పైన పేర్కొన్న చర్యలు గైకొన్నాం. ఒక్కమాటలో చెప్పాలంటే, అధిక సంఖ్యాకులను సమీకరించి, ప్రతిఘటనను సాధ్యమైనంతవరకు నీరుగార్చి, సోషలిస్టు పరివర్తనను సుకరం చేయటమే మనం లక్ష్యంగా పెట్టుకొన్నాం.

ప్రభుత్వం పెట్టుబడిదారీ పరిశ్రమలను, వాణిజ్యాన్ని ఉప యోగించుకొంటూ పరిమితం చేయాలన్న విధానం, ఆ పాలిత

పదికపై గైకొనబడిన అనేక యితర చర్యలు కేవలం వాంఛాప్రేరిత ఆలోచన నుంచి గానీ, నిరంకుశ నిర్ణయా లనుంచిగానీ పుట్టుకొచ్చినవి కావు. అప్పట్లోవున్న వాస్త విక పరిస్థితులను జాగ్రత్తగా పరిశీలించినమీదట జాతీయ సౌభాగ్యానికి, ప్రజల జీవనాభివృద్ధికి సంబంధించిన తక్షణావస రాలను తీర్చేనిమిత్తం అవి రూపొందించబడ్డాయి. ఈ కార్య విధానాన్ని, దానిని అమలు జరపటానికి తీసుకొన్న చర్యలను అశేష ప్రజాసామాన్యం హర్షించారు; ఆమోదించారు. వాటిని తిరస్కరించటానికిగాని, వ్యతిరేకించటానికిగాని, పెట్టుబడిదారు లకు ఏమాత్రం ఆస్కారం లేదు. కరుడుకట్టిన కొద్దిమంది యథాస్థితివాదులను మినహాయిస్తే — వీరు యింకా ప్రతి ఘటనను కొనసాగించటానికే యత్నిస్తున్నారు. ఆ రీకరంగంలో జాతీయ బూర్జువా వర్గంలోని అత్యధికులచే సోషలిస్టు పరి వర్తనను అంగీకరించేటట్లు చేయటం, వారిని నిజమైన శ్రమ జీవులుగా మార్చటం సాధ్యమని యిప్పుడు ఖచ్చితంగా చెప్ప వచ్చు.

వ్యవసాయంలోను, చేతిపరిశ్రమలలోను, పెట్టుబడిదారీ పరిశ్రమలలోను, వాణిజ్యంలోను సోషలిస్టు పరివర్తన తీసుకు రావటానికి మనం సాగించినకృషిలో కొన్ని లోపాలు లేకపో లేదు. కొన్ని పొరపాట్లు జరగకపోలేదు. మొదటినుంచీ మన విధానం సర్వగుణసమన్వితంగా వుందని చెప్పలేం; మన విధానాన్ని అమలుజరపటంలోకూడా కొంత వరకు పెడ ధోరణి అవలంబించిన ఉదంతాలుకూడా లేకపోలేదు. ఏది

ఏమైనా ఒకటిమాత్రం నిజం. ఉత్పత్తిసాధనాలపై వ్యష్టి యాజమాన్యంగల వ్యవస్థను సోషలిస్టు సమిష్టి యాజమాన్యంగల వ్యవస్థగా మార్చటం ఎంతో కష్టమూ, క్లిష్టమూ అయినపని. అయినా మనం ఈవిషయంలో ప్రధానంగా కృతకృత్యులమయ్యామనే చెప్పవచ్చు సోషలిజం, పెట్టుబడిదారీ విధానం—ఈ రెండింటికి మధ్య మనదేశంలో జరుగుతున్న పోరాటంలో ఎవరు నెగ్గుతారు అన్న ప్రశ్నకు సమాధానమేమిటో స్పష్టంగా తేలిపోయింది.

## నిర్వర్తించవలసిన కర్తవ్యాలు

అయితే అంత మాత్రాన, సోషలిస్టు పరివర్తనను సాధించటంలో యికమనం చేయవలసింది ఏమీ లేదని అనుకొంటేమాత్రం పొరపాటే అవుతుంది. మనం వెంటనే పరిశీలించవలసిన అనేక ముఖ్యసమస్యలు న్నాయి.

తొలుత వ్యవసాయ సహకారోద్యమంలో మనం నిర్వర్తించవలసిన కర్తవ్యాలేమిటో చూదాం. ఇప్పటికీ సహకార సంస్థలలో చేరకుండా బయటనే వుండిపోయిన రైతు కుటుంబాలన్నింటినీ, "ఇచ్ఛాపూర్వం, ఉభయతారకం" అన్న విధానం ప్రాతిపదికపై, సహకార సంస్థలలో చేర్పించాలి. ప్రాథమిక స్వభావాన్ని కలిగియున్న వ్యవసాయ సహకార సంస్థలను ఉన్నత శ్రేణికి చెందిన సంస్థలుగా మార్చటానికి సరిగా దారి చూపాలి అయితే ఈ విషయంలో మనం ఓపికపట్టాలి. రైతుల అవగాహన పరిపక్వమయ్యేదాకా వేచివుండాలి. ఏ రూపంలో కూడా బలవంతం చేయటంగానీ, ఆజ్ఞలు జారీచేయటంగానీ

పరికిరాదు. మనం తక్షణమే పరిష్కరించవలసిన సమస్య ఒకటి వుంది. ఇప్పుడున్న వాటిల్లో కనీసం లక్ష సహకార సంస్థలలో నైనా ఉత్పత్తిని పెంచి, వాటి సభ్యుల ఆదాయం పెరిగేటట్లు చూడాలి. సాధ్యమైన ప్రతిచోటా ఇందుకోసం కృషిచేయాలి. ఆదరాబాదరా నెలకొల్పబడిన కొన్ని వ్యవసాయ సహకార సంస్థలలో అపరిష్కృతంగా మిగిలిపోయిన సమస్యలెన్నో వున్నాయి వాటిని తక్షణం పరిష్కరించనన్నా పరిష్కరించాలి. లేదా వాటి ప్రస్తుత నిర్మాణస్వరూపాన్ని మార్చనన్నా మార్చాలి. వందలకొలది రైతు కుటుంబాలచేత సమిష్టి పద్ధతిపై ఉత్పత్తి చేయించటంలో నాయకత్వం వహించగలిగిన అనుభవాన్ని యింకా అనేక సహకార సంస్థలు సంపాదించుకోనేలేదు. అలాంటి సహకార సంస్థలలో పనిచేస్తున్న కార్యకర్తలు సాధ్యమైనంత తక్కువ కాలంలో ఆ అనుభవాన్ని సంపాదించగలేటట్లు పార్టీ వారికి సహాయం చేయాలి. సమిష్టి ప్రయోజనాలను, సమిష్టి యాజమాన్య నిర్వహణను గురించి మాత్రమే అనేక సహకార సంస్థలు మితిమీరిన పద్ధతిలో నొక్కిచెబుతూ, వ్యక్తిగత ప్రయోజనాలను, సభ్యుల స్వేచ్ఛను, సభ్యులు తమ తమ యిళ్ళ దగ్గర చేసుకోవలసిన ఇతర పనులను విస్మరిస్తూ, పొరపాటు చేస్తున్నాయి. అలాంటి పొరపాట్లను త్వరగా సరిదిద్దుకోవాలి. సహకార సంస్థల ఉత్పత్తిని యితోధికంచేసి, పటిష్ఠవంత మైనర్చేందుకు వాటి సభ్యులలో చొరవను, ఉత్సాహాన్ని పెంపొందించాలి ; అందుకు కష్టపడి పనిచేస్తూ, ధనాన్ని దుబారా చేయకుండా, ప్రజాతంత్ర పద్ధతులలో వాటిని నడుపుతూ ఉండాలి. అదే సమయంలో సహకార సంస్థల సభ్యులకు సోష

లిజం గురించీ, సమిష్టితత్వం గురించీ యితోధికంగా బోధిస్తూ, వారి సిద్ధాంతస్థాయిని పెంపొందించాలి. నిన్న మొన్నటివరకు సొంతంగా సేద్యం చేసుకొంటున్న రైతులు యిప్పుడు సహకార సంస్థల సభ్యులుగా చేరారు; నిజంగా కోటానుకోట్ల రైతుల జీవితంలో వచ్చిన ఈమార్పు బ్రహ్మాండమైనది. ఈ మార్పుయొక్క అంతరార్థాన్ని సహకార సంస్థలలో పని చేస్తున్న కార్యకర్తలు పూర్తిగా గ్రహించి వాటి సభ్యులు తమకు అప్పగించిన నాయకత్వాన్ని చక్కగా నిర్వహించవలసి వుంటుంది; సహకార సంస్థలలోని సభ్యుల ప్రయోజనాలను ఆ కార్యకర్తలు కంటిలో పాపలాగా కాపాడుతూ పనిచేయ వలసివుంటుంది ఆ సంస్థలకు నిజంగా తామే అధిపతులమనీ, వీటా తమ ఆదాయం పెరగగలదనీ ఆ సంస్థల సభ్యులంతా భావించినప్పుడే, సహకార సంస్థలు సుస్థిరమౌతాయన్న వాస్తవిక విషయాన్ని మన కార్యకర్తలు గుర్తించి పనిచేయాలి.

చేతి పరిశ్రమల్లోను, అలాగే మన ఆర్థిక వ్యవస్థలో వ్యష్టి ప్రాతిపదికపై కొనసాగే తదితర వృత్తులలోను సోషలిస్టు పరివర్తన తీసుకురావటంలో మనకు, ఎదురవుతున్న సమస్యలను పరిశీలిద్దాం. చేతి పరిశ్రమలకు తదితరవృత్తులకు సంబంధించినంత వరకు అనేక తరహాలకు చెందిన సహకారసంస్థలు స్థాపించ బడ్డాయి వీటిలో రకరకాలైనసమస్యలుఉత్పన్నమవుతున్నాయి. వివిధ వృత్తులలోవుండే విశిష్ట లక్షణాలను దృష్టిలోకి తీసుకొని విభిన్న పద్ధతులలో ఆ యా సమస్యల మంచి చెడ్డలనుబట్టి వాటిని పరిశీలిస్తుండాలి. విభిన్నమైన నిర్దిష్టపరిస్థితులను విస్మరించి,

పిడుక్కీ బియ్యానికి ఒకే మాత్రింలాగా అన్ని సందర్భాల లోను ఒకే పరిష్కారమార్గం అనుసరించకూడదు. అనుకూల పరిస్థితులలో అనేక సహకార సంస్థలు ప్రభుత్వ సంస్థలుగా పరిణామం చెందుతాయి; లేదా ప్రభుత్వ సంస్థలలో లీనమై పోతాయి; ఉత్పత్తి సాధనాలను సమిష్టి యాజమాన్యంక్రిందికి తెచ్చేవిషయంలో మరికొన్ని సంస్థలకు చాలాకాలం పట్ట వచ్చు. ఇంకొన్ని సంస్థలు సోషలిస్టు పారిశ్రామిక సంస్థలకు లోబడి పనిచేస్తూనే, తమ సొంత నిర్వహణను నిలుపుకొంటూ లాభనష్టాలకు తాము బాధ్యత వహిస్తూ ఉండవచ్చు. ఉత్పత్తి విషయంలోను, నిర్వహణ విషయంలోను పాతవ్యష్టి ఆర్థిక విధానం సృష్టించిన సత్తాం ప్రదాయాలేమైనావుంటే వాటిని అభివృద్ధి చేయటానికి అన్ని తరహాలకు చెందిన సహకార సంస్థలు శ్రద్ధ వహించి పని చేయవలసి వుంటుంది. సహకార పద్ధతి అమలులోకి వచ్చిన పిమ్మట చేతి పరిశ్రమలలో తయారయ్యే వస్తువుల నాణ్యం పెరగాలేగాని తరిగి పోకూడదు. అలాగే వస్తువుల రకాలుకూడా అధికం కావాలేగాని, తగిపోకూడదు

పెట్టుబడిదారీ పరిశ్రమలలో, వాణిజ్యంలో సోషలిస్టు పరివర్తనక్రమాన్ని కొనసాగించే సందర్భంలో ఉత్పన్నమయ్యే సమస్యలను, వాటివాటి మంచిచెడులనుబట్టి పరిష్కరించాలి. పైన పేర్కొన్న విధంగానే వివిధవృత్తుల విశిష్టలక్షణాలను పరిగణనలోకి తీసుకొంటూ, సామాజిక ఆర్థికవిధానంలోని వివిధాంశాల అవసరాలను దృష్టిలో వుంచుకొని వాటిని పరిష్క

రించాలి. వివిధసందర్భాలలో మంచి చెడ్డలు గమనించకుండా ఒకేరకమైన పరిష్కారమార్గాన్ని అనుసరించటంవల్ల నష్టాలు వస్తాయి అందుచేత అలాంటివి జరగకుండా నివారించాలి. పారిశ్రామికసంస్థలలో పనిచేస్తున్న కార్మికులకు, ఉద్యోగులకు క్రమబద్ధమైన విద్యాబోధన నిరంతరం సాగిస్తూ, వారిని సుసంఘటితమొనర్చుతూఉండాలి. ఆవిధంగాపరిశ్రమలలోసోషలిస్టుపరివర్తన తీసుకురావటంలో, ఉత్పత్తివిషయాలలో, పెట్టుబడిదారులతోను వారి ప్రతినిధులతోను ఐక్యమై వారికి నచ్చజెప్పే విషయంలో కార్మికులు, ఉద్యోగులు సముచితపాత్రనిర్వహించేటట్లు చేయాలి. ప్రజ్ఞాధురీణులైన కార్మికులను, ఉద్యోగులను యాజమాన్య నిర్వహణలోకి తీసుకోవాలి. పోతే పెట్టుబడిదారులను, వారి ప్రతినిధులకు సంబంధించినంతవరకు, వారికి పనిపాటలు చూపించి జీవనాధారం కల్పించాలి. వారికీ, ప్రభుత్వప్రతినిధులకూ మధ్య సామరస్యపూర్వకమైన సంబంధాలుండేటట్లు చూడాలి. అంతేకాక, పెట్టుబడిదారులకు, వారి ప్రతినిధులకు, వారి కుటుంబీకులకు విషయాలు వివరించి నచ్చజెప్పే కృషిని యితోధికం చేయాలి. వారిలో చాలామందికి పరిశ్రమలను నిర్వహించటంలో చక్కని అనుభవం వుంది; సాంకేతికపరిజ్ఞానంవుంది వాడకందార్ల అవసరాలేమిటో వారు యిట్టేగ్రహించగలరు; మార్కెట్టుపరిస్థితులు వారికి కరతలామలకంగావుంటాయి ఆచితూచిఅంచనాలు వేయటంలో వారు దిట్టలు. అందువల్ల పరిశ్రమలలో పనిచేసే పార్టీ కార్యకర్తలు వారికి ఒక ప్రక్క విషయాలు బోధిస్తూనే, మరొకప్రక్క మన సామాజిక పూర్వసంపదలో ఒక భాగంగా ఉన్న వారి అనుభవాన్ని, పరిజ్ఞానాన్ని గ్రహించవలసివుంటుంది.

పెట్టుబడిదారీ పరిశ్రమలలోను, వాణిజ్యంలోను ఇంతవరక్కు మనం తీసుకొచ్చిన సోషలిస్టుపరివర్తన పాక్షికమైనదిమాత్రమే. ఇప్పటికి ప్రభుత్వ - ప్రయివేట్, సంయుక్త యాజమాన్యం క్రిందవున్న పరిశ్రమల్లో ఈ క్రమే సోషలిస్టుపరివర్తన తీసుకొచ్చాం. భవిష్యత్తులో ఏదో ఒక అనుకూల సమయం చూసుకొని వాటిని పూర్తి సోషలిస్టు స్వభావంకల్గిన ప్రభుత్వ పారిశ్రామిక సంస్థలుగా మార్చాలి.

పైన పేర్కొన్న వివిధకర్తవ్యాలను పూర్తిగా నిర్వర్తించినప్పుడే, మన దేశంలో సోషలిస్టుపరివర్తనకు సంబంధించిన సమస్య పరిపూర్ణంగా పరిష్కరించబడుతుంది. మనపార్టీ ఇంతకు ముందువలెనే ఇకముందుకూడా యావన్మంది ప్రజలతో ఐక్యమై ఈ కర్తవ్యాలను అనతికాలంలోనే జయప్రదంగా పరిగణించ గలదన్న విశ్వాసం మనకు ఉంది. ఆ విధంగా మన దేశంలో సోషలిస్టు నిర్మాణం నిరాటంకంగా సాగిపోవటానికి అనుకూల పరిస్థితులు ఏర్పడి తీరుతాయి.

# 3. సోషలిస్టు నిర్మాణం

తొలి పంచవర్ష ప్రణాళికను అమలుజరిపి, రెండవ పంచవర్ష ప్రణాళికకు నేడు మనం ఆయత్తమవుతున్నాం.

మన జాతీయ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేసేందుకు తొలిపంచవర్ష ప్రణాళికను ప్రారంభించి మూడుసంవత్సరాల ఎదిమిదన్నర మాసాలైంది. వచ్చే సంవత్సరానికి మనం దాన్ని పూర్తి చేస్తాం; 1958—62 మార్చి కాలానికి సంబంధించిన రెండవ పంచవర్ష ప్రణాళికను రూపొందిస్తాం. తొలిపంచవర్ష

ప్రణాళిక లక్ష్యాలను అధిగమించి, రెండవప్రణాళికకు యిప్పటి నుంచీ తీవ్రమైన సన్నాహాలు సాగించటమే ఈ నాడు మనపార్టీ ముందూ యావన్మంది ప్రజలముందూ వున్న ప్రధాన కర్తవ్యం.

మొదటి పంచవర్షప్రణాళికకాలంలో మన విజయాలు

మొదటి పంచవర్షప్రణాళికను అమలు జరపటంలో మనం అమోఘమైన విజయాలను సాధించాం మనశత్రువులు సైతం వాటిని కాదనలేక పోతున్నారు.

కీలక పరిశ్రమల నిర్మాణంలో మనం ఎంతో ముందుకు పోగలిగాం. గత కొలది సంవత్సరాలలోను ఈశాన్య చైనాలో గల మన ఇనుము, ఉక్కుపరిశ్రమలను యింకా విస్తరింపచేసుకొన్నాం. ఇన్నర్ మంగోలియాలోను, మధ్య చైనాలోను కొత్తగా రెండు ఇనుము, ఉక్కు కర్మాగారాలను స్థాపించాం. అనేక విద్యుత్కేంద్రాలను, బొగ్గుగనులను, నూనె బావులను, నాన్‌ఫెర్రస్ లోహ కర్మాగారాలను, గనులను, రసాయనిక పరిశ్రమలను, యంత్ర పరికరాలను ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీలను, వాడకం వస్తువులను ఉత్పత్తిచేసే పరిశ్రమలను స్థాపించి, విస్తరింప చేశాం మొదటి పంచవర్ష ప్రణాళికకాలంలో పారిశ్రామిక రంగంలో 694 భారీ ప్రాజెక్టుల నిర్మాణాన్ని ప్రారంభించాలనీ, వాటిలో 455 ప్రాజెక్టుల నిర్మాణాన్ని తొలిప్రణాళిక కాలంలోనే పూర్తిచేయాలనీ లక్ష్యంగా పెట్టుకొన్నాం. కాని నిజానికి ప్రారంభింపబడ్డ భారీ ప్రాకెక్టుల సంఖ్య 800 వరకు ఉంటుంది. వీటిలో 500 ప్రాజెక్టుల నిర్మాణం ప్రణాళిక కాలంలోనే పూర్తి

అవుతుంది. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో కీలక పరిశ్రమల నిర్మాణానికి కేటాయించిన 4270 కోట్ల యువాన్లలో ఇప్పటికి, అంటే మూడు సంవత్సరాలలో, 3550 కోట్ల యువాన్లను—అంటే కేటాయించిన మొత్తంలో నూటికి 83 వంతులను—కీలక పరిశ్రమల నిర్మాణానికి ఖర్చుచేశాం.

## పారిశ్రామికోత్పత్తి

మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో మొత్తం పారిశ్రామికోత్పత్తియొక్క విలువను నూటికి 90.3 వంతులు పెంచాలని లక్ష్యంగా పెట్టుకున్నాం. ఈ లక్ష్యాన్ని మనం అధిగమించగలం. తొలి ప్రణాళికలో 1957 నాటికి ఎంతఉత్పత్తి చేయాలని లక్ష్యంగా పెట్టుకున్నామో అంతకుమించిన ఉత్పత్తి యిప్పటికే సాగిస్తున్నాం. అంతేకాదు; ఉక్కు, ఉక్కుతో తయారుచేయబడే వస్తువులు, లోహాలను కోసే యంత్ర పరికరాలు, సిమెంటు, మోటారుబెస్సు, నూలు, వస్త్రాలు, కాగితం మున్నగువాటి విషయంలో 1957 నాటి లక్ష్యాలను యిప్పటికే అధిగమించాం. త్వరితగతిని అభివృద్ధి చెందిన ఖాదీ పరిశ్రమలవల్ల చైనా దేశం ఈనాడు స్వయంగా లారీలను, జెట్ విమానాలను, 6 వేల నుంచి 12 వేల కిలోవాట్ ఉత్పాదక క్షమత కలిగిన విద్యుదుత్పాదక యంత్రాలను తయారుచేయ గలుగుతోంది. 1957 నాటికి మన దేశ ఆర్థిక నిర్మాణానికి అవసరమైన యంత్రాలు, యంత్ర పరికరాలలో నూటికి 60 వంతులు మన దేశంలోనే ఉత్పత్తి చేసుకోగల్గుతాం.

## వ్యవసాయోత్పత్తి

వ్యవసాయరంగంలోకూడా, తొలి పంచవర్ష ప్రణాళిక లక్ష్యాలను సాధించగలం. వ్యవసాయోత్పత్తి మొత్తం విలువను ముఖ్యమైన ఆహారపదార్థాల, పారిశ్రామికపంటల ఉత్పత్తిని అనుకొన్న ప్రకారంగా పెంచగలం. 1952 నాటితో పోల్చుకుంటే 1954 నాటికి మొత్తం వ్యవసాయోత్పత్తి, వ్యవసాయసంబంధమైన తదితర వస్తువుల ఉత్పత్తి విలువను నూటికి 23.3 వంతులు పెంచాలని లక్ష్యంగా పెట్టుకొన్నాం. కాని ప్రకృతి ఉపద్రవాలు తీవ్రరూపంలో దాపురించిన కారణంగా 1953, 1954 సంవత్సరాలలో మనం సాధించినది బహు స్వల్పమేనని చెప్పాలి. అయితే 1955 లో మాత్రం, 1952 తో పోల్చిచూచినప్పుడు, నూటికి 14.8 వంతుల పెరుగుదలను సాధించాం. ఈ సంవత్సరంకూడా వరదలు, వర్షాభావం, పెనుతుపానులు తీవ్రరూపంలో దాపురించాయి. అయినప్పటికీ 1957 నాటికి సాధించాలనుకొన్న వ్యవసాయోత్పత్తి ప్రమాణాన్ని వ్యవసాయ సహకార సంఘాల ప్రాతిపదికపై చేరుకోటం యిప్పటికీ సాధ్యమే.

నీటి పారుదల విషయంలో, గత మూడు సంవత్సరాలలోను హువాయ్‌నదీ లోయలోను, యాంగ్‌ట్సీనదిపైన, ఇంకా అనేక యితర నదులపైన అనేక ప్రాజెక్టుల నిర్మాణం ప్రారంభించాం. యల్లోనదిపై నిర్మించదలుచుకొన్న సాన్‌మెన్ బహుళార్థసాధక ప్రాజెక్టు నిర్మాణం ప్రారంభించటానికి కావలసిన ఏర్పాట్లన్నిటినీ పూర్తిచేశాం. వివిధగ్రామీణ ప్రాంతాలలో

నీటి పారుదల సౌకర్యాలు కల్పించటంకోసం అనేక చిన్న చిన్న ప్రాజెక్టులను నిర్మించాం

రవాణా

ఇక రవాణా మార్గాల విషయం చూదాం. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో 4 వేల కిలో మీటర్ల పొడవు గల రైలు మార్గాలను నిర్మించాలని లక్ష్యంగా పెట్టుకొన్నాం. ఈ లక్ష్యాన్ని ఈ సంవత్సరం పూర్వార్ధ భాగంలోనే అధిగమించాం. కాగా, 10 వేల కిలో మీటర్ల పొడవుగల రహదారులను నిర్మించాలని పెట్టుకొన్న లక్ష్యాన్నికూడా ఈ సంవత్సరాంతం లోపునే అధిగమించగలం.

దేశీయ, విదేశీ వాణిజ్యం, విద్య, సంస్కృతి, ప్రజారోగ్యం మున్నగువాటి విషయంలోకూడా త్వరితగతిని పురోభివృద్ధి సాధించాం.

కార్మికుల, ఉద్యోగుల జీవన ప్రమాణం

కార్మికుల, ఉద్యోగుల జీవన ప్రమాణాలను వృద్ధిపర్చటంలో కొంతవరకు కృతకృత్యులమయ్యాం. 1952 తో పోల్చిచూస్తే, ఈ సంవత్సరం దేశం మొత్తంమీద కార్మికుల, ఉద్యోగుల వేతనాలు సగటున నూటికి 6.5 వంతులు పెరగగలవని అంచనా వేయబడుతోంది. కార్మికుల, ఉద్యోగుల జీవితాలకు భద్రత చేకూర్చే నిమిత్తం కార్మిక జీవిత భీమా, వైద్య సౌకర్యాలు, విద్య, సంస్కృతి, తదితర శ్రేయోదాయక సౌకర్యాలకోసం ప్రభుత్వమూ, వ్యక్తిగత పారిశ్రామిక

సంస్థలూ ఏటా నికరంగా చెల్లించే మొత్తం కార్మికుల, ఉద్యోగుల వేతనాలమొత్తంలో (సాలీనా) సుమారు నూటికి 15 వంతులు వుంది; లేదా నాలుగు సంవత్సరాలలో అలా చెల్లించబడిన మొత్తం 440 కోట్ల యువాన్లు. కార్మికుల కోసం, ఉద్యోగులకోసం ప్రభుత్వం యింతవరకు నిర్మించిన యిళ్ళను, ఈ సంవత్సరాంతానికి పూర్తి చేయడానికి ప్లాను వేసుకొని యిళ్ళను కలుపుకుంటే, వాటి వైశాల్యంలో పెరుగుదల 5 కోట్ల చదరపు మీటర్లను మించివుంటుంది.

ఈ సందర్భంలోనే, కొన్ని వాస్తవికమైన పరిమితులవల్ల క్రూడ్ ఆయిల్, వనస్పతినూనెలు, సిగరెట్లు వంటి వాటివిషయంలో మనం పెట్టుకొన్న లక్ష్యాలను చేరుకోటం సాధ్యం కాదని చెప్పవలసి వుంటుంది. అయితే ప్రణాళిక లక్ష్యాలను మాత్రం మొత్తంమీద అధిగమిస్తామని గట్టిగా చెప్పగలం.

## కర్తవ్యాలు

మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో కీలక పరిశ్రమల నిర్మాణానికి, ప్రాజెక్టుల నిర్మాణానికి మనం కేటాయించిన మొత్తాన్ని మించిపెట్టుబడి పెట్టటం సాధ్యమే అయినప్పటికీ, తగినంతగా ఆర్థికవనరులను, తదితరవస్తువులను జాగ్రత్తగా సేకరించుకొని, ప్రణాళికలోని ముఖ్యమైన భారీపరిశ్రమల నిర్మాణాన్ని పూర్తి చేయటానికి మనం యితోధికంగా కృషి సాగించవలసివుంటుంది. పోతే మిగతా భారీపరిశ్రమల విషయంలో కూడా ప్రణాళిక లక్ష్యాలను చేరుకొటానికి శక్తివంచనలేకుండా పాటుపడాలి.

భారీ పరిశ్రమలకు చెందిన వివిధ శాఖలు తమ ఉత్పత్తి కోటాలను పూర్తిచేశాయి. అయినప్పటికీ, మరింత ఎక్కువగా ఇనుమును, ఉక్కును, యంత్రాలను, యంత్రపరికరాలను, నిర్మాణానికవసరమైన వస్తువులను ఉత్పత్తి చేస్తూ, తదనుగుణ్యంగా బొగ్గు, విద్యుచ్ఛక్తి, పెట్రోలియం, నాన్ ఫెర్రస్ లోహాలు రసాయనిక పదార్థాలవంటి వాటి ఉత్పత్తిని కూడా పెంచి, దేశంలో కీలక పరిశ్రమల నిర్మాణం నిరాఘాటంగా సాగిపోయేటట్టు చూడవలసి వుంటుంది. ఆదేసమయంలో, రవాణాసమస్యలను, పట్టణాలలో గృహనిర్మాణసమస్యలను సంతృప్తికరంగా పరిష్కరించాలి.

వ్యవసాయరంగంలోకూడా మనం తీవ్రంగా కృషి చేయాలి. ఆహారధాన్యాలు, ప్రత్తి ఉత్పత్తిని యితోధికం చేయటానికి కృషిచేస్తూనే, నూనె గింజల ఉత్పత్తిని, పందులు, తదితర పశుగణాన్ని సాధ్యమైనంత తక్కువ కాలంలో సాధ్యమైనంత ఎక్కువ చేసేందుకు వ్యవసాయ, వాణిజ్య శాఖలు సమర్థవంతమైన చర్యలు తీసుకొనేటట్లు చూడాలి. అలాగే, వ్యవసాయానికి సంబంధించిన ఉపవృత్తులవల్లకూడా ఉత్పత్తి యితోధికమయ్యేటట్లు చూడాలి. గత కొలది సంవత్సరాలలో వీటి ఉత్పత్తి ఏమాత్రం పెరగలేదు. పైగా, ఒక సందర్భంలో తరిగిపోయిందికూడా.

తొలి పంచవర్ష ప్రణాళికను పూర్తిచేసిన వెంటనే, రెండవ పంచవర్ష ప్రణాళికను మనం ప్రారంభించబోతున్నాం. అందువల్ల రెండవ పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన ప్రతిపాదన

లను ఈ మహాసభలో చర్చించవలసిన అవసరం వుంది. కేంద్ర కమిటీ తరఫున కామ్రేడ్ చౌ ఎన్-లై రెండవ ప్రణాళికపై ప్రత్యేక నివేదికను ఈ మహాసభలోనే ప్రతిపాదిస్తారు.

### రెండవ ప్రణాళిక కాలంలో మన ప్రధాన కర్తవ్యం

రెండవ పంచవర్ష ప్రణాళికకు సంబంధించినంతవరకు మనం నిర్వర్తించవలసిన ప్రధాన కర్తవ్యం ఏమిటి?

ఈ విషయంలో పార్టీ కేంద్ర కమిటీ క్రింది విధంగా భావిస్తోంది: మన దేశంలో విస్తరించిన సోషలిస్టు పునరుత్పత్తి అవసరాలను తీర్చటానికి వీలుగా సోషలిస్టు పారిశ్రామికీకరణ కర్తవ్యాన్ని పూర్తిచేయాలి; సోషలిస్టు శిబిరంలోని వివిధ దేశాలమధ్య అంతర్జాతీయ సహకారాన్ని పటుతరం చేయాలి; సోషలిస్టు దేశాలన్నిటిలో ఉమ్మడి ఆర్థిక పురోవృద్ధికి తోడ్పడాలి; మనం దేశంలో అపారంగాగల మానవ సంపదను, సహజసంపదను చక్కగా వినియోగించుకొంటూ, మూడు పంచవర్ష ప్రణాళికల కాలంలో సర్వసమన్వితమైన పారిశ్రామిక వ్యవస్థను నెలకొల్పే దృష్టితో పనిచేయాలి సుస్పష్టంగా చెప్పాలంటే, రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మనం నిర్వర్తించవలసిన ప్రధాన కర్తవ్యం ఇలా వుంటుంది: (1) భారీ పరిశ్రమల ప్రాతిపదికపై పారిశ్రామిక నిర్మాణాన్ని కొనసాగించాలి; మన జాతీయ ఆర్థిక నిర్మాణంలో సాంకేతిక స్థాయిని పెంపొందించి, సోషలిస్టు పారిశ్రామికీకరణకు గట్టి పునాదులు వేయాలి (2) సోషలిస్టు పరివర్తనను సాధించేందుకు కృషి కొనసాగించాలి; సమిష్టి యాజమాన్య వ్యవస్థను, ప్రజా యాజ

మాన్య వ్యాపస్థను పటుతర మొనర్చుతూ విస్తరింప చేయాలి. (3) కీలకపరిశ్రమలను అభివృద్ధిచేయటం, సోషలిస్టు పరివర్తనను పూర్తిచేయుటం అన్న ప్రాతిపదికపై మన పరిశ్రమలలోను, వ్యవసాయంలోను, చేతి పరిశ్రమలలోను ఉత్పత్తిని యితోధికం చేయాలి; తదనుగుణ్యంగా, రవాణా మార్గాలను, వాణిజ్యాన్ని పెంపొందించాలి. (4) నిర్మాణ కార్యకలాపాలు సాగించేందుకు అవసరమైన కార్యకర్తలను పెద్దఎత్తున తయారుచేసుకోవాలి; సోషలిస్టు ఆర్థిక సాంస్కృతికాభివృద్ధియొక్క అవసరాలకు అనుగుణంగా శాస్త్రీయపరిశోధనల కృషిని యితోధికమొనర్చాలి. (5) జాతీయ రక్షణ ఏర్పాట్లను కట్టుదిట్టం చేసుకోవాలి; పెరుగుతున్న పారిశ్రామిక, వ్యవసాయోత్పత్తిని ఆధారం చేసుకొని ప్రజల జీవిత పరిస్థితులను మెరుగుపర్చటానికి' వారి సాంస్కృతిక స్థాయిని అభివృద్ధి పర్చటానికి కృషిచేయాలి.

మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో, మొత్తంమీద మనభారీయంత్రాలను, బహుపున్నితమైన యంత్రాలను మనం ఉత్పత్తిచేసుకోలేకపోయాం. అందువల్ల అనేక ముఖ్యమైన ప్రాజెక్టులకు అవసరమైన పరికరాలను స్వయంగా సరఫరా చేయలేకపోయాం. ఉక్కుతో తయారుచేయబడే దేశీయ వస్తువులకు సంబంధించినంతవరకు, దేశంలోని అవసరాలను ఇటు పరిమాణందృష్ట్యాగాని, అటు రకాల దృష్ట్యాగానీ, పూర్తిగా తీర్చలేకపోయామనే చెప్పాలి. ఉన్నతశ్రేణికి చెందిన అనేకరకాలైన ఎల్లాయ్ (మిశ్రమ) ఉక్కును యింకా మనం తయారుచేసుకోలేకపోతున్నాం. నాన్‌ఫెర్రస్ లోహపరిశ్రమ

లుకూడా పరిమితమైనవస్తువులనుమాత్రమే ఉత్పత్తిచేయగలుగు తున్నాయి. మనరేడియోఇంజనీరింగ్ పరిశ్రమ యింకా చాల బలహీనస్థితిలోనే వుంది. ఆర్గానిక్ సింథటిక్ రసాయనిక పరిశ్రమలు దాదాపు మనకు లేనేలేవని చెప్పవచ్చు. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో, మనకు యింతవరకులేని, ఒకవేళ వున్నా చాలా బలహీనస్థితిలోవున్న పైన పేర్కొన్న పారిశ్రామిక శాఖలను స్థాపించవలసివుంటుంది. 1962 నాటికి మన ఆర్థికనిర్మాణానికవసరమైన యంత్రాలు, యంత్రపరికరాలలో-కొన్ని భారీయంత్రాలు, బహు సున్నితమైన యంత్రాలతోసహా-నూటికి 70 వంతులు మనదేశంలోనే ఉత్పత్తిచేసుకోవాలన్న సంకల్పంతో మనకృషిని ద్విగుణీకృతోత్సాహంతో సాగించాలి. ఇంధనాలకు సంబంధించినంతవరకు, పెట్రోలియం ఉత్పత్తి దేశావసరాలకు ఏమాత్రం చాలటంలేదు. ఈ పరిస్థితిని క్రమంగా బాగుపర్చాలి.

భూగర్భంలో దాగియున్న అపారమైన, వివిధరకాల సహజసంపదను త్రవ్వి వెలికి తీసుకొచ్చేందుకు రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో భూగర్భపరిశోధనా కృషిని మరింత పెద్ద ఎత్తున సాగించాలి. అలాగే కీలకపరిశ్రమల నిర్మాణాన్నికూడ మరింత పెద్దఎత్తున కొనసాగించాలి. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలోకన్నా రెండవ ప్రణాళిక కాలంలో కీలకపరిశ్రమలనిర్మాణానికి ఖర్చుచేసే పెట్టుబడిమొత్తం రెట్టింపు వుంటుంది. ఈశాన్య చైనాలోను, మధ్యచైనాలోను, ఇన్నర్‌మంగోలియాలోను గల ఇనుము, ఉక్కు కర్మాగారాల నిర్మాణాన్ని కొనసాగిస్తూనే,

సాన్ మెన్‌గార్జ్ ప్రాంతంలోను, కాన్సు - చింఘాయ్ ప్రాంతం లోను, సింకియాంగ్‌లోను, నైరుతిచైనాలోను కొత్తకొత్త పారిశ్రామిక కేంద్రాలను నెలకొల్పుతాం. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మనం పూర్తిచేదామనుకొంటున్న కీలక పరిశ్రమలనిర్మాణం పూర్తయ్యేసరికి మన యంత్రనిర్మాణకర్మాగారాలు, లోహపరిశ్రమకర్మాగారాలు, విద్యుత్కేంద్రాలు, బొగ్గుగనులు, పెట్రోలియం పరిశ్రమలు, రసాయనికపరిశ్రమలు, గృహనిర్మాణానికి అవసరమైన వస్తువులను తయారుచేసే ఫ్యాక్టరీలలో చాలాభాగం అత్యంత ఆధునికమైన, అత్యున్నతమైన సాంకేతికపరికరాలను కలిగియుంటాయి.

భారీ పరిశ్రమలకు చెందిన వివిధశాఖల ఉత్పత్తిని పెద్ద ఎత్తున పెంచాలి; 1957 తో పోల్చుకుంటే 1962 నాటికి ఉక్కు-ఉత్పత్తి 41,20,000 టన్నులనుంచి 1 కోటి 5 లక్షల టన్నులకు లేదా 1 కోటి 20 లక్షల టన్నులకు పెంచాలని లక్ష్యంగా పెట్టుకొన్నాం. అలాగే బొగ్గు ఉత్పత్తిని 11 కోట్ల 30 లక్షల టన్నులనుంచి 19 కోట్ల టన్నులకు లేదా 21 కోట్ల టన్నులకు పెంచాలను కొంటున్నాం; విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని 1990 కోట్ల కిలోవాట్ గంటలనుంచి 4000 కిలోవాట్ గంటలకు లేదా 4300 కోట్ల కిలోవాట్ గంటలకు పెంచాలని లక్ష్యంగా పెట్టుకొన్నాం.

## వాడకం వస్తువుల ఉత్పత్తి

అలాగే వాడకం వస్తువులను ఉత్పత్తిచేసే పరిశ్రమలను కూడా, సాపేక్షంగా చూస్తే త్వరితగతిని అభివృద్ధిచేయాలి. 1957 నాటితో పోల్చి చూసుకొంటే 1962 నాటికి నూలు

ఉత్పత్తిని 50 లక్షల బేళ్ళనుంచి 80 లక్షల బేళ్ళు లేక 90 లక్షల బేళ్ళకు పెంచాలి. వనస్పతినూనెల ఉత్పత్తిని 17 లక్షల 90 వేల టన్నులనుంచి 31 లక్షల టన్నులు లేక 32 లక్షల టన్నులకు పెంచాలి. పంచదార ఉత్పత్తిని 21 లక్షల టన్నులనుంచి 24 లక్షల టన్నులు లేక 25 లక్షల టన్నులకు పెంచాలి. యంత్రాలతో తయారుచేయబడే కాగితం ఉత్పత్తిని 7 లక్షల టన్నుల నుంచి 15 లక్షలు టన్నులు లేక 16 లక్షల టన్నులకు పెంచాలి.

మొత్తం జాతీయ ఆర్థిక జీవితావసరాలను పూర్తిగా తీర్చటంకోసం, వ్యవసాయాభివృద్ధికై రూపొందించబడిన ముసాయిదా జాతీయ కార్యక్రమం (1956 — 1967) ప్రకారం రెండవ పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయోత్పత్తిని బాగా పెంచాలి. 1962 నాటికి సాలీనా షుమారు 50,000 కోట్ల కట్టేల ఆహారధాన్యాలను మనం పండించగల్గాలి. ప్రత్తి ఉత్పత్తిని 1 కోట్ల 80 లక్షల టూన్‌లకు (టూన్ అంటే 50 కిలోగ్రాము లతో సమానం) పెంచాలి. ఈ లక్ష్యాలను చేరుకోటం మాత్రమేకాక, వాటిని అధిగమించటానికికూడా దీక్షతో పనిచేయాలి. సోయాచిక్కుళ్ళు, నూనె గింజలు, చెరకు తదితర పారిశ్రామిక పంటల ఉత్పత్తిని, వ్యవసాయ ఉపవృత్తుల ఉత్పత్తిని యితోధికం చేయటానికి గట్టి చర్యలు తీసుకోవాలి.

రవాణా మార్గాలు, తంతి, తపాలా సౌకర్యాల విషయంలో రైలు, రోడ్డు, నీటి రవాణాలను, తంతి సౌకర్యాలను విస్తరింపచేయటానికి కృషి సాగించాలి. ప్రస్తుతమున్న శమ్యాని

కేషన్ మార్గాలను క్రమేణా సాంకేతిక పద్ధతులపై పునసర్ని ర్మించాలి. ప్రస్తుతమున్న అవకాశాలన్నింటినీ పూర్తిగా వినియో గించుకొనేటట్లు మన రవాణా వ్యవస్థను ఇకముందుకూడా రేషన లైజ్ చేస్తూఉండాలి. కొన్ని రైల్వే మార్గాలపై రద్దీ ప్రస్తుతం చాలా ఎక్కువగావుంది. ఈ సమస్యను మనం శ్రద్ధగా పరిశీ లించాలి రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో 8 వేల లేక 9 వేల కిలోమీటర్ల రైల్వే మార్గాలను కొత్తగా నిర్మించా లని నిశ్చయించుకొన్నాం. వాన్‌చౌ - సింకియాంగ్ రైలు మార్గం సోవియట్ - చైనా సరిహద్దుల వరకు పొడిగించబడు తుంది. వాయువ్య చైనాను, నైరుతి చైనాను కలిపే రహదా రులు వేయబడతాయి.

మనకు అవసరమైన వివిధవస్తువుల, పరికరాల ఉత్పత్తిని పెంపొందించుకొనేనిమిత్తం సాంకేతిక నిపుణులందరిని మనం పూర్తిగా వినియోగించుకోవాలి. పరిశోధనా కృషినీ, వస్తువుల నమూనాలను తయారుచేసే పద్ధతిని చక్కపరచటానికి గట్టి ప్రయత్నాలు సాగించాలి. అలాగే కొత్తకొత్త వస్తువులను తయారుచేయటానికి తీవ్రకృషి సాగించాలి. మన సాంకేతిక నిపుణులను అలక్ష్యం చేయటం, వారిని సరిగా ఉపయోగించు కోక పోవటం పొరపాటే కాగలదు.

### జాతీయాదాయం

తొలి పంచవర్ష ప్రణాళిక ముగిసేసమయానికి మన జాతీయాదాయంతో పోల్చిచూస్తే, రెండవ పంచవర్ష ప్రణా ళిక పూర్తి అయ్యేసరికి మన జాతీయాదాయం నూటికి 50

వంతులు అధికమవుతుంది. పెట్టుబడులు మరింతపెద్దమొత్తంలో ప్రభుత్వం చేతికిరావటం మాత్రమేకాక, ప్రజలజీవన ప్రమాణంకూడా చెప్పుకోతగినంతగా అభివృద్ధి చెందుతుంది. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో అదనంగా 60 లక్షల లేక 70 లక్షల కార్మికులకు, ఉద్యోగులకు పనులు చూపిస్తాం. కార్మికుల, ఉద్యోగుల వేతనాలు సగటున నూటికి 5 లేక 30 వంతులవరకు పెరుగుతాయి అలాగే రైతుల మొత్తం ఆదాయంకూడా నూటికి 25 లేక 30 వంతులు పెరుగుతుంది. ఆహార ధాన్యాలు, వస్త్రాలు, వనస్పతి నూనెలు, పంచదార, కిరసనాయిల్, బొగ్గు సరఫరాకూడా హెచ్చుతుంది.

పైన క్లుప్తంగా వివరించిన వాటినిబట్టి స్పష్టమయ్యేదేమిటి? రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మన జాతీయ ఆర్థిక వ్యవస్థ త్వరితగతిని, అమోఘంగా అభివృద్ధి చెందుతుంది. రెండవ పంచవర్ష ప్రణాళికను పూర్తి చేస్తే, మూడవ పంచవర్ష ప్రణాళిక కాలంలో సోషలిస్టు పరివర్తనను ప్రధానంగా పరిపూర్తి చేయటానికి అవసరమైన పరిస్థితులు ఏర్పడతాయనికూడా స్పష్టమవుతుంది.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో పార్టీ సూచిస్తున్న అభివృద్ధియొక్క వేగం దూరదృష్టితో కూడినది. ఆచరణయోగ్యమైనదని మనం తీసుకొనే ప్రతిపథకం దూరదృష్టితో కూడినదై వుండాలి. లేకపోతే ఈనాడు మన దేశంలోగల సదవకాశాలను జారవిడిచే ప్రమాదానికి లోనవుతాం; లేదా యథాస్థితి వాదం అనే వూబిలో కూరుకుపోయినవాళ్ళం అవుతాం. అదేసమ

యంలో మనం వేసుకొనే పథకం ఆచరణ యోగ్యమైనదై కూడా వుండాలి. లేకపోతే ఆర్థిక వ్యవస్థను సరియైన నిష్పత్తిలో అభివృద్ధి చేయటం సాధ్యం కాదు; ప్రజలపై లేనిపోని భారం పడుతుంది; లేదా జాతీయ ఆర్థిక వ్యవస్థలోని వివిధ శాఖలమధ్య సమన్వయం లేక తికమకలు రాకతప్పవు. తత్ఫలితంగా ప్రణాళికను పూర్తిచేయటం దుస్సాధ్యమైపోతుంది. అనవసరమైన దండుగ జరుగుతుంది. ఆచరణ యోగ్యం కాని ప్రణాళికను వేసుకోటం దుందుడుకు తనపు పొరపాటు తప్ప వేరొకటి కాదు.

## పెట్టుబడుల సమస్య

మొదటి పంచవర్ష ప్రణాళికకన్నా రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో అధికంగా పెట్టుబడులు పెట్టవలసివుంటుందన్న విషయం సుస్పష్టమే మన జాతీయ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిచెందింది ; దానితోపాటే ఆర్థిక పరిస్థితికూడా బాగుపడింది. కాని, మనకు యిప్పటికీ పరిమితమైన నిధులు మాత్రమే కలవన్న విషయం విస్మరించరాదు. అందువల్ల వాటిని ఎంతో మప్పితంగా ఉపయోగించుకొంటూ, సాధ్యమైనంత తక్కువ వ్యయంతో సాధ్యమైనంత ఎక్కువ ఫలితం సాధించటానికి కృషిచేయాలి. నిర్మాణ కార్యకలాపాలకు ఎక్కువ మొత్తాలను ఖర్చుపెట్టేందుకు వీలుగా సైనిక వ్యయాన్ని, పరిపాలనా వ్యయాన్ని సాధ్యమైనంత వరకు తగ్గించాలి. 1950 లోనే పార్టీ కేంద్ర కమిటీ ఈ విధానాన్ని నిర్ణయించింది. కాని, కొరియా యుద్ధం ప్రారంభంకావటం, అమెరికా దురాక్రమణను ప్రతిఘటించటా

నికి కొరియాకు సహాయపడవలసి రావటంతో, ఈ విధానాన్ని అప్పట్లో అసలు జరుపలేకపోయాం. సైనిక వ్యయాన్ని, పరిపాలనా వ్యయాన్ని సాధ్యమైనంతవరకు తగ్గించాలని గత కొలది సంవత్సరాలుగా గట్టి ప్రయత్నాలు చేశాం. అయినప్పటికీ దేశరక్షణ వ్యయం, పరిపాలనా వ్యయం కలిసి మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో ఖర్చుచేసిన మొత్తం వ్యయంలో నూటికి 32 వంతులు వుంది. కాగా, ఆర్థిక నిర్మాణానికి, సాంస్కృతికాభివృద్ధికి పెట్టిన ఖర్చు నూటికి 56 వంతులు వుంది. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో సైనిక వ్యయం, పరిపాలనా వ్యయం కలిసి మొత్తం జాతీయ వ్యయంలో నూటికి 20 వంతులు మించకుండా వుండేటట్లు చూడాలి. ఆ విధంగా ఆర్థిక నిర్మాణానికి, సాంస్కృతికాభివృద్ధికి మొత్తం వ్యయంలో నూటికి 60 నుంచి 70 వంతుల వరకు ఖర్చుపెట్టడానికి మార్గం సుకరం చేయాలి. కాగా, ఆర్థిక నిర్మాణం, సాంస్కృతికాభివృద్ధి విషయంలో కూడా సహేతుకమైన పద్ధతిలో, కీలక రంగాలకు ప్రాముఖ్యం ఒసగు తూమరీ నిధులను ఖర్చుపెట్టటం ముఖ్యమన్న విషయం గుర్తించాలి. అందువల్ల రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మన జాతీయ ఆర్థిక వ్యవస్థను సాంకేతికంగా పునర్నిర్మించే విషయంలో భారీ పరిశ్రమలపైన, ముఖ్యంగా యంత్ర నిర్మాణ పరిశ్రమలపైన, లోహ పరిశ్రమలపైన దృష్టిని లగ్నం చేసి నిధులను ఖర్చుపెట్టాలి అదే సమయంలో మిగతా అన్ని పరిశ్రమలలోను, పరిపాలనా సంస్థలలోను, మొత్తం సామాజిక జీవితంలోను సాధ్యమైనంతవరకు ఖర్చును తగ్గించుకోటానికి, దుబారా జరగకుండా చూడటానికి ప్రయత్నిస్తూ ఉండాలి.

దుబారా అన్నది ఉత్పత్తి అభివృద్ధికీ, ప్రజల జీవనప్రమాణా అభివృద్ధికీ ఎల్లప్పుడూ అడ్డంకిగానే ఉంటుంది. అందులోనూ మనం యిప్పుడే జాతీయ నిర్మాణ కృషిని ప్రారంభించాం, అందుచేత ప్రతి దమ్మిడీని ఆచి, తూచి మరీ వాడటం అవసరం. మన పారిశ్రామిక నిర్మాణానికి అవసరమైన యంత్రాలను, పరికరాలను దిగుమతి చేసుకొనే నిమిత్తం, మన వాడకం వస్తువులలో కొంత భాగాన్ని ఇతర దేశాలకు ఎగుమతి చేయవలసివ్తుంటుంది. ఉజ్వల భవిష్యత్తును రూపొందించుకొనే నిమిత్తం తాత్కాలికంగా నిత్యజీవితంలో కొన్ని కష్టనిష్ఠురాలను భరించవలసివుంటుందన్న విషయం గుర్తించుకోవాలి. సోషలిస్టు వ్యవస్థాపనకు జాతీయ నిర్మాణాన్ని కొనసాగించటంలోను, పరిశ్రమలను, సహకార సంస్థలను నడపటంలోను, ఇతర వ్యవహారాల నిర్వహణలోను కష్టపడి పనిచేస్తూ, ధనాన్ని మప్పితంగా వాడాలన్న దీర్ఘకాల విధానాన్ని మన పార్టీ చేపట్టింది. రెండవ పంచవర్ష ప్రణాళికను రూపొందించటంలోను, అమలు జరపటంలోను ఈ విధానాన్ని మనం తప్పకుండా పాటించాలి.

ఇక పారిశ్రామిక, వ్యావసాయిక, వాణిజ్య, విద్యా, సాంస్కృతిక రంగాలలో గత సంవత్సరాలలో మనం సంపాదించిన అనుభవాలేమిటో స్థూలంగా పరిశీలిద్దాం.

## పారిశ్రామిక రంగంలో మన అనుభవాలు

పరిశ్రమలకు సంబంధించినంతవరకు, సాపేక్షంగా ముఖ్యమైన పదన్నగ సమస్యలనే చర్చిద్దాం. భారీపరిశ్రమలకు, వాడకం వస్తువులను ఉత్పత్తిచేసే పరిశ్రమలకు మధ్య ఏలాంటి సంబంధం

ఉండాలి ? భౌగోళికంగా పరిశ్రమలను ఎలా పంపిణీ చేయాలి? ఉత్పత్తి సరుకులు, నిర్మాణకృషి నాణ్యం ఎలా వుండాలి ? కార్మికుల, ఉద్యోగుల స్థితిగతుల మాటేమిటి ? పరిశ్రమలలో నాయకత్వం సంగతి ఏమిటి ?

భారీ పారిశ్రామికోత్పత్తియొక్క అభివృద్ధిపైన' ఉత్పత్తి సాధనాలను తయారుచేసే పరిశ్రమల్లో ఉత్పత్తి పెరుగుదలపైన ఆధారపడుతూ మన దేశాన్ని పారిశ్రామికవంతం చేసుకోవాలి. పాతచైనాలో, మొత్తం పారిశ్రామికోత్పత్తిలో ఉత్పత్తి సాధనాల పరిమాణం బహు కొద్దిగామాత్రమేవుండేది. 1949 లో మొత్తం పారిశ్రామికోత్పత్తిలో ఆ పరిమాణం నూటికి 26.6 వంతులు మాత్రమే ఉండేది. చైనాలో ఉత్పత్తి శక్తులు చాలా వెనుకడినస్థితిలో ఉన్నవనటానికి అదొక నిదర్శనం. సోషలిస్టు పారిశ్రామికీకరణ విధానాన్ని చేపట్టిన మన పార్టీ యీపరిస్థితిని సమూలంగామార్చివేయాలనిపూనిక వహించింది. అందుకు ఉత్పత్తి సాధనాలను తయారుచేసే పరిశ్రమలకు అగ్రస్థానం యివ్వక తప్పదని నిర్ణయించింది. 1952 లో మన దేశంలో జరిగిన మొత్తం పారిశ్రామికోత్పత్తిలో ఉత్పత్తి సాధనాల ప్రమాణం నూటికి 35.6 వంతులు వుంది; మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తయ్యేసరికి ఆ శాతం 40 కిమించటానికి అవకాశం వుంది.

ప్రణాళికాబద్ధంగా మన జాతీయఆర్థికవ్యవస్థను అభివృద్ధి చేయాలంటే, భారీ పరిశ్రమల అభివృద్ధికి అగ్రస్థానమిచ్చే విధానాన్ని తప్పక అమలుజరపాలి. భారీపరిశ్రమల అభివృద్ధి

వేగాన్ని కాస్త తగ్గించాలని కొంతమంది కామ్రేడ్స్ వాంఛిస్తున్నారు. అలాంటి ధోరణి పొరపాటు అలా వాదించేవారికి ఈ క్రింది ప్రశ్న వేస్తున్నా: సరే, అత్యవసరమైన యంత్రనిర్మాణ పరిశ్రమలను, లోహపరిశ్రమలను భారీపరిశ్రమలకు చెందిన తదితర శాఖలను సొంతంగా, త్వరితగతిని అభివృద్ధిచేసుకోకపోతే, వాడకంవస్తువులను తయారుచేసే పరిశ్రమలకు, రవాణాకు, గృహనిర్మాణపరిశ్రమకు, వ్యవసాయానికి కావలసిన పరికరాలు మనకు ఎక్కడినుంచివస్తాయో కాస్త చెప్పండి! భారీపరిశ్రమలను అభివృద్ధిచేసుకోనంతకాలం, వివిధ రకాలైన యంత్రాలు, ఉక్కుతో తయారయ్యే వస్తువులు, సిమెంటు, విద్యుచ్ఛక్తి, ఇంధనాలు — ఇవన్నీ అత్యవసరమైనవే — మనకు లభ్యం కానేకావు అందువల్ల మన జాతీయ ఆర్థికవ్యవస్థ ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసినచోటేనన్నట్లు చాలా కాలం దళితస్థితిలోనే వుండిపోవలసివస్తుంది. అలాంటిదానిని మనం ఎట్టిపరిస్థితులలోను జరగనీయబోము.

అయితే మరికొందరు కామ్రేడ్స్, కేవలం భారీపరిశ్రమలనుఅభివృద్ధి చేయవలసిన ఆవశ్యకతను మాత్రమే నొక్కి వక్కాణిస్తున్నారు. వాడకం వస్తువులను తయారుచేసే పరిశ్రమల అభివృద్ధివేగాన్ని జాతీయ ఆర్థిక వ్యవస్థలోని ఇతరశాఖల అభివృద్ధివేగాన్ని తగ్గించాలని వారు కోరుతున్నారు. ఈరకమైన ధోరణికూడా పొరపాటే. ఏమంటే, వాడకం వస్తువులకోసం ప్రజలలో డిమాండు అనుదినం పెరుగుతోంది. అలాంటప్పుడు వాడకం వస్తువుల పరిశ్రమలను తగినంత త్వరగా అభివృద్ధి చేయకపోతే కొరత ఏర్పడవచ్చు; తత్ఫలితంగా వాడకం వస్తు

వుల ధరలు' మార్కెటు పరిస్థితులు, తారుమారు కావచ్చు. ముఖ్యంగా గ్రామీణప్రాంతాలలో పారిశ్రామిక ఉత్పత్తి సరుకులను తగినంతగా సరఫరా చేసి, అందుకు మారు స్థిరమైన సరసమైన ధరలకు వ్యవసాయ సరుకులను తీసుకోలేకపోతే, కార్మిక కర్షక ఐక్యసంఘటన, వ్యవసాయోత్పత్తి దెబ్బతిన్నా తినవచ్చు. ఈవిషయాన్ని ఆ కాంగ్రెస్ గమనించడంలేదు పైగా, వాడకం వస్తువులను తయారుచేసే పరిశ్రమలు స్థాపించటానికి కొద్ది మొత్తం పెట్టుబడి సరిపోతుంది అంతేకాక, వాటినిర్మాణాన్ని చాలవరకు పూర్తిచేయవచ్చు. కనుక పెట్టిన పెట్టుబడిని త్వరగా రకం తిప్పటానికి వీలవుతుంది కొద్దికాలంలోనే ఆ పరిశ్రమలు మంచి లాభాలనుకూడా సంపాదించి పెడతాయి. అలా ఆర్జించిన లాభాలను తిరిగి భారీపరిశ్రమాభివృద్ధికి వినియోగించవచ్చుకూడా అందువల్ల వాడకం వస్తువులనుత్పత్తి చేసే పరిశ్రమలకు నిధులను, ముడిసరుకులను, మార్కెట్లను కొంతవరకు కేటాయించినందువల్ల భారీపరిశ్రమలకు ఏమాత్రం విఘాతం కలుగదు. పైగా ప్రయోజనకరంగాకూడా వుంటుంది.

ఇక భౌగోళిక ప్రాతిపదికపై పరిశ్రమలను పంపిణీ చేసే విషయం ఆలోచిద్దాం: ప్రస్తుతం తీరప్రాంతాలకు దేశాంతర్గత ఇతర ప్రాంతాలకు మధ్య సమన్వయం సాధించటానికి శ్రద్ధ వహించాలి. అలాగే పెద్ద పెద్ద పరిశ్రమలకూ చిన్న-మధ్య తరహా పరిశ్రమలకూ మధ్య సమన్వయ సాధన అవసరం. అదేవిధంగా కేంద్రాధికారం క్రింద నిర్వహించబడుతున్న పరిశ్రమలకు, క్రింది ప్రభుత్వాలచే నిర్వహించబడుతున్న పరిశ్రమలకు మధ్యకూడా సమన్వయం అవసరం.

తొలి పంచవర్ష ప్రణాళిక కాలంలో మన పారిశ్రామిక కేంద్రాలను క్రమంగా దేశాంతర్గత ప్రాంతాలకు తరలించాం. మన ఉత్పత్తి శక్తులను సహేతుకమైన పద్ధతిలో పంపిణీ చేయుటానికీ, మన పారిశ్రామిక కేంద్రాలకు అందుబాటులో సహజ సంపద లభించేటట్టు చూడటానికీ, మన పరిశ్రమల్లో మన మొత్తం జాతీయ ఆర్థిక వ్యవస్థలో ఎగుడు దిగుడులు లేకుండా సమ తూకంలో అభివృద్ధి చెందటానికీ వీలుగా ఆపని చేశాం. దేశం విముక్తం కావటానికి పూర్వం దేశంలోగల మొత్తం పరిశ్రమలలో నూటికి 70 వంతులు దేశంలోపలి ప్రాంతాలలోనే వుండేవి. అలాంటి అసాధారణ పరిస్థితిని మనం యిప్పుడు తొలగించాం. అయితే అట్టి ప్రాంతాలలోని పరిశ్రమలు నిర్వర్తించే పాత్రను మనం విస్మరించటంగానీ, అలక్ష్యం చేయుటంగానీ కూడదు. సముద్రతీరానగల రాష్ట్రాల అనుకూల పరిస్థితులను మనం పూర్తిగా వినియోగించుకోవాలి; ఆ రాష్ట్రాలలో పరిశ్రమలను తగినవిధంగా అభివృద్ధి చేసితీరాలి; దేశాంతర్గత ప్రాంతాల్లో పరిశ్రమల అభివృద్ధికి సముద్రతీరంలోని రాష్ట్రాల పరిశ్రమలు ఉపయోగపడాలి. ఈ విధంగా మొత్తం దేశాన్ని త్వరగా పారిశ్రామిక వంతం చేయాలి. ఈ విషయంలో లియోనింగ్, షాంఘై, టీన్‌స్టిన్, తదితర పారిశ్రామిక కేంద్రాలు మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో అమోఘంగా ఉపకరించాయి. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మనం ఈశాన్య చైనాలోను, తూర్పు చైనాలోను గల పారిశ్రామిక స్థావరాలను పూర్తిగా వినియోగించుకొంటూనే, దేశ పారిశ్రామికాభివృద్ధిలో హూపీ, షాంటుంగ్, దక్షిణ చైనా ప్రాంతాలు

కూడా సముచిత పాత్రను నిర్వహించగలిగేటట్లు సౌకర్యాలు చేకూర్చాలి.

రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలో మనం ఒకప్రక్క పెద్దపెద్ద పరిశ్రమలను నిర్మిస్తూనే, మరొకప్రక్క చిన్న, మధ్య తరహా పరిశ్రమలనుకూడా స్థాపించాలి; వాటిని ఆధునిక మొనర్చుతూ వుండాలి. ఆవిధంగా చిన్న, మధ్య తరహా పరిశ్రమలకూ, పెద్దపెద్దపరిశ్రమలకు మధ్య సమన్వయం సాధిస్తూ పారిశ్రామికాభివృద్ధిని త్వరితం చేయాలి; వివిధపరిశ్రమల మధ్య సహకారాన్ని పటుతరం చేయాలి; ఎక్కువ రకాల వస్తువులను ఉత్పత్తిచేయాలి; మన సాధనసంపత్తిని, ప్రస్తుతమున్న పరిశ్రమ లను, ముఖ్యంగా ప్రభుత్వ - ప్రయివేట్ సంయుక్తయాజమాన్యంలో గల పరిశ్రమలను, పూర్తిగా వినియోగించుకోటానికి మార్గం సుకరంచేయాలి.

కేంద్రాధికారం క్రింద పనిచేస్తున్న వివిధ ఆర్థికశాఖలు ప్రదర్శించే చొరవకూ, స్థానిక ఆర్థిక సంస్థలు ప్రదర్శించేచొరవకు మధ్య సరియైన పద్ధతిలో సమన్వయం సాధించటానికి శ్రద్ధ తీసుకోవాలి. గతంలో ఒకవైపు కొన్ని కేంద్రశాఖలు స్థానికపరిశ్రమల అభివృద్ధికి, సమగ్రమైన ఏర్పాట్లకు తగినంత శ్రద్ధ చూపనందువల్ల, స్థానికపరిశ్రమలను అభివృద్ధిచేయటానికి గల అవకాశాలన్నీ ఉపయోగంలోకి రాకుండాపోయాయి. మరొకప్రక్క కొంతమంది స్థానికాధికారులు గుడ్డెద్దుచేలోపడ్డట్లు కొన్ని పరిశ్రమలనుమాత్రమే నిర్మించుకొంటూ, విస్తరించుకొంటూ పోయారు. ఆ పరిశ్రమలకు అవసరమైన పరికరాలు తగినంతగా దేశంలో లభ్యం అవుతాయా కావా అన్న విషయం వారు

ఆలోచించలేదు. ఆ యా ప్రాంతాల ఆర్థికపరిస్థితులనుగానీ, ఆర్థికవనరులనుగానీ వారు దృష్టిలోకి తీసుకోనేలేదు. దీనివల్ల కూడా ప్రభుత్వానికి నష్టం వాటిల్లింది. ఈ రెండు పెదధోరణులను మనం సరిదిద్దాలి.

ప్రభుత్వఉత్పత్తి ప్రణాళికను పూర్తిచేసినంతమాత్రాన సరిపోదు. ఇటు వాడకం వస్తువుల పరిశ్రమలలోను, అటు భారీ పరిశ్రమలలోను, అలాగే కేంద్రాధికారం క్రింద నిర్వహించబడే ప్రభుత్వపరిశ్రమలలోను, క్రిందిప్రభుత్వాలు నిర్వహించుతున్న పరిశ్రమలలోను ఉత్పత్తిచేసేసరుకుల నాణ్యాన్ని కూడా పెంచాలి. అదేవిధంగా, ప్రభుత్వనిర్మాణపథకాన్ని పూర్తిచేసే విషయంలో పరిశ్రమలు, రవాణా, తదితర రంగాలలోని నిర్మాణ శాఖలు తమ ఇంజనీరింగ్ నైపుణ్యాన్ని పెంపొందించుకోవాలి. మన సోషలిస్టునిర్మాణానికి సంబంధించిన తక్షణసమస్యలలో ఇదొకటి.

కేవలం ఆర్థిక విజయాల సంఖ్యలో, వేగంలోమాత్రమే కాక, వాటి నాణ్యంలోకూడా సోషలిజం తన ఆధిక్యతను నిరూపించుకోవాలి అనేక మంచిరకాలవస్తువులను అటువాడకం వస్తువులపరిశ్రమల్లోను ఇటుభారీపరిశ్రమలలోను మనంతయారుచేసిన మాట నిజమే; అలాగే ఉత్తమశ్రేణికి చెందిన అనేకప్రాజక్టులను కూడా మనం పూర్తిచేసినమాటనిజమే. అయితే ఈసందర్భంలో ఈ క్రింది విషయాలను మనం విస్మరించరాదు. మనకు ఉన్న పరికరాలు ఆధునికమైనవి కావు; కొన్ని పరిశ్రమలలో సాంకేతిక స్థాయిచాలా తక్కువగావుంది. వస్తువులను తయారుచేసే విష

యంలో సరియైన ప్రమాణాలు ఇంకా ఏర్పడలేదు. అలాగే సరియైన సాంకేతిక నిబంధనలులేవు; వస్తువుల నాణ్యాన్ని సాంకేతిక విషయాలను ఎప్పటికప్పుడు తనిఖీచేసే సక్రమపద్ధతి యింకా అమలులోకి రాలేదు. ముఖ్యంగా కొన్ని ముఖ్యపరిశ్రమలలో తయారయ్యే వస్తువుల నాణ్యంవిషయంలోను, నిర్మాణ ప్రాజెక్టుల నాణ్యం విషయంలోను తగినంతశ్రద్ధ చూపటంలేదు. కేవలంఉత్పత్తియొక్క పరిమాణాన్ని, వేగాన్ని మాత్రమేనొక్కి చెప్పటం జరుగుతోంది. వీటన్నిటివల్ల అనేకవస్తువుల, ఇంజనీరింగ్ ప్రాజెక్టుల నాణ్యం ఉండవలసినంతగా ఉండటంలేదు. కొన్ని వస్తువుల రూపురేఖలు వుండవలసిన విధంగా వుండటం లేదు. అందువల్ల వాటన్నిటినీ తుక్కురకం వస్తువులుగాపాటించవలసివచ్చింది. వాణిజ్య రంగంలో, ప్రయివేట్ పరిశ్రమలు తయారుచేసే వస్తువులన్నిటినీ ప్రభుత్వమే ప్రత్యేకంగా ఖరీదుచేసి అమ్మే పద్ధతిని అమలుజరుపుతున్నందువల్ల, కొన్ని పెడధోరణుల ఫలితాలుకూడా సంభవిస్తున్నాయి. ఆ పద్ధతిని అమలుజరుపుతున్న కొలదీ అందులోని లోపాలు క్రమంగా బహిర్గతం అవుతున్నాయి. అంతేకాక, ప్రయివేట్ పరిశ్రమల్లోను, వాణిజ్యంలోను పరివర్తన తీసుకువచ్చే విషయంలో కొన్ని సందర్భాలలో గందరగోళ పరిస్థితి ఏర్పడింది. వీటన్నిటి ఫలితంగా, వాడకం వస్తువులను తయారుచేసే పరిశ్రమల్లో తయారయే వస్తువుల నాణ్యాన్ని పూర్తిగా విస్మరించటం, కొన్ని సందర్భాలలో ఆ నాణ్యం బాగా తగ్గిపోవటం వంటి శోచనీయపరిస్థితికూడా సంభవించింది. దీనంతటివల్ల ప్రభుత్వానికీ, ప్రజలకు నష్టం వాటిల్లింది. ఈ పరిస్థితిని తక్షణమే మనం రూపుమాపవలసివుంటుంది.

ఏయే పరిశ్రమలలో ఐతే తగినంత సాంకేతిక స్థాయి లేదో,ఏయే పరిశ్రమలలో ఐతే ఆధునిక పరిశ్రమలు లేవో ఆ పరిశ్రమలు సాధ్యమైనంత తక్కువ కాలంలో తమ సాంకేతిక స్థాయిని పెంపొందించుకోవాలి ; క్రమంగా ఆధునిక పరికరాలను ప్రవేశ పెట్టాలి. అన్ని పరిశ్రమలు తయారుచేసే వస్తువులకు న్యాయమైన ప్రమాణాలను నిర్ణయించాలి; అవసరమైన సాంకేతిక నిబంధనలను అమలు జరపాలి. ఖచ్చితమైన తనిఖీ పద్ధతిని అమలు జరపకుండా వున్న ఫ్యాక్టరీలలోను, గనులలోను, నిర్మాణ కేంద్రాలలోను తక్షణమే తనిఖీ పద్ధతిని ప్రవేశపెట్టాలి. పనిపాటల మంచి చెడులను ఎప్పటికప్పుడు తనిఖీ చేస్తూఉండాలి. అందుకు అవసరమైన సాంకేతిక పర్యవేక్షణను సమకూర్చాలి; అవసరమైన ప్రమాణాలలో వస్తువులను తయారుచేయకపోయినా, నిర్ణీత ప్రకారం నిర్మాణం జరగకపోయినా తక్షణం వాటిని సరిదిద్దే టట్లు చూడాలి. అలాగే ముడిసరుకుల, తదితర సరుకుల నాణ్యం పెంపొందించటానికి, వాటి సరఫరాను మెరుగుపర్చటానికి తీవ్రమైన చర్యలు తీసుకోవాలి. వాడకం వస్తువులను వాటి నాణ్యంప్రకారం కేటాయింపుచేసి, ధరలను నిర్ణయించాలన్న విధానాన్ని తు. చ. తప్పకుండా పాటించాలి, కొన్ని వస్తువుల విషయంలో కేటాయింపు చేసి ఖరీదుచేసే పద్ధతిని క్రమంగా అమలు జరపాలి. అన్నిటికంటే ముఖ్యమైన విషయం మరొకటి వుంది. ఆ యా పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికులు, ఉద్యోగులు వస్తువుల నాణ్యం అంతగా లేకపోయినప్పటికీ ఫరవాలేదులే అన్న పొరపాటు వైఖరిని పూర్తిగావిడనాడేటట్లు

తమ బాధ్యతలను గుర్తెరిగి పనిచేసేట్లు చూడటానికి వారిని సిద్ధాంతరీత్యాను, విద్యా విషయికంగాను అభివృద్ధి పర్చాలి.

## కార్మికుల, వుద్యోగుల స్థితిగతులను మెరుగు పర్చాల్సిన అవసరం

కార్మికుల, ఉద్యోగులలోని అధిక సంఖ్యాకులను మరింత ఉత్సాహపర్చాలంటే, వారి స్థితిగతులను క్రమ గా మెరుగు పర్చటం ఎంతేని అవసరం. కార్మికుల, ఉద్యోగుల స్థితిగతులను మెరుగుపర్చే విషయంలో మనలను ఎదుర్కొంటున్న సమస్య లేమిటి? మనం తీసుకోవలసిన మొట్టమొదటి చర్య ఇది: ఉత్పత్తి పెరుగుదల ప్రాతిపదికపై కార్మికుల, ఉద్యోగుల వేత నాలను క్రమంగా పెంచాలి. "చేసిన పనినిబట్టి వేతనం" అన్న సూత్రం ప్రకారం వేతనాలను నిర్ణయించే పద్ధతిని, ప్రోత్సాహ ధారకమైన చెల్లింపు నిర్ణయ పద్ధతిని యింకా మెరుగుపర్చాలి. ఉత్పత్తి క్రమంలో భద్రతా చర్యలను మెరుగుపర్చటం, కార్మి కులకు అధికతర రక్షణలను కల్పించటం మనం తీసుకోవలసిన రెండవ చర్య. పోతే మూడవ విషయం: ఉప ఆహార పదార్థాల సరఫరాను క్రమంగా ఎక్కువచేయాలి. నాల్గవ విషయం: కార్మికులకు, ఉద్యోగులకు శ్రేయోదాయక సౌకర్యాలను యింకా ఎక్కువగా సమకూర్చాలి; వారి ఇళ్ళ సమస్యను, తదితర సమస్యలను పరిష్కరించటానికి తీవ్రమైన కృషి సాగించాలి. ఆఖరి విషయం: కార్మికులు, ఉద్యోగులు తమ యిళ్ళదగ్గర పనులు చూసుకొనటానికి, తగినంత విశ్రాంతి తీసుకొనటానికి తగిన అవకాశం కల్పించాలి.

సోషలిస్టునిర్మాణంలో మనం బాగా అభివృద్ధి సాధించనంతకాలం కార్మికులను, ఉద్యోగులను పీడిస్తున్న సమస్యలలో అనేకవాటిని పరిష్కరించటం సాధ్యంకాదు. మనం కష్టపడి పనిచేయాలి. వ్యక్తిగతప్రయోజనాలనుగురించీ, తక్షణ ప్రయోజనాలనుగురించీ మితిమీరిన పద్ధతిలో దృష్టిని కేంద్రీకరిస్తూ, దీర్ఘకాలప్రయోజనాలను, మొత్తం దేశంయొక్క ప్రయోజనాలను విస్మరించకూడదు.

ఇదే విషయాన్ని మనం కార్మికులకు, ఉద్యోగులకు వివరించి చెప్పాలి. అయితే, మరొకవైపున, కేవలం దీర్ఘకాల ప్రయోజనాలనుగురించి, మొత్తం దేశంయొక్క ప్రయోజనాలనుగురించి మాత్రమే పాక్షికంగా నొక్కివక్కాణిస్తూ కార్మికుల, ఉద్యోగుల వ్యక్తిగత ప్రయోజనాలను, తక్షణ ప్రయోజనాలను విస్మరించటంకూడా పొరపాటే అవుతుంది. కార్మికుల, ఉద్యోగుల స్థితిగతులకు సంబంధించిన కొన్ని సమస్యలను వెంటనే పరిష్కరించాలి; పరిష్కరించగలంకూడా. పరిశ్రమలను నిర్వహిస్తున్నవారు, ట్రేడ్‌యూనియన్ సంస్థలు అందుకు సంబంధించిన తదితరశాఖలు యింతవరకు గట్టికృషి చేయనందుననే ఆ సమస్యలు అపరిష్కృతంగా మిగిలివున్నాయి. ప్రజల శ్రేయస్సువిషయంలో అలక్ష్యంచేసే అలాంటి నిరంకుశవైఖరిని మనం గట్టిగా ప్రతిఘటించాలి.

కార్మికుల, ఉద్యోగుల జీవిత సమస్యలకు సంబంధించినంతవరకు, పైన పేర్కొన్న సూత్రాలన్నీ అన్ని పరిశ్రమలలోను ప్రభుత్వశాఖలలోను పనిచేస్తున్న కార్మికులందరికీ ఉద్యోగులందరికీ వర్తిస్తాయి.

పరిశ్రమల నిర్వాహణతీరు, నిర్వహణ పద్ధతి సక్రమంగా ఉంటే కార్మికులు, ఉద్యోగులు ఉత్సాహంతో పనిచేసేటట్లు చూడటం సులభసాధ్యం కాగలదు. అయితే పరిశ్రమల్లో సక్రమమైన నాయకత్వ పద్ధతి అంటే అర్థంఏమిటి?

## పరిశ్రమల్లో సక్రమమైన నాయకత్వమంటే

పార్టీని ఆయువు పట్టుగా చేసుకొని, సమిష్టి నాయకత్వ సూత్రాన్ని వ్యక్తి బాధ్యతతో జోడించే నాయకత్వ పద్ధతిని పరిశ్రమలలో నెలకొల్పాలి. ప్రధానసమస్యలన్నింటినీ సమిష్టిగా చర్చించాలి; సమిష్టి చర్చలద్వారానిర్ణయాలుచేయాలి కాగా, నిత్య వ్యవహారాలన్నింటినీ పని విభజన, నిర్ణీత బాధ్యత ప్రాతిపదికపై నిర్వహించాలి. వివిధ పరిశ్రమల్లో తక్షణం నిర్వర్తించవలసిన కర్తవ్యాలేమిటో ప్రజాసామాన్యానికి స్పష్టంగా విడమర్చి చెప్పగల్గిన సామర్థ్యాన్ని పరిశ్రమల నిర్వహణ బాధ్యతలను చూస్తున్నవారు, పార్టీనాయకులు, పరిపాలనా శాఖాధిపతులు పరిశ్రమలలోని ట్రేడ్‌యూనియన్, యువజన సంఘాల నాయకులు అలవర్చుకోవాలి. పోటా పోటీలో ప్రజలందరూ ఉత్సాహంగా పాల్గొనేటట్లు ఆ నాయకులు ఉత్తేజపరచగల్గినసామర్థ్యం అలవర్చుకోవాలి. అత్యుత్తమమైన అనుభవాలను చక్కగా విరివిగా ప్రచారం చేయగల్గినవారై వుండాలి. రేషనలైజేషన్ ప్రతిపాదనలను సూచించగల్గాలి; నిరంతరం పనిని మెరుగుపర్చగల్గినవారై వుండాలి. పరిశ్రమలలోనివివిధ సంస్థలకు చెందిన నాయకులు ప్రజలతో సన్నిహితంగా మెలగటం అలవర్చుకోవాలి. సాధారణ కార్యకర్తలతో కలిసిమెలసి తిరు

గుతూ వారిభావాలేమిటో, కోర్కెలేమిటో ఆ నాయకులు గ్రహించగల్గాలి. సాధారణ కార్యకర్తలు పడుతున్న యిబ్బందులను తొలగించటానికి ఆ నాయకులు తోడ్పడగల్గాలి.

పరిశ్రమలలో నాయకత్వాన్ని బాగుపర్చటం అన్న సమస్య కేవలం ఆ యా పరిశ్రమలకు మాత్రమే సంబంధించినది కాదు. ఉన్నత సంస్థలుకూడా అందుకు బాధ్యత వహించవలసి వుంటుంది. ఈ సందర్భంలో మరొక విషయంకూడా పేర్కొనాలి; పరిశ్రమలను కంట్రోలు చేసే విషయాలలో ఉన్నత పరిపాలనా సంస్థలు మితిమీరిన విధంగా జోక్యం కల్పించుకొంటూ రూళ్ళకర్ర పద్ధతిలో తరచు వ్యవహరిస్తున్నాయి. దానివల్ల పరిశ్రమల చొరవ నశించిపోతోంది; అవి సమయోచితంగా మసలుకోటానికి సాధ్యం కాకుండాపోతోంది. తత్పర్యవసానంగా, నివారించటానికి వీలైన నష్టాలనుకూడా నివారించటానికి వీలు చిక్కటంలేదు. సమైక్య నాయకత్వం క్రింద, ప్రభుత్వ ప్రణాళికకు లోబడి, వివిధ పారిశ్రామిక సంస్థలు పథకాలు, ద్రవ్య విషయాలు, ఉద్యోగుల విషయాలు, కార్మికుల ఉద్యోగుల, కేటాయింపు, శ్రేయోదాయక సౌకర్యాలు మున్నగు విషయాలను నిర్వహించటంలో స్వయంగా నిర్ణయాలుచేసే అధికారాలను వాటికి తగినంతగా కల్గించటం అవసరం. దీని అర్థం ఉన్నత పరిపాలనా సంస్థలు వాటిపై తమ సారధ్యాన్ని సడలింప చేయాలని కానే కాదు. ఎవరైనా అలా అర్థం చేసుకొంటే అది పూర్తిగా పొరపాటని చెప్పాలి. అనేక ఉన్నత పరిపాలనా సంస్థలు తమ నాయకత్వం క్రిందనున్న పారిశ్రామిక సంస్థలతో

సన్నిహిత సంబంధాలు పెట్టుకోవటంలేదు. ఆ పరిపాలనా సంస్థలు తమ నాయకత్వం కింద ఉన్న పారిశ్రామిక సంస్థలకు తరచు అకాలమైన, అనిర్దిష్టమైన సలహాలు యిస్తున్నాయి మన ఆర్థిక శాఖలకు చెందిన నాయకత్వ సంస్థలు తమకు అప్ప గించిన బాధ్యతలను చక్కగా నిర్వర్తించటానికి తీవ్రమైన కృషి సాగించాలి; తమకు సంబంధంలేని విషయాల జోలికి అవి పోకూడదు; అలాగే చూసీ చూడనట్లు పోవలసిన స్వల్పవిషయా లను అని అంతగా పట్టించుకోకూడదు. ఉన్నత పరిపాలనా సంస్థల నాయకత్వంతో వివిధ పారిశ్రామిక సంస్థల చొరవను చక్కగా జోడించినప్పుడు మాత్రమే మన కృషిలో సత్వర విజయాలను సాధించగల్గుతాం.

## వ్యవసాయ రంగంలో మన అనుభవాలు

వ్యవసాయోత్పత్తిని, రైతుల ఆదాయాన్ని యితోధికం చేసే విషయంలో రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మనం గురుతర కర్తవ్యాలను నిర్వర్తించవలసివుంది. ఆ కర్తవ్యాలను మనం ఎలా నిర్వహించాలి?

నేడు మనం వ్యవసాయ యంత్రాలు లేకుండా వ్యవ సాయ సహకారాన్ని అమలుజరుపుతున్నాం. మన దేశంలో వ్యవసాయ రంగంలో యంత్రాలను సక్రమపద్ధతిలో, క్రమ క్రమంగా మాత్రమే ప్రవేశపెట్టగలం; దేశం పారిశ్రామిక వంతమయే కొలదీ, వివిధప్రాంతాలలో ఉన్న విభిన్న వ్యవసాయ పద్ధతులను దృష్టిలో వుంచుకొని మాత్రమే మనం వ్యవసాయ రంగంలో యంత్రాలను ప్రవేశపెట్టగలం. రెండో పంచవర్ష

ప్రణాళికను అమలుజరపటం పూర్తయ్యేసరికి, మన దేశంలో మొత్తం సాగవుతున్న భూమిలో కేవలం నూటికి 10 వంతులు మాత్రమే యంత్రాలతో సాగుచేయబడుతూ వుంటుందని అంచనా వేస్తున్నాం. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలోవలెనే, రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలోకూడా క్రొత్తగా సాగులోకి వచ్చే భూమి విస్తీర్ణం యిప్పటికే సాగవుతున్న మొత్తం భూమిలో ఇరవయ్యో వంతు వుండవచ్చు. 1962 నాటికి, సాగవుతున్న ప్రతి ఒక్క ఎకరా భూమికి (ఎకరా అనగా యకరంలో 6వ భాగం) సగటున మూడు కట్టీల రసాయనిక ఎరువులను మాత్రమే సరఫరా చేయగలం. అందువల్ల రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలోకూడా, వ్యవసాయ సహకార సంస్థలపైననే ప్రధానంగా ఆధారపడుతూ, రైతులంతా ప్రతిసంవత్సరం సాధ్యమైనంత ఎక్కువపంట తీసేటట్లు చూడటం ద్వారా మాత్రమే వ్యవసాయ రంగంలో అధికోత్పత్తిని సాధించవలసివుంటుంది. అందుకు సాధ్యమైన ప్రతిచోట నీటి పారుదల సౌకర్యాలను పెంపొందించాలి, ఎక్కువ ఎరువులను వాడేటట్లు చూడాలి. భూములను బాగుచేయాలి; మేలురకం విత్తనాలను వాడాలి. పెద్ద ఎత్తున క్రొత్తతరహా వ్యవసాయ పనిముట్లను వాడాలి. సాగు పద్ధతులను బాగుపర్చాలి. ఒకే సంవత్సరంలో పలుమార్లు పంటలు పండించే పద్ధతిని పెంపొందించాలి. తెగుళ్ళను, మిడుతలదండు ప్రమాదాన్ని అరికట్టాలి.

ఇలాంటిచర్యలు తీసుకోటంద్వారా వ్యవసాయోత్పత్తిని అపారంగా పెంపొందించటానికి అవకాశముందన్న విషయాన్ని మనం గుర్తించాలి. ఇక నీటిపారుదల సౌకర్యాలకు సంబంధిం

చినంతవరకు, దేశంలో మొత్తం సేద్యం చేయబడుతున్న భూమిలో మూడోవంతుకు మాత్రమే నీటిపారుదల సౌకర్యాలున్నాయి సేద్యం చేయబడుతున్న మిగతా రెండువంతుల భూమిలోకూడా కొంతభాగానికి నీటి పారుదల సౌకర్యాలుకల్పించటానికి అనేక చోట్ల అవకాశాలున్నాయి. ఆఅవకాశాలన్నిటినీ మనం పూర్తిగా వినియోగించుకోవాలి ఇక ఎరువులకు సంబంధించినంతవరకు, సహజసిద్ధమైన పేడ, పెంట, ఆకుముద్దగు ఎరువులను వాడితే ఫలసాయాన్ని పెంచటానికవీలున్నది. అయితే కొన్నిచోట్ల సహజంగా లభించే ఈఎరువులను మనం పూర్తిగా ఉపయోగించుకోటంలేదు, పైగా చైనాగ్రామీణప్రాంతాలలో వ్యవసాయ సహకారప్రాతిపదికపై సుసంఘటితమైవున్న అపార మానవసంపదవుంది. మనం కనుకపైన సూచించిన విధంగా సరియైన పద్ధతిలో ముందుకు సాగితే రెండో పంచవర్ష ప్రణాళికలో పేర్కొన్న లక్ష్యాలను అధిగమించటం సాధ్యమే కాగలదు.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలోకూడ ఆహార ధాన్యాలు, ప్రత్తి పంట ఉత్పత్తిని పెంపొందించటం అత్యంత ప్రధానమైన కర్తవ్యంగా వుంటుంది. కాగా, ఇతర పారిశ్రామిక పంటల ఉత్పత్తిని, పశుగణాభివృద్ధిని, తదితర ఉపవృత్తుల ఉత్పత్తిని యిత్తోధికం చేయటంకూడా ముఖ్య కర్తవ్యంగా పరిగణించాలి. ఎందుకంటే, తమ సొంత వినిమయంకోసం రైతులు సాగించే ఉపవృత్తులను మినహాయించితే, పారిశ్రామిక పంటలు, పశుగణం, తదితర ఉపవృత్తుల ఉత్పత్తి విలువ దేశంలో జరిగే మొత్తం వ్యవసాయోత్పత్తి విలువలో సగంవుంది. అందువల్ల రైతుల ఆదాయంలో వాటిపాలు ప్రధానమైనది కనుక, వాటి

ప్రాధాన్యంకూడా హెచ్చుగా ఉంటుంది. అదీకాక, వాడకం వస్తువులను ఉత్పత్తిచేసే పరిశ్రమలకు ముడిసరుకులను సమృద్ధిగా సరఫరా చేయాలన్నా, ఉపఆహార పదార్థాలను సమృద్ధిగా సరఫరా చేయాలన్నా, సరుకుల ఎగుమతులు ఎక్కువగా జరగాలన్నా పారిశ్రామిక పంటల ఉత్పత్తినీ, పశుగణ సంపదనూ, తదితర ఉపవృత్తుల ఉత్పత్తినీ యితోధికం చేయటం ఎంతేని అవసరం. ఉదాహరణకు పందుల పెంపకాన్నే తీసుకోండి. 1957 నాటికి పెంచబడే పందుల సంఖ్య 13 కోట్ల 80 లక్షలు వుంటే, 1962 నాటికి ఆ సంఖ్య 25 కోట్లకు పెరగాలని మనం లక్ష్యంగా పెట్టుకొన్నాం. దేశం మొత్తానికి ఇటు పట్టణాలకు, అటు గ్రామాలకు, మాంసం సరఫరా చేయాలన్నా, పంటలకు ఎరువులు సరఫరా చేయాలన్నా, అలాగే మాంసాన్ని విదేశాలకు ఎగుమతి చేయాలన్నా పందుల పెంపకాన్ని అభివృద్ధి చేయటం చాలా ముఖ్యం. అందువల్ల మనం పందుల పెంపకాన్ని పెంపొందించటానికి శక్తివంచన లేకుండా పాటుబడాలి. అన్ని స్థానిక పార్టీ యూనిట్లు, స్థానిక ప్రభుత్వాలు, వ్యవసాయరంగానికి సంబంధించిన ప్రభుత్వశాఖలు పారిశ్రామిక పంటల ఉత్పత్తిని, పశుగణాభివృద్ధిని, తదితర ఉపవృత్తుల ఉత్పత్తిని పెంచటానికి దీక్షపూని పనిచేయాలి. స్థానికావసరాలను ప్రభుత్వ అవసరాలను దృష్టిలో వుంచుకొని, కేంద్ర, స్థానిక ప్రణాళికలను పరిగణనలోకి తీసుకొని, ప్రతివ్యవసాయ సహకార సంస్థ ఆహారధాన్యాల ఉత్పత్తిని, పారిశ్రామిక పంటల ఉత్పత్తిని, పశుగణ సంపదను, తదితర ఉపవృత్తుల ఉత్పత్తిని పెంచేవిధంగా వారుతోడ్పడాలి. ఉపవృత్తుల ఉత్పత్తిని పెంచేవిషయం ఆలో

-చించేటప్పుడు, సహకార సంస్థల సమిష్టి పనులకూ యిళ్ళదగ్గర సభ్యులు చూసుకోవలసిన సొంతపనులకూ మధ్య సరియైన పని విభజన జరిగేటట్లు చూడాలి. ఆవిధంగా సరియైన పద్ధతిలో ఉభయత్రా ఉత్సాహం, చొరవ యితోధికం చేయ వీలవు తుంది. ప్రస్తుతం అనేక సహకార సంస్థలలోని సభ్యులు యింటిదగ్గర సొంత గృహఉపవృత్తులను చూసుకోటానికి వీలు లేకుండా చేస్తున్నారు. ఈ వక్రధోరణిని సరిదిద్దుకోవాలి.

పారిశ్రామిక పంటల ఉత్పత్తిని పెంచటానికి, పశుగణ సంపదను వృద్ధిచేయటానికి, తదితర ఉపవృత్తుల ఉత్పత్తిని యితోధికం చేయటానికి సరియైన ధరల విధానం అమలు జరపటం ఎంతేని అవసరం. చైనాలో ప్రజారాజ్యం స్థాపించబడి నప్పటినుంచీ మనం అనుసరించుతూ వచ్చిన ధరలవిధానం మొత్తంమీద సరిగానే ఉందనీ, రైతుల ప్రయోజనాలకు అనుగుణంగానే వుందనీ చెప్పాలి. అయితే ధరల విధానాన్ని అమలు జరపటంలో కొన్ని పొరపాట్లుకూడ జరిగాయని ఒప్పుకోకతప్పదు. గత కొలది సంవత్సరాలలో పారిశ్రామిక పంటల ఉత్పత్తి, పందుల పెంపకం, ఇతర ఉపవృత్తుల ఉత్పత్తి తగినంతగా పెరగనేలేదు. పైగా కొన్నిచోట్ల తరిగిపోయింది కూడా. ఇలా జరగటానికి కారణమేమిటి? ఈ సరుకులకు తక్కువ ధరలునిర్ణయించి కొనుగోలు సాగించటమే అందుకు హేతువు అని చెప్పాలి. అందుచేత ధరలవిషయం పునరాలో చించి పరిశీలించిన పిమ్మట చాలా తక్కువుగా వున్న వాటిని తగినవిధంగా పెంచాలి.

ఉత్పత్తి పెరుగుదలతోపాటు, రైతుల ఆదాయంకూడా పెరిగేటట్లు చూడటం చాలా ముఖ్యమైన విషయమని గుర్తించాలి. అలా గుర్తించి వ్యవహరించినప్పుడే వ్యవసాయోత్పత్తిని నిరాఘాటంగా అభివృద్ధిచేయ వీలవుతుంది.

దేశమంతటా సహకార సంస్థలు, మొదటి సంవత్సరాలలో పంటలు మామూలుగా పండితే తమ సభ్యులలో నూటికి 90 మంది ఆదాయం పెరిగేటట్లు చూడాలని పార్టీ కేంద్రకమిటీ కోరుతోంది. అటు తర్వాత, ఉత్పత్తి పెరుగుదల ప్రాతిపదికపై సభ్యులందరి ఆదాయం ఏటా పెరిగేటట్లు చూడాలని సూచిస్తోంది. అందుకు పన్నుల విషయంలోను, ధరల విషయంలోను ప్రభుత్వం సరియైన విధానాలు అనుసరించినంత మాత్రాన సరిపోదు; సహకార సంస్థల ఆదాయంలో ఎంత భాగం రిజర్వు నిధికి కేటాయించాలి, మరెంత భాగం రైతుల ఆదాయంగా కేటాయించాలి అన్న సమస్యను సహకార సంస్థలు సరిగా పరిష్కరించవలసివుంటుంది. అందువల్ల వ్యవసాయ సహకార సంస్థలు నిర్వహణ వ్యయాన్నిగానీ, ఉత్పత్తి వ్యయాన్నిగానీ, రిజర్వు నిధులకు శ్రేయోదాయక సౌకర్యాలకు కేటాయించే మొత్తాలనుగానీ నిరంకుశ పద్ధతిలో యిష్టమొచ్చినట్లు పెంచకూడదు. అదే సమయంలో ప్రభుత్వం విధించే పన్నులుకూడా సరియైన దామాషాలో వుండాలి. ప్రభుత్వ ప్రయోజనాలను, సమిష్టి ప్రయోజనాలను, సభ్యుల వ్యక్తిగత ప్రయోజనాలను సక్రమంగా పరిగణనలోకి తీసుకొని, పంపిణీ విధానాన్ని రూపొందించి, దాన్ని తు. చ. పాటించాలి.

## వాణిజ్య రంగంలో

వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో జరిగిన పరిణామాల కనుగుణ్యంగా మన దేశం మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో దేశీయ, విదేశీయ వాణిజ్యంలోకూడ అద్భుతమైన విజయాలు సాధించింది. దేశీయ వాణిజ్యంలో ఈయేడు చిల్లర అమ్మకాలు 1952 లోకన్న 100 కి 66.3 హెచ్చుగా ఉంటాయని ప్రణాళిక అంచనాలు తెలియజేస్తున్నాయి. గత కొద్ది సంవత్సరాల్లో మనం సరకుల ధరలను స్థిరీకరించగలిగాం; గ్రామ సీమలకూ పట్టణాలకూ మధ్య సరకుల మారకం పెరిగింది. ప్రజల అవసరాలు తీరాయి. విదేశ వ్యాపారంలో మన ఎగుమతి దిగుమతుల విలువ 1952 లో కన్న ఈ యేడు 100 కి 65 చొప్పున హెచ్చుతుంది. విముక్తికి పూర్వం ప్రధానంగా యితర దేశాలనుంచి వాడకం వస్తువులను దిగుమతి చేసుకునేవారం. కాని, 1950 నుంచీ మన దిగుమతుల్లో 100 కి 90 వంతులు ఉత్పత్తి సాధనాలు, జాతీయ నిర్మాణాని కవసరమైన యంత్రసామగ్రి మొదలైనవన్నీ విదేశ వ్యాపారంవల్ల లభిస్తున్నాయి; సోవియట్ యూనియన్‌తోను, నూతన ప్రజాస్వామ్య దేశాలతోను, తదితర దేశాలతోను ఆర్థిక సహకారం పెంపొందించుకోడానికి, స్నేహ సంబంధాలను వృద్ధి చేసుకోడానికి ఈ విదేశ వ్యాపారం మనకు తోడ్పడుతోంది.

ప్రాథమిక అంచనాలనుబట్టి, రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మన జాతీయ ఆర్థిక వ్యవస్థ మరింత అభివృద్ధి చెందుతుంది గనుక, 1962 లో చిల్లర వ్యాపారం 1957 లో కన్న

100 కి 50 వంతులు పెరుగుతుంది. ఎగుమతి దిగుమతి వ్యాపారంకూడ బాగా వృద్ధిచెందుతుంది.

ప్రైవేట్ వ్యాపారంలో సోషలిస్టు పరివర్తన ప్రధానంగా పూర్తికావడంవల్ల సమైక్య సోషలిస్టు మార్కెట్టు ఒకటి ఉద్భవించింది; మన జాతీయ ఆర్థిక వ్యవస్థలో సోషలిస్టు వాణిజ్యం చాల ప్రధానమైన పాత్ర వహిస్తోంది. సోషలిస్టు వాణిజ్యం ద్వారానే యీరోజున వాడకం వస్తువులు, వివిధ పరిశ్రమల్లో తయారయే కొన్ని ఉత్పత్తి సాధనాలు, విక్రయానికి సిద్ధంగావున్న వ్యవసాయ దినుసులు వివిధ పారిశ్రామిక శాఖలకు, వ్యవసాయ సహకార సంస్థలకు వాడకందార్లకు సప్లై చేయబడుతున్నాయి. ఇకముందు మన ప్రజల కొనుగోలుశక్తి మరింత పెరుగుతుంది; వాడకం వస్తువులకు గిరాకీ హెచ్చుతుంది; ముఖ్యంగా యితర ఆహారపదార్థాల అవసరం ఎక్కువవుతుంది; వ్యవసాయ సహకారోద్యమం, పరిశ్రమలు వేగంగా వృద్ధిచెందుతాయి; విదేశ వ్యాపారంలో ఎగుమతుల అవసరం రోజు రోజుకూ పెరుగుతుంది ఇట్టి పరిస్థితుల్లో మన వాణిజ్య రంగంయొక్క కార్యకలాపాలు ఇంకా యెక్కువవుతాయి. అందుచేత వాణిజ్యశాఖలు ప్రజల అవసరాలను, ఎగుమతుల ప్రాముఖ్యతనుకూడా దృష్టిలో ఉంచుకొని, వ్యవసాయ — పారిశ్రామిక సరకులను ఇంకా యెక్కువ మొత్తాలలో ఇంకా నాణ్యమైనవి సేకరించడానికవసరమైన ధరల విధానాన్ని, కొనుగోలు పద్ధతినీ రూపొందించుకోవలసియుంటుంది వివిధ వాణిజ్య సంస్థల నిర్మాణాన్ని అవి పెంపొందించాలి; సరకుల

పంపకాన్ని ఎక్కువ చేయాలి; వ్యవసాయ — పారిశ్రామిక సరకుల కొనుగోలును, సప్లైని చక్కపరచాలి; సరకుల సేకరణ, విక్రయం సక్రమంగా జరిగేటట్లు వివిధ వాణిజ్య సంస్థల పనిని సమన్వయపరచాలి.

వాణిజ్యం అభివృద్ధిచెందడానికి మనం ముఖ్యంగా తీసుకోవలసిన చర్యలు: కొనుగోలునూ విక్రయాన్నీ మరింత చక్కగా సమన్వయపరచడం; ధరలవిధానాన్ని సక్రమంగా అమలు జరపడం; కొన్ని సరకుల ధరలను సక్రమపద్ధతులద్వారా తిరిగి నిర్ణయించడం

ప్రభుత్వం పెట్టుబడిదారీ సంస్థలను ఉపయోగించుకొనే, పరిమితమొనర్చే, మార్పు తీసుకువచ్చే విధాన మవలంబిస్తున్న నేటిదశలో కొనుగోలునూ, విక్రయాన్నీ సమన్వయపరచడానికి అనేక చర్యలు తీసుకోబడ్డాయి. ఇప్పుడు వాటిని మార్చవలసిన అవసరం ఉంది; ప్రస్తుత ఆర్థికపరిస్థితుల కనుగుణ్యంగా కొత్త చర్యలు తీసుకోవలసియుంది. పెట్టుబడిదారీ పరిశ్రమలు, వాణిజ్యం ప్రభుత్వ - ప్రైవేట్ జాయింటుమేనేజిమెంటు క్రిందికి రాక పూర్వం ప్రభుత్వవాణిజ్యసంస్థలు ప్రైవేట్‌పరిశ్రమలకు ఆర్డర్లిచ్చి సరకులను తయారుచేయించేవి; వాటన్నిటినికొనివేసి మార్కెట్లో అమ్మించేవి. వ్యవసాయదినుసుల విషయమేమంటే, రైతులు పండించే ధాన్యాలను, పత్తిని, నూనెగింజలను ప్రభుత్వమే ఒక ప్లానుప్రకారం కొనివేసే పద్ధతితోపాటు, సహకార క్రయవిక్రయ సంస్థలుకూడా క్రమబద్ధంగా వ్యవసాయదినుసులను కొనడానికి అధికారమీయబడింది. లేదా ప్రభుత్వవాణిజ్యసంస్థకే అదనపు

సరుకును సరాసరి కొనివేసేవి. నగరాలలోను, పట్టణాలలోను విక్రయసంస్థలపై కఠినమైన కంట్రోళ్ళు విధింపబడేవి; అన్ని సరకులకూ ఒకే విధమైన ధరలు నిర్ణయింపబడేవి; ప్రైవేట్ వర్తకుల కార్యకలాపాలలో కొన్నిటిపై నిబంధన లుండేవి. ఈ చర్య లన్నీ ఆరోజుల్లో అవసరమయ్యాయి; వాటివల్ల సత్ఫలితాలు కూడా కలిగాయి. కాని వాటిని అమలుజరపడంలో కొన్ని చిక్కులుకూడా వచ్చాయి. ఉదాహరణకు, కొన్ని పారిశ్రామిక సరకుల నాణ్యం తగ్గిపోయింది; కొన్ని సరకులు చాల కొద్ది నమూనాల్లో తయారుచేయబడేవి; అందువల్ల కొనుగోలుదార్లు తమకునచ్చిన నమూనాలు లభ్యంకాక యిబ్బందిపడేవారు; కొన్ని వ్యవసాయదినుసుల, తదితర సరకుల ఉత్పత్తి తగ్గిపో యింది; కొన్ని సరకుల పంపకం సరిగా జరగలేదు. ఈ లోపా లన్నిటినీ యిప్పుడు మనం అధిగమించాలి. ప్రస్తుతం అమల్లో ఉన్న మార్కెటింగ్ కంట్రోలు పద్ధతిని చక్కపరచాలి; మరీ కఠినంగా ఉన్న నిబంధనలను రద్దుచేయాలి. సోషలిస్టు మార్కెట్టు పరిమితుల్లో ప్రైవేట్ మార్కెట్టు కొన్ని హద్దులలో అభి వృద్ధి చెందడానికీ, ప్రభుత్వ మార్కెట్టుకు అనుబంధంగా ఉండ డానికీ అనుమతించాలి. ఈ ప్రైవేట్ మార్కెట్టుపై ప్రభుత్వం ఎప్పటికప్పుడు అజమాయిషీ చేస్తూ ఉండాలి.

విముక్తికి ముందు 12 సంవత్సరాలు మనదేశం విపరీత మైన నోట్ల ముమ్మారంలో యిరుక్కొని ఉక్కిరిబిక్కిరి అయింది. వివిధ సరుకుల ధరలు నిరంతరం మార్పు చెందుతూ ఉండేవి. అట్టి పరిస్థితుల్లో, విముక్తి తర్వాత మన పార్టీ అనుసరించిన

కీలక విధానం ధరలను స్థిరీకరించడం. అంటే, కొన్ని సరకుల ధరలు న్యాయమైనవా కావా అనే ప్రసక్తి లేకుండా, అన్ని సరకుల ధరలనూ ఆనాడున్న స్థాయిలో స్థిరీకరించడమే ప్రప్రథమ కర్తవ్యమైంది. కొంతకాలం వాటి ధరలు స్థిరపడ్డతర్వాత, మరీ అవకతవకగా ఉన్న ధరలను ప్రభుత్వం మార్చింది. ఆనాడు మనమనుసరించిన యీ విధానం సరియైనదే. దాన్ని అమలు జరపడంవల్ల సత్ఫలితాలు కలిగాయి. దేశంలో వ్యవసాయ, పారిశ్రామికోత్పత్తిని పెంచడంలో యీ విధానం మంచి ఫలితాలనిచ్చింది. అయినప్పటికీ, యీ కొత్త విధానాన్ని అమలు జరపడంలో అనేక లోపాలు, పొరపాట్లుకూడా జరిగాయి. మన వాణిజ్య శాఖలు గత అనుభవాన్ని క్రోడీకరించి, సరకుల ధరలను స్థిరీకరించాలనే సూత్రానికి కనుగుణ్యంగా, ప్రస్తుత పరిస్థితులకు తగినట్లు, వ్యవసాయ — పారిశ్రామికోత్పత్తికి ఉపయోగకరంగా ఉండేటట్లు యింకా సమగ్రమైన ధరల విధానాన్ని రూపొందించాలి. ధరల విధానంలో మన మనుసరిస్తున్న ముఖ్య సూత్రాలలో ఒకటి ఏమంటే, కొనుగోలు ధరలను నిర్ణయించేటప్పుడు అవి ఉత్పత్తి పెరుగుదలను ప్రోత్సహించే విధంగా ఉండాలి. వ్యవసాయ, పారిశ్రామిక సరకుల నాణ్యాన్ని పెంచాలంటే, కొనుగోలులోను విక్రయంలోను కూడా వివిధ సరకుల నమూనాలను వేర్వేరుగా విభజించి, నాణ్యాన్నిబట్టి ధరలను నిర్ణయించేపద్ధతిని అమలు జరపాలి. స్థానికంగా లభించే సరకుల కొనుగోలు ధరలకూ, విక్రయ ధరలకూ వ్యత్యాసం మరీ ఎక్కువగా ఉంటే దాన్ని ఉచితరీతిని తగ్గించాలి. తక్కువధరలకు విక్రయింపబడే

సరకుల టోకుధరలకూ, చిల్లరధరలకూ గల వ్యత్యాసాన్ని తగు విధంగా పెంచాలి. ప్రభుత్వంయొక్క ధరల విధానానికి వ్యతిరేకంగా వర్తకంలో మరీయెక్కువ లాభాలను గుంజే ప్రయత్నాలను ఖచ్చితంగా నిషేధించాలి.

వాణిజ్యరంగంలో నేడు మన కార్య కలాపాలు చాల ప్రాధాన్యత వహిస్తాయి; అందులో పనిచేసే కార్యకర్తలంతా యింకా చక్కగా వ్యాపారం చేయడం నేర్చుకోవాలి. వాణిజ్యరంగంలో యింతవరకు మనం సంపాదించిన అనుభవాన్ని జాగ్రత్తగా పరిశీలించి, మన దేశంలో సోషలిస్టు వాణిజ్యాన్ని యింకా ఎక్కువ ఉన్నతస్థాయికి అభివృద్ధి చేసేందు కవసరమైన కార్యకర్తలను, నిపుణులను ఒక ప్లాను ప్రకారం తరిఫీదు చేయాలి.

## సంస్కృతి, విద్య

సోషలిస్టు నిర్మాణ మంతటిలోను సాంస్కృతిక విద్యా రంగాల కృషికికూడా ఒక ముఖ్యమైన స్థాన ముంది. గత శాబ్ది సంవత్సరాల్లో యిది ఎంతో అభివృద్ధి చెందింది. ఉన్నత విద్యా సంస్థలలో విద్య నభ్యసించేవారి సంఖ్య 1949 లో 1,16,000 మాత్రమే; 1956 నాటి కది 3,80,000 కు పెరిగింది. మిడిల్‌స్కూళ్ళలో విద్యార్థుల సంఖ్య 12,68,000 నుంచి 58,60,000 కు పెరిగింది. ప్రాథమిక పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య 2,43,90,000 నుంచి 5,77,00,000కు పెరిగింది. ప్రచురింపబడ్డ పుస్తకాల ప్రతులు 1949 లో 10 కోట్లు అయితే, 1956 లో 169 కోట్లకు పెరిగాయి. ఆసుపత్రులలోను, ఆరోగ్య సద

నాలలోను ఉండే పడకల సంఖ్య 1,06,000 నుంచి 3,39,000 కు పెరిగింది.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఉన్నత విద్యా సంస్థలలోని విద్యార్థులు 100 కి 100 మంది హెచ్చు కావాలనీ, హైస్కూలు వృత్తి విద్యాలయాలలోను సీనియర్ మిడిల్ స్కూళ్ళలోను జూనియర్ మిడిల్ స్కూళ్ళలోను విద్యార్థుల సంఖ్య తదనుగుణ్యంగానే పెరగాలనీ రెండవ ప్రణాళిక నిర్దేశించింది. అధునాతనమైన శాస్త్రవిజ్ఞానంలో మనం త్వరితంగా ప్రావీణ్యత సంపాదించడానికి నిపుణులను తరిఫీదు చేయాలనీ, శాస్త్రపరిశోధనలకు ప్రోత్సాహమివ్వాలనీకూడా రెండవ పంచవర్ష ప్రణాళిక ఆదేశిస్తోంది. 1956 నుంచి 1967 వరకు శాస్త్ర విజ్ఞానాన్ని అభివృద్ధిచేసేందుకు మన శాస్త్రవేత్తలిదివరకే ప్రాథమిక రూపంలో ఒక సమగ్రపథకాన్ని తయారుచేశారు. దాని ప్రకారం, మన జాతీయ ఆర్థిక వ్యవస్థకు కావలసిన శాస్త్రవిజ్ఞాన శాఖల్లోను, సాంకేతిక శాఖల్లోను నైపుణ్యాన్ని దాదాపు 12 సంవత్సరాల్లో ప్రపంచస్థాయి నందుకోవలసి యుంటుంది ఈ లక్ష్యాన్ని సాధించేందుకు మన దేశంలో వివిధ శాస్త్రపరిశోధనాలయాలు, ఉన్నత విద్యాసంస్థలు సాగిస్తూన్న కృషిని మనం గట్టిగా బలపరచాలి

మన దేశంలో శాస్త్రవిజ్ఞానం, కళలు అభివృద్ధిచెంది సోషలిస్టు నిర్మాణానికి చేదోడు వాదోడుగా ఉండేటట్లు చూడాలి. ఇందుకు కేంద్ర కమిటీ "అన్నిరకాల పుష్పాలను వికసింపనీయండి! విభిన్నదృక్పథాలను ఘర్షణపడనీయండి!"

అనే విధానాన్ని ప్రవేశపెట్టింది. శాస్త్రవిజ్ఞానం ఎట్టిదంటే, దానిపై ఎంత ఎక్కువగా చర్చజరిగితే అంత స్పష్టంగా అది రూపొందుతుంది. కళారంగంలో అన్ని స్టయిల్స్‌కూ స్థానం ఉండాలి. కళారంగానికి సంబంధించిన, విజ్ఞానానికి సంబంధించిన సమస్యల్లో పార్టీ పరిపాలనా సంబంధమైన ఉత్తర్వులమీద ఆధారపడ్డందువ్వారా తన నాయకత్వాన్ని అమలుజరపకూడదు. కళలనూ, శాస్త్రవిజ్ఞానాన్నీ అభివృద్ధిచేయడానికి పార్టీ స్వేచ్ఛాయుతమైన చర్చలను ప్రోత్సహించాలి; ఒకరిని మించి ఒకరు నైపుణ్యం సంపాదించడానికి ప్రయత్నించేటట్లు వారిని ఉత్సాహపరచాలి.

మన దేశంలో సాంస్కృతిక విప్లవాన్ని తీసుకురావాలంటే, నిరక్షరాస్యతను క్రమక్రమంగా రూపుమాపాలి. అంతే కాదు ఆర్థికపరిస్థితులు అనుకూలంగా ఉంటే, 12 సంవత్సరాల్లో క్రమక్రమంగా దశల వారీగా వివిధప్రాంతాల్లో బాల బాలికలందరికీ నిర్బంధ ప్రాథమిక విద్యను అమలు జరపడానికి పూనుకోవాలి. ప్రాథమిక విద్యను క్రమక్రమంగా విస్తృతపరచాలి. అదే సమయంలో కార్మికులకూ, ఉద్యోగులకూ సాధారణవిద్య, సాంకేతికవిద్య ఇంకా యెక్కువగా నేర్పడానికి కృషిచేయాలి. తక్కువగా చదువుకున్న ప్రభుత్వ నిర్వాహకులకు సాధారణవిద్యను ఇంకా యెక్కువగా నేర్పాలి. లిపిలేని అల్పసంఖ్యాక జాతుల భాషలకు లిపిని సృష్టించాలి.

మన మేధావులకు, యావన్మంది ప్రజలకు సోషలిస్టు భావాలు, మార్క్సిస్టు—లెనినిస్టు సిద్ధాంతాలు బోధించి అవి

పదునైన ఆయుధాలుగా వారికి ఉపయోగపడేటట్లు చేయాలి; ఫ్యూడల్, బూర్జువా ఆలోచనా విధానాలను విమర్శించాలి. గత కొద్ది సంవత్సరాల్లో మనం యీవిధంగా విస్తారమైన కృషి చేశాం; మన దేశంలో సోషలిస్టు పరివర్తన జయప్రద మయ్యేం దుకు ఇది చాల తోడ్పడింది. కాని, పాత ఉత్పత్తి సంబంధా లలో మార్పు తీసుకురావడంకన్న పాత ఆలోచనా విధా నాల్లో మార్పు తీసుకురావడం ఎక్కువ కష్టమనీ, ఎక్కువ కాలం పడుతుందనీ మనకు తెలుసు. అందుచేత మనం సిద్ధాం తరంగంలో ఇంకా యెక్కువ తీవ్రంగా కృషి చేయవలసియుంది. ఒక వైపు ఫ్యూడల్, బూర్జువా ఆలోచనా విధానాలను విమ ర్శిస్తునే, మరోవైపు గత సాంస్కృతిక సాంప్రదాయాల్లో ప్రజ లకు ఉపయోగపడే భావాలను మనం జాగ్రత్తగా స్వీకరించాలి.

సాంస్కృతిక, విద్యారంగాల్లో మనం వివిధ కర్తవ్యా లను జయప్రదంగా నిర్వర్తించడానికి మేధావుల సంఖ్యను ఎక్కువచేసుకోవాలి అనేకమంది మేధావుల్ని మనం తరిఫీదు చేయవలసియుంది. ముఖ్యంగా కష్టజీవులనుంచి వచ్చిన మేధా వులకు విద్యాసంస్థల్లో తరిఫీదుచేయాలి; కార్యకర్తలకు తరిఫీదు యివ్వడానికి ఏర్పాట్లుచేయాలి. అదేసమయంలో బూర్జువా, పెటీబూర్జువామేధావులు సోషలిస్టునిర్మాణానికి సహాయపడే టట్లు వారి శక్తిసామర్థ్యాలను వినియోగించుకోవాలి; వారి నుంచి మనం నేర్చుకోవాలి. అయితే, వారు తమతోపాటు తీసుకువచ్చే బూర్జువా, పెటీబూర్జువా ఆలోచనావిధానాలు శ్రామికవర్గాన్ని పతనమొనర్చకుండా జాగ్రత్తపడాలి. పైగా,

వారు కష్టజీవులతో సన్నిహితసంబంధంగల కొత్త మేధావులుగా మారేటట్లు మనం శాయశక్తులా ప్రయత్నించాలి. మనపార్టీ చిరకాలంనుంచీ ప్రజల్లో క్రమబద్ధంగా పనిచేస్తూండడంవల్ల మన మేధావుల్లో అనేకమంది యిప్పటికే కార్మికకర్షకులతో సన్నిహితసంబంధా లుంచుకొన్నారు; చాలమంది మేధావులు కమ్యూనిజాన్ని నమ్ముతూ, పార్టీలో సభ్యులుగా చేరారు. ఇప్పటినుంచీ మన మనుసరించవలసిన విధానమేమంటే మేధావులను ఐక్యపరుస్తూ, తరిఫీదుచేస్తూ, వారిలో మనం పరివర్తన తీసుకురావాలి; వారిని యింకా చక్కగా వినియోగించుకోవాలి. అప్పుడు వారు మన మాతృదేశాన్ని పునర్నిర్మించేందుకు ఇంకా గట్టి కృషి చేస్తారు.

# 4. రాజ్యాంగయంత్రం: రాజకీయ వ్యవస్థ

విప్లవంయొక్క కీలక సమస్య రాజ్యాధికార సమస్య. మన దేశ స్వరూపంలో అత్యంత ప్రధానమైన మార్పులను మనం తీసుకు రాగలిగామంటే, యింత స్వల్పకాలంలో — 7సంవత్సరాలు — సోషలిస్టు పరిణామంలోను సోషలిస్టు నిర్మాణాలలోను అఖండమైన విజయాలను మనం సాధించగలిగామంటే కారణమేమిటి ? కార్మికవర్గం, ప్రజాసామాన్యం దేశం మొత్తం మీద రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకొనేటట్లు వారికి మనం నాయకత్వం వహించడంవల్ల నేకాదా ? మనదొక సరి

కొత్త రాజ్యాధికారం—నూతన ప్రజాతంత్రి నియంతృత్వం—కావడం వల్లనే కాదా ?

మన దేశంలో యిదివరకే ప్రారంభమైన సోషలిస్టు నిర్మాణాన్ని పెద్దయెత్తున అభివృద్ధి చేయాలంటే, సోషలిస్టు పరిణామాన్ని పూర్తి చేయాలంటే నూతన ప్రజాతంత్రి నియంతృత్వాన్ని ఎడతెగకుండా మనం పటిష్ఠ మొనర్చాలి; రాజ్యాంగ యంత్రంయొక్క కార్యకలాపాలను మెరుగు పరచాలి.

## అత్యంత ప్రజాస్వామ్యయుతమైన రాజ్యాంగ యంత్రం

మనం స్థాపించిన రాజ్యాంగయంత్రం, యితర సోషలిస్టు దేశాలన్నిటిలోవలెనే, అత్యంత ప్రజాస్వామ్యయుతమైనది; అత్యంత నైపుణ్యంతో కూడుకొన్నట్టిది; అత్యంత సంఘటిత మైనట్టిది. చైనా ప్రజా రిపబ్లిక్ స్థాపనతో, అంతవరకు అనేక అవమానాలకు క్రౌర్యాలకు లోనవుతూన్న, దారిద్ర్యం—ఆకలి బాధతో కుములుతూన్న కోట్లాది ప్రజలు బానిస స్థితి నుంచి యజమానుల స్థితికి రాగలిగారు అందువల్ల వారి జీవితానికి, స్వేచ్ఛకు హామీ ఏర్పడింది; వారి శ్రమకు గౌరవ మర్యాద లేర్పడ్డాయి; స్త్రీలకు పురుషులతో సమాన హోదా కలిగింది. అనేకమంది ప్రముఖ కార్మికులు, రైతులు, స్త్రీలు, యువకులు రాజ్యపాలనలో ప్రత్యక్షంగా పాల్గొన్నారు. తత్ఫలితంగా ప్రభుత్వ సంస్థలు నిజాయితీతో, నిర్విరామంగా ప్రజలకు సేవ చేసేటట్లు చేయగలిగారు. మన దేశం యిదివరకెన్నడూ ప్రదర్శించనంత ఐక్యతను ప్రదర్శించింది. ప్రజాతంత్ర సంస్కరణలను

సమగ్రంగా అమలు జరపడంవల్ల, విప్లవ ప్రతీఘాతకులను విజయవంతంగా అణచివేయడంవల్ల, సోషలిస్టు పరిణామంలో మనం సాధించిన విజయాలవల్ల, సోషలిస్టు నిర్మాణం అభివృద్ధి చెందడంవల్ల, ప్రజాప్రభుత్వం గైకొన్న యితర చర్యలవల్ల — మన సామాజికవ్యవస్థలో అసమానమైన స్థిరత్వం ఏర్పడింది.

## నూతన ప్రజాతంత్ర నియంతృత్వం

ప్రపంచంలోని ప్రభుత్వాలన్నీ ప్రధానంగా వర్గ నియంతృత్వాలు. ఏ వర్గాలు ఏ యితర వర్గాలపై నియంతృత్వం చెలాయిస్తున్నాయన్నదే ప్రశ్న. భూస్వామ్య — పెట్టుబడిదారీ ప్రభుత్వాలు అధికసంఖ్యాకులపై అల్పసంఖ్యాకుల నియంతృత్వాలు; కొద్దిమంది దోపిడీదార్లు అధికసంఖ్యాకులైన కష్టజీవులపై పెత్తనం చెలాయించే సాధనాలు. రష్యా మహా విప్లవంసాధించిన గొప్పవిజయమేమంటే ప్రపంచచరిత్రలో మొట్టమొదటిసారి అది యీ పరిస్థితిని తలక్రిందులుచేసింది; రాజ్యాంగ యంత్రాన్ని అల్ప సంఖ్యాకులపై అధిక సంఖ్యాకులు పెత్తనం చెలాయించే సాధనంగా, కష్టజీవులు దోపిడీదార్లపై అధికారం చెలాయించే సాధనంగా మార్చివేసింది. మన దేశంలో విప్లవం అనేక ప్రత్యేక లక్షణాలను కలిగియున్నప్పటికీ, చైనా కమ్యూనిస్టులు అక్టోబరు మహావిప్లవంయొక్క విజయాలను ముందుకు తీసుకెళ్ళడానికే కృషి చేస్తున్నారు. మన దేశంలో ఏర్పడ్డ నూతన ప్రజాతంత్ర నియంతృత్వం అభివృద్ధి నిరోధక వర్గాలపైన, ముఠాలపైన సోషలిస్టు విప్లవాన్ని ప్రతిఘటించే దోపిడీదార్లపైన ప్రజాసామాన్యం చెలాయించే నియంతృత్వం. దీనికి కార్మికవర్గం

నాయకత్వం వహిస్తోంది మన ప్రజా స్వామ్యం అల్ప సంఖ్యా కుల ప్రజాస్వామ్యం కాదు; అత్యధిక సంఖ్యాకుల ప్రజా స్వామ్యం. అంటే కార్మికుల, రైతుల, తదితర కష్టజీవుల, దేశాన్ని ప్రేమించే ప్రజల సోషలిజాన్ని బలపరిచేవారల ప్రజా స్వామ్యమది.

బూర్జువా ప్రజాతంత్ర విప్లవ దశనుంచి సోషలిస్టు విప్లవదశకు

మన దేశంలో నూతన ప్రజాతంత్ర నియంతృత్వం బూర్జువా ప్రజాతంత్ర విప్లవదశను గడచి సోషలిస్టు విప్లవ దశలో పురోగమిస్తూంది. బూర్జువా ప్రజాతంత్ర విప్లవం దేశవ్యాపితంగా విజయం సాధించడానికి ముందు, ఇదివరకే విప్లవ స్థావరాల్లో నూతన ప్రజాతంత్ర నియంతృత్వం నెలకొల్ప బడింది. ఈ నియంతృత్వంయొక్క ఉద్దేశం బూర్జువా ప్రజా తంత్ర విప్లవంయొక్క కర్తవ్యాన్ని పూర్తి చేయడం. ఫ్యూడల్ భూస్వామ్య విధానంలో మార్పు తీసుకురావడంమాత్రమే అది చేసింది. జాతీయ పెట్టుబడిదారీవర్గం యొక్క అధీనంలో వున్న ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యాన్ని ఆ విప్లవం మార్పు చేయలేదు; భూమిపై రైతులకున్న వ్యక్తిగత యాజమాన్యాన్ని కూడా అది మార్చలేదు. ప్రజారిపబ్లిక్ స్థాపింపబడ్డ తర్వాతనే, నూతన ప్రజాతంత్ర నియంతృత్వం పెట్టుబడిదారీ విధానంనుంచి సోషలిజానికి పరివర్తన తెచ్చే కర్తవ్యాన్ని నిర్వర్తించడం ప్రారంభించింది. అంటే పెట్టుబడిదారుల, చిన్న ఉత్పత్తిదారుల యాజమాన్యం క్రింద వున్న ఉత్పత్తి సాధనాలను సోషలిస్టు యాజమాన్యం క్రిందికి, ప్రజల యాజమాన్యం క్రిందికి తీసుకు

రావాలన్నమాట. అట్టి రాజ్యాధికారం ప్రధానంగా శ్రామిక నియంతృత్వంగానే ఉంటుంది. శ్రామికవర్గం తన అగ్రగామి అయిన కమ్యూనిస్టు పార్టీ ద్వారా ఈ ఆయుధాన్ని నిరాటంకంగా ఉపయోగించగలిగినప్పుడే; తన చుట్టూ కష్టజీవులైన ప్రజలందరినీ, సోషలిజాన్ని అంగీకరించే శక్తులన్నిటినీ సన్నిహితంగా సమీకరించ గలిగినప్పుడే; వారి సహకారంతో సంయుక్తంగా శ్రామికవర్గ పంథాను అమలు జరపగలిగినప్పుడే; ఒక వైపు ప్రజల ఆర్థిక సాంస్కృతిక జీవితాన్ని సోషలిస్టు పంథాలో నిర్మిస్తూ, మరో వైపు అభివృద్ధి నిరోధక వర్గాల ముఠాల ప్రతిఘటనను అణచగలిగినప్పుడే; విదేశీ సామ్రాజ్య వాదులు దురాక్రమణ జరపకుండా దేశాన్ని కాపాడ గలిగినప్పుడే ...... ఈ గురుతరమైన, క్లిష్టమైన బాధ్యతను శ్రామికవర్గం నిర్వహించగలుగుతుంది.

శ్రామికవర్గ నాయకత్వంలేనిదే మన రైతాంగం, జాతీయ పెట్టుబడిదారీవర్గం బూర్జువా ప్రజాతంత్ర విప్లవదశలో సహితం విజయాన్ని సాధించగలిగేవారుకారు. అలాంటప్పుడు సోషలిస్టు విప్లవదశలో శ్రామికవర్గం తప్ప ఏ సామాజిక శక్తి నాయకత్వ బాధ్యతను స్వీకరించగలదు ? శ్రామికవర్గం ఖచ్చితమైన, దూర దృష్టితో కూడిన, న్యాయసమ్మతమైన నాయకత్వం వహించక పోతే, దారిద్ర్యమనుభవిస్తున్న రైతాంగం సహితం సోషలిజం వైపు పురోగమించడం అసంభవం. ఇక పెట్టుబడిదారీ వర్గం మాట చెప్ప నవసరమేలేదు ; దాని స్వభావమే సోషలిజానికి వ్యతిరేకం. కాని మన పెట్టుబడిదారీ వర్గం సోషలిస్టు పరిణా

మాన్ని శంఖారావాలతో, ఢంకా మ్రోతలతో ఆహ్వానించింది. ఇది నమ్మశక్యంకాని ఒక అద్భుత సంఘటన. ఇది దేన్ని తెలియజేస్తుంది? శ్రామికవర్గం సరియైన నాయకత్వం వహిస్తే ఎంత శక్తివంతమైన కార్యాలను సాధించవచ్చునో అది తెలియజేస్తుంది శ్రామిక నియంతృత్వం ఎంత అవసరమో అది నిరూపిస్తుంది

ఈ సందర్భంలో కొందరి లా ప్రశ్నించవచ్చు: ప్రస్తుత దశలో నూతన ప్రజాతంత్ర నియంతృత్వం ప్రధానంగా శ్రామిక నియంతృత్వమే గనుక యితర వర్గాలు, యితర పార్టీలు, ఏ పార్టీకిచెందని ప్రజాతంత్ర వ్యక్తులు రాజ్యాధికారం చెలాయించడంలో భాగస్వాములుగా ఉండడమెలా తటస్థించింది? మన దేశంలో యింకా నూతన ప్రజాతంత్రి ఐక్య సంఘటనయొక్క అవసర మేమిటి?

## ఐక్యసంఘటనయొక్క అవసరం

శ్రామిక నియంతృత్వం అమలు జరగాలంటే, ప్రభుత్వ యంత్రంలో ఆవర్గం సమర్థవంతమైన నాయకత్వం వహించడమే కాక, జన బాహుళ్యంకూడ ప్రత్యక్షంగా ప్రభుత్వ యంత్రంలో పాల్గొనేటట్లు చూడాలి ఈ రెండిటిలో దేన్ని మనం విస్మరించకూడదు. అందుచేత శ్రామికవర్గం సోషలిజాన్ని స్వీకరించడానికి సిద్ధంగా ఉన్న ప్రజాబాహుళ్యంతో చేతులు కలపడం ద్వారానే అభివృద్ధి నిరోధకవర్గాలపై అధిక సంఖ్యాకుల నియంతృత్వాన్ని అమలు జరప గల్గుతుంది; సోషలిజాన్ని సాధించ గల్గుతుంది. లెనిన్ ఈ సందర్భంలో యిలా తెలియజేశారు:

"కష్టజీవుల అగ్రగామియైన శ్రామికవర్గానికీ, కష్టజీవులలో శ్రామికవర్గానికి చెందిన యితర ప్రజలకూ (పెటీ బూర్జువావర్గం, చిన్న యజమానులు, రైతాంగం, మేధావులు మొదలైనవారు) లేదా వారిలో అధికసంఖ్యాకులకూ మధ్య సాధింపబడు ప్రత్యేకమైన వర్గ ఐక్యతే శ్రామిక నియంతృత్వం. ఆ ఐక్యతయొక్క లక్ష్యం సోషలిజాన్ని స్థాపించి సుసంఘటితమొనర్చడం."

లెనిన్ చెప్పిన వర్గ ఐక్యతయొక్క పరిమితులు వేర్వేరు చారిత్రిక పరిస్థితుల్లో వేర్వేరుగా ఉండవచ్చు; కాని శ్రామిక నియంతృత్వం ఎల్లప్పుడూ వివిధ వర్గాల ఐక్యతకు ఒక నిర్దిష్టరూప మనడంలో మాత్రం ఎట్టి సందేహంలేదు.

## కార్మిక - కర్షక ఐక్యత

మన దేశంలో నూతన ప్రజాతంత్రనియంతృత్వానికీ, నూతన ప్రజాతంత్ర ఐక్యసంఘటనకూ పునాది కార్మిక - కర్షక ఐక్యత. మన జనాభాలో ఆరింట అయిదు వంతులు రైతాంగం. రైతాంగంతో ఐక్యత సాధించనిదే, సోషలిజాన్ని నిర్మించడం అసంభవం దీర్ఘకాలవిప్లవపోరాటంలో మనపార్టీ రైతాంగంతో సజీవసంబంధా లుంచుకొంది ప్రజారిపబ్లిక్ స్థాపించబడ్డతర్వాత భూసంస్కరణల విషయంలోను పరస్పరసహాయక సంఘాల - సహకారసంఘాల ఉద్యమంలోను, వ్యవసాయోత్పత్తిలోను, గ్రామసీమల ఆర్థిక సాంస్కృతిక వ్యవహారాల్లోను, పన్నులు - ఆహారధాన్యం - ధరల విధానాలను అమలుజరపడంలోను యీ సంబంధాలను మరింత పటిష్ఠమొనర్చింది. అందుచేత

రైతాంగం మన దేశంయొక్క రాజకీయజీవితంలో ఒక ముఖ్యమైన స్థాన మలంకరించింది. దేశమంతటా గ్రామసీమల్లో నెలకొల్పబడ్డ అనేక పరిపాలనాసంస్థల సిబ్బంది అంతా యించుమించు రైతులే. అయితే మనం రైతుల నిర్దిష్టప్రయోజనాల యెడ తగినంత శ్రద్ధ చూపకపోవడం తరచు జరుగుతూనే ఉంది. మన కార్యకలాపాల్లో యిదొక లోపం. వ్యవసాయ సహకార సంఘాలు స్థాపించబడ్డ తర్వాత కార్మిక - కర్షక ఐక్యత మరింత ఉన్నతస్థాయి నందుకొంది కాని అదేసమయంలో, ప్రస్తుతం వ్యవసాయ సహకారసంఘాలకున్న ఆర్థికస్తోమతను ఎక్కువ అంచనా వేయడం, అనేక పార్టీ యూనిట్లూ పరిపాలనా సంస్థలూ సహకారోద్యమంవల్ల లభించిన 'సౌకర్యాన్ని' దుర్వినియోగ పరచడం జరుగుతోంది తత్ఫలితంగా గ్రామీణకార్యకలాపాల్లో తిరిగి పెత్తందారీ పోకడలు తలెత్తుతున్నాయి. కార్మిక - కర్షక ఐక్యతను పటిష్ఠమొనర్చాలంటే మనం యీ లోపాలను దృఢ నిశ్చయంతో తొలగించుకోవాలి.

రైతాంగంయెడల మన మనుసరిస్తున్న విధానమే చేతివృత్తుల వారిపట్ల, చిన్న దుకాణాదారులపట్ల, మూటల వర్తకం చేసేవారిపట్ల కష్టించి పనిచేసే యితర వ్యక్తులపట్లకూడా అనుసరించాలి. వీరంతా యిటీవల అనేక సహకార సంఘాల్లో సభ్యులుగాచేరారు. మన దేశంలో వీరుకూడా ఒక ముఖ్యమైన సాంఘిక శక్తిగా ఉన్నారు. వీరు చెల్లా చెదురుగా ఉన్న ప్రాంతాల్లో తమ ఆర్థిక కార్యకలాపాలను కొనసాగిస్తూండడం వల్ల మనం వారిమధ్య తగినంతగా పనిచేయలేకపోతున్నాం.

ఇప్పుడు వారు సంఘటితులయ్యారు; అనేక అత్యవసర సమస్యలను పరిష్కరించుకోవాలని వారు కుతూహల పడుతున్నారు. వారితో మన సంబంధాలను పటిష్ట మొనర్చడానికి శక్తివంతమైన చర్యలు తీసుకోవాలి అప్పుడే మనం వారి ఆర్థిక, రాజకీయ ప్రయోజనాల యెడ సరియైన శ్రద్ధతీసుకోగల్గుతాం.

## జాతీయ పెట్టుబడిదారీ వర్గం

నూతన ప్రజాతంత్ర నియంతృత్వంలోను, నూతన ప్రజాతంత్ర ఐక్యసంఘటనలోను జాతీయ పెట్టుబడిదారీ వర్గానికి ఒక ప్రత్యేకస్థానం ఉంది. జపాన్ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా యుద్ధం కొనసాగుతున్న రోజుల్లో జాతీయ పెట్టుబడిదారీ వర్గానికి ప్రాతినిధ్యం వహించే కొందరు వ్యక్తులు విప్లవ స్థావరాల్లో నెలకొల్పబడ్డ పరిపాలనా సంస్థల్లో సభ్యులుగా తీసుకోబడ్డారు. ఇది బూర్జువా ప్రజాతంత్ర విప్లవదశలో జరగడంవల్ల, సులభంగానే దీన్ని అర్థం చేసుకోగలం. కాని; ప్రజా రిపబ్లిక్ స్థాపింపబడ్డ తర్వాత జాతీయ పెట్టుబడి దారీ వర్గంయొక్క, పెట్టుబడిదారీ పార్టీలయొక్క ప్రతినిధులు ఇంకా యెక్కువగా శ్రామిక నియంతృత్వ పరిపాలనా సంస్థల్లో పాల్గొంటున్నారు. అంతేకాదు. సోషలిస్టు నిర్మాణంలో వారు కార్మికవర్గంతోను, కమ్యూనిస్టు పార్టీతోను రాజకీయ సమైక్యతను ప్రదర్శిస్తున్నారు. ఇదెలా సాధ్యమైంది? సోషలిస్టుపరిణామం ప్రధానంగా యిదివరకే సాధించబడ్డ పరిస్థితుల్లో అట్టి ఐక్యత యొక్క అర్థమేమిటి? అది మనకు బయువుచేటు కాదా?

మన జాతీయ పెట్టుబడిదారీ వర్గం (పెద్ద పెట్టుబడిదార్లు చిన్న పెట్టుబడిదార్లు, మధ్యరకం పెట్టుబడిదార్లు, పెట్టుబడిదారీ మేధావులు) నిరంకుశ పెట్టుబడిదారీవర్గం తర్వాత అన్నిటికంటె తక్కువ సంఖ్యాబలంగల వర్గంగా ఉండేదన్నమాట నిజమే. అంతేగాక, యీవర్గం ఆర్థికంగాను, రాజకీయంగాను చాల బలహీనమైనట్టిది. అయినా గతంలోను, యిప్పుడు కూడా ఈ వర్గం మన సమాజంలో ఒక ముఖ్యపాత్ర వహించింది. సమాజాలో దానికి చాల పలుకుబడి వుంది. కారణమేమంటే, చైనా దేశ చారిత్రక పరిణామంలో ఈవర్గం ఆధునిక పరిశ్రమలను నెలకొల్పింది, పాత ప్రజాతంత్ర విప్లవానికి నాయకత్వం వహించింది. కొత్త ప్రజాతంత్ర విప్లవంలో కొంతవరకు పాల్గొంది. ప్రజారిపబ్లిక్ స్థాపింపబడ్డతర్వాత యేర్పడ్డ ప్రత్యేక పరిస్థితుల్లో కార్మికవర్గంయొక్క, కమ్యూనిస్టు పార్టీ యొక్క నాయకత్వాన్ని అంగీకరించింది; క్రమక్రమంగా సోషలిస్టు పరిణామాన్ని ఆమోదించింది. అంతేగాక, ఈ వర్గం చాలకాలం క్రిందటే ఆధునిక విజ్ఞానాన్ని అలవరచుకొంది; కొంత సాంకేతిక పరిజ్ఞానం సంపాదించింది; ఆధునిక పరిశ్రమలను నిర్వహించడం నేర్చుకొంది. ఇప్పటికీ ఈ వర్గం ఆధునిక విజ్ఞానంలో యితర వర్గాలకంటె ముందుఉంది; అనేకమంది మేధావులు, సాంకేతిక నిపుణులు ఈ వర్గంలో ఉన్నారు. గత కొద్దిసంవత్సరాలలో జాతీయ పెట్టుబడిదారీవర్గం దేశ ఆర్థిక వ్యవస్థను పునరుద్ధరించే కార్యక్రమంలో పాల్గొన్నారు. భూసంస్కరణల అమలు, విప్లవప్రతిఘాతకులను అణచడం, అమెరికా దురాక్రమణకు ప్రతిఘటన, కొరియాకు సహాయం మొదలైన ఉద్యమాలలో వీరు స్వయంగా పాల్గొన

డమో లేక వాటిని బలపరచడమో చేశారు. ఈ విధంగా శత్రువును సాధ్యమైనంత ఎక్కువగా దూరంచేయడంలో వారు సహాయపడ్డారు; విప్లవంయొక్క శక్తిని వారు అధికంచేశారు. సోషలిస్టు పరిణామంలో కార్మికవర్గం జాతీయ పెట్టుబడిదారీ వర్గంతో చేతులు కలపడంవల్ల, పెట్టుబడిదార్లలో మానసిక పరివర్తన తీసుకు రావడానికీ, శిక్షణ గరపడానికీ అవకాశ మేర్పడింది. ఇక ముందుకూడ మనం యీ ఐక్యతను పెంపొందించడం ద్వారా వారికి శిక్షణగరపవచ్చు; వారిలో మానసిక పరివర్తన తీసుకురావచ్చు. అప్పుడు వారు తమ విజ్ఞానాన్ని సోషలిస్టు నిర్మాణానికి ఉపయోగిస్తారు. అందుచేత, జాతీయ పెట్టుబడిదారీ వర్గంతో ఐక్యత బరువుచేటు అనుకోడం పొరపాటు.

ఇటీవలి కాలంలో అనేకమంది జాతీయ పెట్టుబడిదార్లు సోషలిస్టు పరిణామంయొక్క సత్ఫలితాలను స్వయంగా అనుభవించారు. వారితో సహకారం యికముందుకూడా కొనసాగేటట్లు, పెంపొందేటట్లు చూడ్డం మన కర్తవ్యం. అలాచేస్తే వారి శక్తిసామర్థ్యాలు, సాంకేతిక పరిజ్ఞానం మరింత వికసిస్తాయి; వారిలో మానసిక పరివర్తన మరింత పెంపొందడానికి సహాయం చేసినవారమవుతాం. సహకారం అంటే అర్థం, యిదివరలో వలెనే ఏక కాలంలో ఐక్యతను సాధించటం, పోరాటం సల్పటం. సోషలిస్టు పరివర్తన పూర్తి అయ్యేవరకూ వర్గపోరాటం ఉంటుంది. ఆ తర్వాతకూడా చాలకాలంవరకు సోషలిస్టు దృక్పథాలకూ పెట్టుబడిదారీ దృక్పథాలకూ మధ్య, సోషలిస్టు పద్ధతులకూ

పెట్టుబడిదారీ పద్ధతులకూ మధ్య పోరాటం తప్పదు. అట్టి పోరాటాన్ని నడపడంలో మనం ప్రధానంగా ఒప్పించే పద్ధతిని, శిక్షణగరపే పద్ధతిని చేబట్టాలి. సోషలిజంపట్ల శత్రువైఖరి నవలంబిస్తూ ప్రభుత్వ చట్టాలను ఉల్లంఘించే కొద్దిమంది వ్యక్తులయెడ మాత్రమే, ఆ యా పరిస్థితులనుబట్టి నిర్బంధంగా సంస్కరించే పద్ధతిని అమలు జరపాలి.

## ప్రజాతంత్ర పార్టీల స్థానం

మన దేశంలో జపాన్ దురాక్రమణకు వ్యతిరేకంగా యుద్ధం జరుగుతూన్న రోజుల్లోనే ప్రధానంగా ప్రజాతంత్ర పార్టీలు స్థాపింపబడ్డాయి. వాటికీ మన పార్టీకీ మధ్య సహకారం చాలకాలం పరిఢవిల్లింది. చైనా ప్రజారిపబ్లిక్ అవతరించిన తర్వాత ఆ పార్టీలు ప్రజాప్రభుత్వంలో పాల్గొన్నాయి. తర్వాత క్రమంగా అవి సోషలిస్టు లక్ష్యాన్ని బలపరిచాయి. కమ్యూనిస్టు పార్టీ, యితర ప్రజాతంత్ర పార్టీలు చాలకాలం వరకు సహజీవనం నెరపుకొనే విధానం, అన్యోన్యంగా తనిఖీ చేసుకొనే విధానం ఇప్పటినుంచీ అమల్లోకి రావాలి. చైనాలో నేడు ప్రజాతంత్ర పార్టీలకుగల సాంఘిక పునాదులు జాతీయ పెట్టుబడిదారీ వర్గం, పెటీబూర్జువా వర్గంలో ఉన్నతశ్రేణి, యీ వర్గాలకుచెందిన మేధావులు. సోషలిస్టు పరిణామం పూర్తి అయిన తర్వాత, జాతీయ పెట్టుబడిదారీ వర్గానికి చెందినవారు, పెటీబూర్జువా వర్గంలో ఉన్నత శ్రేణికి చెందినవారు సోషలిస్టు కార్మికులలో ఒక భాగంగా అవుతారు; అప్పుడు ప్రజాతంత్ర పార్టీలు యీ తరగతికి చెందిన కార్మికులకు ప్రాతినిధ్యం వహిం-

స్తాయి. ఈ తరగతికి చెందినవారిలో బూర్జువా భావాల అవశేషాలు చాలకాలం వరకు ఉంటాయి. అందుచేత ప్రజాతంత్ర పార్టీలు వారితో చాలకాలంవరకు సంబంధాలుంచుకోవలసి వస్తుంది; వారి కోర్కెలకు ప్రాతినిధ్యం వహించవలసియుంటుంది; వారిలో మానసిక పరివర్తన తీసుకురావడానికి సహాయపడవలసియుంటుంది అదే సమయంలో, ప్రజాతంత్ర పార్టీలూ కమ్యూనిస్టు పార్టీ చాలకాలంవరకు సహజీవనం నెరపుకోవలసి వుంటుంది. కనుక ఈపార్టీలన్నీ అన్యోన్యంగా తనిఖీచేసుకోగల్గుతాయి మన పార్టీ స్వార్థప్రయోజనాలకై పనిచేసేదికాదు; అది తన యావచ్ఛక్తినీ హృదయపూర్వకంగా ప్రజాసేవకు వినియోగిస్తుంది. కాని మనలో యిప్పటికీ లోపాలున్నాయి; యికముందుకూడా లోపాలనేవి ఉంటాయి. ఎలాంటి తప్పులూ ఇక జరగవనే హామీా లేదు. అయితే మనం యీా లోపాలను, తప్పులను సరిదిద్దుకోవాలి. ఇందుకు మనం మొట్టమొదట పార్టీలో ఇంకా యెక్కువ తీవ్రమైనఆత్మవిమర్శలకు ప్రోత్సాహమివ్వాలి; కష్టజీవులైన ప్రజాసామాన్యం ఎప్పటికప్పుడు తనిఖీ చేసే పద్ధతిమీాద మనం ఆధారపడాలి. అదే సమయంలో, అన్ని ప్రజాతంత్రి పార్టీల సభ్యులు, ఏ పార్టీకి చెందని ప్రజాస్వామ్యవాదులు చేసే తనిఖీవల్ల, విమర్శలవల్ల లాభం పొందడంలో నేర్పరితనాన్నికూడ ప్రదర్శించాలి.

అనేక పరిపాలనా సంస్థలలో ప్రజాతంత్రపార్టీల ప్రతినిధులు, ఏ పార్టీకి చెందని ప్రజాతంత్రవాదులు ముఖ్యమైన పదవు లలంకరిస్తున్నారు. ప్రభుత్వ సంస్థలలోను, విద్యాల

యాల్లోను, పరిశ్రమల్లోను, సాయుధ దళాల్లోను పార్టీతో సంబంధంలేని వారనేకమంది ఉద్యోగాలు చేస్తున్నారు. ఇట్టి పరిస్థితుల్లో మనపార్టీ అలాంటివారందరితో సత్సంబంధాలుంచుకొని అన్యోన్య సహకారంతో పనిచేయాలి. ఈ విషయాన్ని ప్రస్తావించవలసిన అవసర మెందుకు వచ్చిందంటే, మన పార్టీలో కొందరు సభ్యులు సమస్తమైన వస్తువులూ "ఒకేరంగులో ఉండాల"ని భావిస్తున్నారు; కమ్యూనిస్టు పార్టీకి చెందనివారు పరిపాలనా సంస్థల్లో పని చేస్తూంటే చూడ్డం వారి కిష్టంలేదు; అవసరమైనప్పుడు వారితో సంప్రదించడం వారికి గిట్టదు; వారి అధికారాన్ని గౌరవించడమంటే యీసడించుకుంటారు. ఇదొ కరకమైన అతివాదపాటీక (స్టెక్టేరియన్) ధోరణి. కమ్యూనిస్టులు ఎల్లప్పుడూ ప్రజల్లో అల్పసంఖ్యాకులుగానే ఉంటారు. అందుచేత వారు అన్ని పరిస్థితుల్లోను కమ్యూనిస్టుపార్టీకి చెందని ప్రజలతో సహకరించడం తప్పనిసరి అవుతుంది; పైవిధమైన లోపాలను వారు తొలగించుకోవలసి యుంటుంది. నూతన ప్రజాతంత్ర ఐక్యసంఘటనను పటిష్ఠ మొనర్చడానికి మనం నిర్వర్తించవలసిన ప్రధాన కర్తవ్యాలలో యిదొకటి.

మన దేశంలో సోషలిస్టుపరిణామం విజయవంతంగా పురోగమిస్తూండడంవల్ల, నూతనప్రజాతంత్ర ఐక్యసంఘటనయొక్క స్వభావం అంతకంతకు విస్తృతమవుతుంది అల్పసంఖ్యాకజాతులలో ఉన్నతశ్రేణికి చెందిన వ్యక్తులతోను, మన సంస్థలకు చెందిన దేశభక్తులతోను, సమాజంలో ఏదో ఒకవిధంగా

పలుకుబడిగల యితర దేశాభిమానులతోను ఐక్యతను సాధించ డానికి ఎడతెగకుండా కృషిచేయాలి. విదేశాల్లో నివసిస్తున్న చైనా దేశభక్తులతో యిదివరకువలెనే యికముందుకూడా ఐక్యతను పెంపొందించుకోవాలి. వారుకూడా ఐక్యసంఘటనలో భాగమేనని మరచిపోకూడదు క్లుప్తంగా చెప్పాలంటే, సోషలిస్టు నిర్మాణానికి సహాయపడే వారందరినీ సమీకరించడం మన కర్తవ్యం.

అందుచేత, విశాలమైన ఐక్యసంఘటనవల్ల శ్రామిక నియంతృత్వం బలహీనపడదనీ, పైగా మరింత బలపడి అభివృద్ధి చెందుతుందనీ స్పష్టంగా మనం తెలుసుకోవచ్చు.

మన దేశంయొక్క రాజ్యాంగ వ్యవస్థలో అత్యున్నత మైన ప్రజాస్వామ్యమూ, అత్యున్నతమైన కేంద్రీకృత నాయ కత్వమూ కలిసివున్నాయి దీని ప్రాశస్త్యం గత కొద్ది సంవత్స రాల్లోనే మనకు స్పష్టంగా గోచరించింది. దీన్నిబట్టి మన రాజ్యాంగ యంత్రంయొక్క పని సర్వోత్కృష్టమైనదనిగాని, అందులో లోపాలు లేవనిగాని భావించకూడదు. అనేక పరి పాలనా సంస్థలు, వాటి నిర్వాహకులు తరచు మన రాజ్యాంగ వ్యవస్థయొక్క మూలసూత్రాలను ఉల్లంఘిస్తున్నారు మన రాజ్యాంగ వ్యవస్థను మరింత పటిష్ఠ మొనర్చడానికి బదులు దాని శక్తిని, బలాన్ని కుంటుపరుస్తున్నారు. మన రాజ్యాంగ వ్యవస్థ అన్ని విషయాల్లో ఆరితేరిందని కూడ చెప్పడానికి వీల్లేదు అది క్రమక్రమంగా పరిపక్వత సంపాదించుకోవాలి. ఇందుకు చాలకాలం పడుతుంది.

## ప్రధాన కర్తవ్యాలు

మన పరిపాలనా విధానాన్ని మెరుగు పరచేందుకు నిర్వర్తించవలసిన ప్రధాన కర్తవ్యాలేమిటి?

సోషలిస్టు పరిణామంలోను, సోషలిస్టు నిర్మాణంలోను యేర్పడ్డ నూతన పరిస్థితుల కనుగుణ్యంగా మనం ప్రజా స్వామ్యాన్ని మరింతగా విస్తృతపరచాలి; నిరంకుశత్వానికి వ్యతి రేకంగా పోరాడాలి

ఈ రోజున అనేక పరిపాలనా సంస్థలలో నిరంకుశత్వం కనబడుతోంది. ఇతరులు చెప్పేది అర్థం చేసుకోకుండా, క్రింది ఉద్యోగుల – ప్రజల అభిప్రాయాలను అణచివేస్తూ, ప్రజల పరిస్థితులెలా ఉన్నాయో తెలుసుకోడానికి శ్రద్ధచూపని పడక కుర్చీ నాయకత్వం పార్టీలో యింకా ఉంది. ప్రజలనుంచి, వాస్తవాన్నుంచి దూరమవడంలో యీ నిరంకుశత్వం కనిపి స్తుంది. జాతీయ జీవనంలో ప్రజాస్వామ్యం పెంపొందకుండా పెద్ద ఆటంకంగా యిది పరిణమిస్తుంది; ప్రజల చొరవను యిది కుంటుపరుస్తుంది; సోషలిస్టు పరిణామం పురోగమించకుండా అడ్డు తగులుతుంది. పరిపాలనా సంస్థల పనిని మెరుగుపరచడానికి, వాటి నిర్మాణాన్ని సులభతర మొనర్చడానికి, ప్రభుత్వ నిర్వా హకులందరి బాధ్యతలను స్పష్టంగా నిర్వచించడానికి, ప్రజలతో సంబంధ ముంచుకోకుండా పార్టీ విధానాన్నీ వాస్తవ పరిస్థితు లనూ తెలుసుకోకుండా సభలు జరపడంలోను డాక్యుమెంట్ల మీద సంతకాలు పెట్టడంలోను మాత్రమే నిమగ్నులై వుండే కార్య కర్తలకు సహాయం చేయడానికి – మనం త్రికరణ

శుద్ధిగా, క్రమ పద్ధతిలో ప్రయత్నించాలి. కేంద్ర ప్రభుత్వ శాఖల్లోను, రాష్ట్ర ప్రభుత్వాలలోను, మున్సిపాలిటీలలోను బాధ్యతాయుత పదవులను నిర్వహించే కార్యకర్తలు తరచు తమ క్రింది సంస్థల పనిని పరిశీలించేటట్లు, వాటి పరిస్థితులను తెలుసుకునేటట్లు, జరిగిన పనిని అజమాయిషీ చేసేటట్లు, యితరుల అభిప్రాయాలను తెలుసుకొనేటట్లు చూడ్డానికి మనం నిర్దిష్టమైన చర్యలు తీసుకోవాలి. పై పనులు ఖచ్చితంగా అమలు జరిగేటట్లు చూడాలి.

నిరంకుశత్వానికి వ్యతిరేకంగా మనం చాలకాలం పోరాడవలసి యుంటుంది. కాని, నూతన ప్రజాస్వామ్యంలో నిరంకుశత్వాన్ని క్రమక్రమంగా రూపుమాపగలమనే గట్టి విశ్వాసం మనకుంది. కారణమేమంటే, మన రాజ్యాంగయంత్రానికి అల్పసంఖ్యాకులు. అధికసంఖ్యాకుల్ని పీడించుకు తినే దోపిడీవర్గాల రాజ్యాంగయంత్రానికీ హస్తిమశకాంతరం ఉంది. మన రాజ్యాంగయంత్రం నిరంకుశత్వాన్ని కాపాడదు; పైగా దాన్ని వ్యతిరేకిస్తుంది నిరంకుశత్వానికి వ్యతిరేకంగా మనం గట్టి పోరాటం జరపాలంటే, రాజ్యాంగయంత్ర యొక్క కార్యకలాపాలను అనేకపద్ధతులద్వారా అజమాయిషీ చేసే విధానాన్ని పటిష్ఠమొనర్చాలి.

మొదటి విషయం: కమ్యూనిస్టుపార్టీ వివిధ పరిపాలనా సంస్థల నాయకత్వాన్ని పటుతరమొనర్చుతూ, వాటిపై అజమాయిషీ చేయాలి. అన్ని స్థాయిలలోను పార్టీ కమిటీలు ఎప్పటికప్పుడు వివిధస్థాయిల పరిపాలనా సంస్థలలో పార్టీ యూనిట్లు చేసే

పనిని తనిఖీ చేస్తూ ఉండాలి. అంతేకాక, పార్టీ కమిటీల క్రిందఉన్న వివిధశాఖలు ఆ యా ప్రభుత్వశాఖల్లో పనిచేసే పార్టీ యూనిట్లను, పార్టీ సభ్యుల్ని ఎప్పటికప్పుడు తనిఖీచేస్తూ ఉండడానికి బాధ్యత తీసుకోవాలి.

రెండవ విషయం: జాతీయప్రజాప్రతినిధి సభ (పార్లమెంటు), దానిస్థాయి సంఘం కేంద్రప్రభుత్వ శాఖలపై అజమాయిషీ చేసే పద్ధతిని మరింత పటిష్ఠమొనర్చాలి. ఇలాగే రాష్ట్ర, జిల్లా, స్థానిక ప్రజాప్రతినిధి సభలు ఆ యా ప్రభుత్వ శాఖలపై అజమాయిషీ చేయాలి. ఇందుకు ప్రజాప్రతినిధులు స్వయంతంగా తనిఖీచేసే పద్ధతిని మరింత గట్టిపరచాలి. అప్పుడు వారు విస్తృతంగా ప్రజాసామాన్యంయొక్క అభిప్రాయాలను సేకరించ గలుగుతారు. వివిధ స్థాయిలలో ఉన్న ప్రభుత్వాల పనిని పరిశీలించడానికి, చర్చించడానికి అన్ని స్థాయిలలో ప్రజాప్రతినిధి సభలు తీవ్రంగా కృషిచేయాలి.

మూడవ విషయం: అన్ని స్థాయిల పరిపాలనా సంస్థలలో ఉన్నత పదవు లలంకరించేవారు క్రిందివారి పనిని, క్రింది వారు ఉన్నత పదవు లలంకరించే వారి పనిని అజమాయిషీచేసే పద్ధతిని ఖచ్చితంగా అమలు జరపాలి ? రంకుశత్వాన్ని నిర్మూలించేందుకు జరపవలసిన పోరాటంలో రాజ్యాంగ యంత్రం యొక్క అజమాయిషీ సంస్థలుకూడ తమ విధులను పూర్తిగా నిర్వర్తించాలి.

నాల్గవ విషయం: పరిపాలనా సంస్థల పనిని ప్రజాసామాన్యం, క్రింది హోదాలలోఉన్న ప్రభుత్వ నిర్వాహకులు

తనిఖీచేసే పద్ధతిని పటిష్ఠమొనర్చాలి. క్రిందినుంచి వచ్చే విమర్శలను ప్రోత్సహించాలి; వాటిని బలపరచాలి. విమర్శించే వారిని అణచివేసే వ్యక్తులను, విమర్శకులపై ప్రతీకారంచేసే వ్యక్తులను ఉచితరీతిని శిక్షించాలి.

## అధికార వికేంద్రీకరణ

పరిపాలనా విధానంలో మరో ముఖ్యసమస్య ఏమంటే కేంద్ర పరిపాలనా సంస్థల — రాష్ట్రపరిపాలనా సంస్థల అధికారాలను, విధులను సక్రమంగా సమన్వయపరచవలసి యుంటుంది. ప్రజాస్వామ్య జీవితాన్ని విస్తృతపరచేందుకు, నిరంకుశత్వాన్ని రూపుమాపేందుకు యిది చాల అవసరం.

చైనా ప్రజారిపబ్లిక్ స్థాపింపబడంతో, దేశ ఐక్యతను పటిష్ఠమొనర్చడానికి మనం అధికార వికేంద్రీకరణను వ్యతిరేకించాం. కేంద్రప్రభుత్వం నిర్వహించవలసిన అనేక శాఖలను కేంద్రానికి స్వాధీనమొనర్చాం. ఆనాడు యిదిచాల అవసరం. కాని, గత కొద్ది సంవత్సరాల్లో కేంద్రాధికారంక్రింద ఉన్న కొన్ని శాఖలు మరీ ఎక్కువ పనులు తీసుకొంటున్నాయి; క్రింది ప్రభుత్వాలశాఖలపై మరీఎక్కువ నిబంధనలను, మరీ కఠినమైన నిబంధనలను విధిస్తూ వచ్చాయి. ఆ యా రాష్ట్రాల, ప్రాంతాల ప్రత్యేక పరిస్థితులను విస్మరించుతూ వచ్చాయి. కేంద్రం రాష్ట్రాధికారులతో సంప్రతించవలసిన అవసర మేర్పడినప్పటికీ, అవి అలా చేయలేదు కొన్ని శాఖలు అనవసరమైనవివరాలతో డాక్యుమెంట్లను, పత్రాలను మరీయెక్కువగా జారీచేశాయి. క్రింది ప్రభుత్వాలమీద మరీ యెక్కువభారం మోపుతూ

వచ్చాయి. తత్ఫలితంగా రాష్ట్ర ప్రభుత్వాల పని కష్టమవడమే కాకుండా, కేంద్రంయొక్క పని అస్తవ్యస్తంగా తయారైంది; అది నిరంకుశత్వానికి ప్రాధ్బలమిచ్చింది. చైనావంటి ఒక పెద్ద దేశంలో కేంద్ర ప్రభుత్వమే అన్ని పనులనూ చాకచక్యంగా నిర్వహించడం అసంభవమైన విషయం. కేంద్రం తన పరిపాలనాధికాగాలలో తన విధులలో కొన్నిటిని తప్పని సరిగాక్రింది ప్రభుత్వాల కివ్వవలసియుంటుంది. ప్రభుత్వ కార్యాకలాపాల్లో అధికభాగం - ఉదాహారణకు వ్యవసాయం, చిన్న మధ్య తరగతి పరిశ్రమలు, రాష్ట్ర రహదార్లు, రాష్ట్ర వ్యాపారం, ప్రాథమిక విద్య, సెకండరీ విద్య, ప్రజారోగ్యం, రాష్ట్ర ద్రవ్యం మొదలైనవాటిలో— కేంద్రం కొన్ని సాధారణ సూత్రాలను, విధానాలను మాత్రమే రూపొందించి, స్థూలమైన రూపంలో ప్రణాళికలనుతయారుచేస్తే చాలు. క్రింది ప్రభుత్వాలు స్థానిక పరిస్థితులను - అనగా వేర్వేరు ప్రాంతాల అవసరాలనూ కాలాన్నీ—దృష్టిలో ఉంచుకొని వాటిని అమలుజరుపుకోడానికి, కార్యభారమంతా అవే తీసుకోడానికి వీలు కలిగించాలి. కేంద్రపరిపాలనా సంస్థల్లో పనిచేసే కొందరిని క్రింద ప్రభుత్వాలకు పంపాల్సియుంటుంది. రాష్ట్రాలు, జిల్లాలు పంచాయితీలు ఉచితరీతిని కొన్ని అధికారాలను కలిగియుండేటట్లు; కొన్ని విధులను నిర్వర్తించేటట్లు చూడాలి. ఈ సూత్రాన్ని ప్రాతిపదికగాతీసుకొని నేడు: కేంద్ర ప్రభుత్వం క్రింది ప్రభుత్వాలతోను, తదితర స్థానికపరిపాలనా సంస్థలతోను కలిసి యీ సమస్యను పరిశీలిస్తోంది. ఇందు కొక నిర్దిష్టమైన ప్రణాళికను తయారుచేసి దాన్ని క్రమ క్రమంగా అమలు జరపడానికి ప్రయత్నిస్తోంది. ఈవిధంగా కేంద్ర, రాష్ట్ర

తదితర పరిపాలనా సంస్థలు పూర్తి చొరవతో పనిచేయడానికి అవకాశమేర్పడుతుంది; అప్పుడవి పట్టువిడుపులతో పనిచేయ గలుగుతాయి. అదే సమయంలో అన్యోన్యంగా తనిఖీలు జరుపు తాయి. అన్నిరంగాలలోను సోషలిస్టు నిర్మాణాన్ని పురోగమించ డానికి ఈపద్ధతి ఎంతో ముఖ్యం.

## అల్పసంఖ్యాక జాతుల సమస్యలు

రాజ్యపాలనలో నిర్వర్తించవలసిన ఒక ముఖ్యకర్తవ్యం, అల్పసంఖ్యాక జాతుల సమస్యలను సక్రమంగా పరిష్కరించడం. అల్పసంఖ్యాక జాతులు సోషలిస్టు నిర్మాణంలో పూర్తిగా పాల్గొనేటట్లు చేయాలంటే, వారి ఆర్థిక సాంస్కృతిక వికాసానికి మనం ఇంకా ఎక్కువగా తోడ్పడాలి.

గత కొద్ది సంవత్సరాల్లో అల్పసంఖ్యాక జాతుల పరిస్థితి ఎంతో మార్పు చెందింది. అల్పసంఖ్యాక జాతులు నివసించే అత్యధిక ప్రాంతాల్లో ప్రజాస్వామ్య సంస్కరణలను అమలు జరపడంలోను, సోషలిస్టు మార్పులను ప్రవేశపెట్టడంలోను నిర్ణయాత్మకమైన విజయం సాధింపబడింది. చైనాలో నేడు అల్ప సంఖ్యాక జాతులకు చెందిన ప్రజలు 3½ కోట్లు ఉన్నారు. వీరిలో 2 కోట్ల 80 లక్షలమంది సోషలిస్టు పరిణామం సమాప్త మైన ప్రాంతాల్లో నివసిస్తున్నారు; 22 లక్షలు సోషలిస్టు పరి ణామం అమలుజరుగుతున్న ప్రాంతాల్లోను, దాదాపు 20 లక్షలు ప్రజాస్వామ్య సంస్కరణలు అమలుజరుగుతున్న ప్రాం తాల్లోను నివసిస్తున్నారు. అంటే, దాదాపు 60 లక్షలు మాత్రమే ప్రజాస్వామ్య సంస్కరణలు అమలుజరగని ప్రాంతా

ల్లో నివసిస్తున్నారన్నమాట. ఈ ప్రాంతాల్లో ప్రజాస్వామ్య సంస్కరణలను, సోషలిస్టు పరిణామాన్ని అమలుజరపడానికి మన మింతవరకు అనుసరిస్తున్న వివేకవంతమైన విధానాన్నే యిక ముందుకూడా అనుసరించవల సి యుంటుంది. అంటే, ఏ విష యాన్నీ తొందరపడి నిర్ణయించకుండా, ఆ యా జాతుల ప్రజల్నీ నాయకుల్నీ సంప్రతించిన తర్వాత, వారి కోర్కెల కనుగుణ్యంగా అంగీకారానికి రావాలి. సంస్కరణలను ప్రవేశపెట్టేటప్పుడు శాంతియుత పద్ధతులను మాత్రమే అవలంబించాలి; హింసా త్మక చర్యలకు పూనుకోరాదు. అల్పసంఖ్యాక జాతుల్లో ఉన్నత శ్రేణికి చెందిన వారి విషయమేమంటే, వారు కష్ట జీవుల్ని పీడించడం మానివేసిన తర్వాత వారికి రాజకీయ వ్యవ హారాల్లోగాని, జీవిత స్థాయిలోగాని ఎట్టి బాధ కలుగకుండా ప్రభుత్వం తగు చర్యలు తీసుకొంటుంది; చాలకాలంవరకు వారితో సహకరించవలసిన అవసరాన్ని వారిచేత గుర్తింప జేస్తుంది. అల్పసంఖ్యాక జాతులు నివసించే ప్రాంతాల్లో వారికి పూర్తియైన మత స్వాతంత్ర్య మివ్వాలన్న విధానానికి మనం ఎల్లవేళలా కట్టుబడియుండాలి. సంఘ సంస్కరణలను ప్రవేశ పెట్టేటప్పుడు మనం వారి మతాచారాల్లో జోక్యం కలిగించుకో కూడదు. మతాన్నే వృత్తిగా పెట్టుకొన్నవారు ఆర్థిక యిబ్బం దులకు లోనవుతూంటే, వారి సమస్యలకు పరిష్కార మార్గం చూపుతూ సహాయం చేయాలి.

అల్ప సంఖ్యాకజాతులు ఆధునిక జాతులుగా అభివృద్ధి చెందాలంటే, అత్యంత ప్రధానమైన విషయం సంఘసంస్కరణ

లను ప్రవేశపెట్టడమేకాక, వారు నివసించే ప్రాంతాల్లో ఆధునికపరిశ్రమలను కూడా నెలకొల్పాలి. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో చైనా ప్రభుత్వం అల్పసంఖ్యాక జాతులు నివసించే కొన్ని ప్రాంతాల్లో అనేక కొత్త పారిశ్రామికస్థావరాలను నెలకొల్పింది. ఎన్నో ఆధునిక పరిశ్రమలను, రవాణా సర్వీసులను స్థాపించింది. ఈ విధానం రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో కూడా అనుసరింపబడుతుంది. చైనాలో నివసించే అన్నిజాతుల ప్రయోజనాలను కాపాడే విధానం యిదే. ఈ ప్రణాళికను పూర్తిగా అమలు జరపడానికి హాన్‌జాతి ప్రజలూ (చైనాలో అధిక సంఖ్యాక ప్రజలు యీ జాతికి చెందినవారే-అను) అల్పసంఖ్యాక జాతులూ కలిసి కట్టుగా పనిచేయవలసి యుంది. అదే సమయంలో, అల్పసంఖ్యాకజాతుల ప్రత్యేకావసరాలను తీర్చడానికి కేంద్రమంత్రిత్వశాఖలు, రాష్ట్రప్రభుత్వాలు, స్వయంపాలిత ప్రాంతాల అధికారులు అల్పసంఖ్యాక జాతుల ప్రాంతాల్లోని భౌతిక అవకాశాలను, ఆర్థిక స్తోమతను దృష్టిలో ఉంచుకొని, క్రమక్రమంగా స్థానిక పరిశ్రమలను నెలకొల్పాలి. ఈ ప్రాంతాల్లో స్థాపింపబడ్డ పరిశ్రమలన్నిటిలోను-అవి కేంద్రప్రభుత్వ యాజమాన్యంక్రింద ఉన్నా, స్థానిక స్వపరిపాలనా సంస్థల నిర్వహణక్రింద ఉన్నా ---- అల్పసంఖ్యాక జాతుల కార్మికుల్నే తీసుకోవాలి; శాస్త్ర పరిశోధకుల్నీ, సాంకేతికనిపుణుల్నీ, నిర్వహణాధికారుల్నీ అల్పసంఖ్యాక జాతుల నుంచి తీసుకోవాలి. అలా తీసుకున్నప్పుడే, ఆజాతులు అన్ని రంగాల్లోను వేగంగా ఆధునిక స్థాయిలో అభివృద్ధిచెందగలుగుతాయి.

కొన్ని చారిత్రక పరిస్థితులవల్ల, అల్పసంఖ్యాక జాతులు నివసించే ప్రాంతాల్లో సంఘ సంస్కరణలు, ఆర్థిక సాంస్కృతిక పథకాలు అమలు జరగాలంటే, హాన్ జాతి ప్రజలు అల్పసంఖ్యాక జాతులను పెద్దయెత్తున సహాయంచేయవలసిఉంటుంది. కనుకనే, హాన్ జాతి కార్యకర్తలకూ అల్పసంఖ్యాక జాతుల కార్యకర్తలకూ మధ్య సత్సంబంధాలను అభివృద్ధి చేయవలసిన సమస్య ప్రత్యేక ప్రాధాన్యతను కలిగియుంది.

## కొన్ని లోపాలు

గత కొద్ది సంవత్సరాల్లో హాన్ జాతికి చెందిన కార్యకర్తలనేకమంది అల్పసంఖ్యాక జాతుల ప్రాంతాల్లో పనిచేస్తూ వచ్చారు. వారిలో అధికసంఖ్యాకులు అల్పసంఖ్యాక జాతుల విషయంలో పార్టీ విధానాన్ని సరిగానే అమలు జరుపుతూ వచ్చారు; పార్టీ విధులను వారు సక్రమంగానే నిర్వర్తించారు; అల్ప సంఖ్యాకుల మన్ననలను వారు పొందగలిగారు. కాని హాన్ కార్యకర్తల్లో కొందరు అల్పసంఖ్యాక జాతులకు చెందిన కార్యకర్తల అధికార హోదాను, వారి అభిప్రాయాలను గౌరవించని సందర్భాలున్నాయి. అల్పసంఖ్యాక జాతులే స్వయంగా తమ వ్యవహారాలను తాము నడుపుకునేటట్లు ప్రోత్సహించడానికి బదులు, తామే అన్నిపనులూచేస్తూ వచ్చారు. ఈ లోపాలకు, పొరబాట్లకు కారణమేమంటే, అన్ని జాతులకంటె హాన్ జాతి గొప్పదనే ధోరణి, అల్ప సంఖ్యాక జాతుల్ని చిన్న చూపు చూచేధోరణి కొందరిలో ఉంది.

చైనా దేశ చరిత్రను, సంస్కృతిని నిర్మించడంలో అన్ని జాతుల ప్రజలు కలిసి మెలాపనిచేశారో, అలాగే యికముందు కూడా వారు సోషలిస్టు మాతృభూమిని నిర్మించడంలో కలిసి పని చేస్తారు, ఇందులో ఎట్టిసందేహంలేదు. చైనాలో అల్పసంఖ్యాక జాతుల అభివృద్ధి విభిన్న స్థాయిలలో ఉన్నమాట నిజమే. కాని, వారు అన్ని విషయాల్లోనూ వెనుకబడి యున్నారనడం వాస్తవంకాదు. కొన్ని జాతులు హాన్ జాతితో సమానమైన, లేదా యించు మించు సమానమైన స్థాయి నందుకున్నాయి. మరికొన్ని జాతులు కొన్ని విషయాల్లో అంతకన్న యెక్కువ స్థాయినికూడా అందుకున్నాయి. వాటినుంచి హాన్‌జాతి ప్రజలు నేర్చుకోవడ మెంతైనా అవసరం. ఒక్కొక్కజాతికి ఒక్కొక్క గొప్ప లక్షణం ఉంది. అల్పసంఖ్యాక జాతుల ప్రజలు పనికిరాని వారనీ, అన్ని విషయాలలోనూ హాన్ జాతికన్న తక్కువ వారనీ భావించడం జాతీయ దురహంకారాన్ని తెలియజేస్తుంది.

సోషలిస్టు నిర్మాణంలో అల్ప సంఖ్యాక జాతులు నిర్వహించిన ప్రముఖ పాత్రను విస్మరించడంకూడా జాతీయ దురహంకారం క్రిందికే వస్తుంది. మనదేశంయొక్క మొత్తం జనాభాలో అల్పసంఖ్యాక జాతులు 100 కి 6 మంది మాత్రమే ఉన్నప్పటికీ, వారు నివసించే ప్రాంతాలు మొత్తం వైశాల్యంలో దాదాపు 100 కి 60 వరకున్నాయి. వీటిలో అనేక ప్రాంతాలు రకరకాలైన పారిశ్రామిక ముడిసరుకులతో నిండివున్నాయి; అందుచేత అల్ప సంఖ్యాక జాతుల ప్రత్యక్ష సహకారం, తీవ్ర కృషి లేకుండా, హాన్‌జాతి ప్రజలుమాత్రమే చైనాదేశాన్ని సోషలిస్టు దేశంగా మార్చగలరనుకోవడం పొరబాటు.

పైన పేర్కొన్న జాతీయ దురహంకార పోకడలను ఖచ్చితంగా దిద్దుకోవలసియుంది. మన కార్యకర్తల్లో ఏ మాత్రపు జాతీయ దురహంకారం ప్రదర్శితమైనా, దాన్ని తొలగించడంద్వారానే అల్పసంఖ్యాక జాతుల్లోని స్థానిక తత్వాన్ని జయప్రదంగా నిర్మూలించగల్గుతాం; నూతన ప్రజా స్వామ్యమనే సమిష్టి కుటుంబంలో అన్నదమ్ములవంటి వివిధ జాతుల ప్రజల్ని అప్పుడుగాని సమైక్య పరచలేం.

## న్యా య శా స్త్ర క్రో డీ క ర ణ

మన నూతన ప్రజాతంత్ర నియంతృత్వాన్ని పటిష్ఠ మొనర్చాలన్నా, సోషలిస్టు నిర్మాణాని కవసరమైన భద్రతను నెలకొల్పాలన్నా, ప్రజాతంత్ర హక్కులను కాపాడాలన్నా, విప్లవ ప్రతీఘాతకుల్ని తదితర నేరస్తుల్ని శిక్షించాలన్నా — మన ప్రభుత్వాం నిర్వర్తించవలసిన తక్షణ కర్తవ్యాలలో ఒకటి న్యాయశాస్త్రాన్ని సాధ్యమైనంత సమగ్రంగా క్రోడీకరించి, సక్రమ పద్ధతులపై దాన్ని వ్యవస్థీకరించడం.

విప్లవసమరం కొనసాగుతున్నప్పుడూ, స్వాతంత్ర్యం సాధింపబడ్డ కొత్త రోజుల్లోను మనం శత్రుఅవశేషాలను నిర్మూలించడానికీ, విప్లవ ప్రతీ ఘాతకుల ప్రతిఘటనను అణచడానికీ, అభివృద్ధినిరోధక వ్యవస్థను తుత్తునియలుచేసి విప్లవ వ్యవస్థను నిర్మించడానికీ కొన్ని తాత్కాలిక చట్టాలను తయారుచేశాం; అవి పార్టీ విధానానికీ ప్రజాప్రభుత్వ మనుసరించే విధానానికీ అనుగుణ్యంగా, సాధారణ సూత్రాల రూపంలో ఉండేవి. ఆనాటి పరిస్థితుల్లో ఆచరణయోగ్యమైన పద్ధతి అదే. ఆదశలో

మన పోరాటంయొక్క ప్రధానాశయం ప్రజల్ని అభివృద్ధి నిరోధక కుల పెత్తనం నుంచి విముక్తి చేయడం, పాత ఉత్పత్తి సంబంధాల పిడికిటినుంచి సామాజిక ఉత్పత్తి శక్తుల్ని కాపాడ్డం. అనాడు మన ప్రధానమైన పోరాట పద్ధతి ప్రజల్ని కార్యరంగంలోకి తీసుకురావడం అలాంటి పరిస్థితుల్లో, సాధారణ సూత్రాల రూపంలోఉన్న చట్టాలే అవసరమయాయి. కాని యిప్పుడా పరిస్థితులులేవు. విప్లవ వెల్లువ ఉధృతరూపం ధరించిన దశ గడిచి పోయింది. కొత్త ఉత్పత్తి సంబంధాలిప్పుడు నెలకొల్పబడ్డాయి. నేడు మన పోరాటంయొక్క ప్రధానలక్ష్యం ఉత్పత్తి శక్తులను పెంచి పోషించడం, తదనుగుణ్యంగా మన పోరాట పద్ధతికూడా మార్పు చెందాలి. సమగ్రమైన న్యాయశాస్త్రం నేడు మనకు చాల అవసరం. ప్రజలు మామూలు సాంఘిక జీవితం గడపాలంటేను, సామాజికోత్పత్తిని పెంపొందించాలంటేను, ప్రతి వ్యక్తీ తాను ప్రభుత్వ చట్టాలను పాటిస్తూన్నంతకాలం ఏ సంస్థా ఏ వ్యక్తీ వాటిని అపహరించరని విశ్వసించేటట్లు చేయాలంటేను — అట్టి న్యాయశాస్త్రమొకటి అవసరం. అందుచేత పరిపాలనా సంస్థలన్నీ చట్టాలను ఖచ్చితంగా అమలుజరపాలి. మన సెక్యూరిటీ శాఖలు, ప్రాక్యురేటర్ల కార్యాలయాలు, న్యాయస్థానాలు న్యాయశాస్త్ర నిర్వహణలో కార్యవిభజన పద్ధతిని ఖచ్చితంగాను, త్రికరణశుద్ధిగాను పాటించాలి; పరస్పరం తనిఖీచేసుకొనే పద్ధతినికూడా అమలుజరపాలి.

విప్లవ ప్రతీఘాతకులు మన రాజ్యాంగ యంత్రాన్నీ, సోషలిస్టు నిర్మాణాన్నీ భగ్నమొనర్చాలని చూస్తున్నారు.

ప్రజల భద్రతకు వారు ప్రమాదం తెచ్చిపెట్ట దలచుకున్నారు. అందుచేత మన పరిపాలనా సంస్థలు విప్లవ ప్రతీఘాతకుల్ని అణచివేసి రూపుమాపవలసియుంది. ఇందుకు మనం 1950 లో ఒక దేశ వ్యాపితమైన ఉద్యమాన్ని నడిపాం. వారి కార్య కలాపాలను అణచివేశాం. 1955 లో అలాంటిదే మరొక ఉద్యమం నడిపి, దేశమంతటా వివిధపరిపాలనా సంస్థలలో దాగియున్న విప్లవ ప్రతీఘాతకుల్ని ఏరివేశాం. పెద్దయెత్తున జరిగిన యీ ఉద్యమాల ఫలితంగా జాతీయ భద్రత చాలవరకు పటిష్ఠమయింది.

విప్లవ ప్రతీఘాతకుల, తదితర నేరస్థుల విషయంలో మనం చాలకాలంగా శిక్షలు విధించే పద్ధతినీ ఉదారవైఖరినీ జోడించే విధాన మవలంబిస్తూన్నాం. చిత్తశుద్ధితో తమ నేరాలను అంగీకరించిన వారిని, పశ్చాత్తాపపడ్డవారిని, ఏదో ఒక మంచిపని చేసినవారిని ఉదారంగా చూస్తున్నాం. ఈ విధానం చాల మంచి ఫలితాల నిచ్చింది. గత సంవత్సరం ఉత్తరార్ధ భాగంనుంచి విప్లవ ప్రతీఘాతకులు అంతకంతకు ఎక్కువ చిక్కుల్లో పడ్డారంటే అందుకు కారణం పైవిధంగా శిక్షలు విధించే పద్ధతినీ ఉదార వైఖరినీ జోడించి పనిచేయడం; సోషలిస్టునిర్మాణం ఉవ్వెత్తుగా సాగిపోతూండడం; ప్రజల్లో రాజకీయ చైతన్యం, నిర్మాణబలం పెరగడం. విప్లవ ప్రతీఘాతకుల్లో యీ రోజున ఒక పెద్దచీలిక ఏర్పడింది. జట్లు జట్లుగా అనేకమంది ద్రోహులు ప్రభుత్వానికి లొంగిపోయారు. దీన్నిబట్టి మనకు బోధపడేదేమంటే, ఒక వైపున విప్లవప్రతీఘా

తకులు దేశంలో విచ్చలవిడిగా తిరుగుతున్నారు. వారిపట్ల ఉపేక్ష వహించడం పొరబాటు. రెండోవైపున మనం సరియైన విధాన మనుసరిస్తూన్నంతకాలం వారిని పూర్తిగా తుడిచిపెట్ట వచ్చు. అందుచేత, మన దేశంలో విప్లవ ప్రతీఘాతకుల చర్యలు నానాటికీ ప్రమాదకరంగా పరిణమిస్తున్నా యనుకోడానికి అధారంలేదు.

మన పబ్లిక్ సెక్యూరిటీసంస్థలు, ప్రొక్యూరేటర్ల కార్యాలయాలు, న్యాయస్థానాలు యికముందుకూడా విప్లవప్రతీఘాతకుల్పై తీవ్రమైన పోరాటం జరపాలి. కాని, పైన చెప్పినట్లు చట్టాలకు కట్టుబడియుంటూ ఈ పోరాటం జరపాలి; దేశంలో నేడున్న పరిస్థితుల కనుగుణ్యంగా ఉదారవైఖరి నవలంబించే విధానాన్ని యికముందుకూడా అనుసరించడానికి తగు చర్యలు తీసుకోవాలి. కొద్దిమంది నేరస్తుల ఘాతుకచర్యలు ప్రజల్లో తీవ్రమైన ఆగ్రహం కలిగించినప్పుడుమాత్రమే మరణశిక్ష విధింపబడాలనీ, యితర నేరస్తుల కా శిక్ష విధింపబడకూడదనీ కేంద్రకమిటీ అభిప్రాయపడుతోంది. జైలుశిక్ష విధింపబడ్డ నేరస్తులయెడ ఉదారవైఖరి నవలంబించాలి. మరణశిక్ష విధింపబడ్డ కేసులన్నీ సుప్రీంకోర్టు ఆమోదం పొందాలి. ఈవిధంగా మరణశిక్షను పూర్తిగా రద్దుచేయాలనే లక్ష్యాన్ని మనం క్రమక్రమంగా సాధించగల్గుతాం. ఇది మన సోషలిస్టునిర్మాణాని కెంతైనా సహాయపడుతుంది.

అంతేకాక, మన దేశాన్ని రక్షించుకోవాలంటే, దేశ రక్షణను ఎడతెగకుండా పటిష్ఠమొనర్చాలి. మనజాతియ.

రక్షణసైన్యాన్ని — ఇదే జగత్ప్రఖ్యాతిగాంచిన చైనా ప్రజా విముక్తి సైన్యం బలపరచుకోవాలి.—మన సాయుధదళాలు తమ పోరాటపటిమను ఇంకా ఉన్నతస్థాయిలో పెంపొందించుకోవాలి. మనసరిహద్దులను, సముద్రతీరాన్ని అతి జాగరూకతతో రక్షించాలి; మన ప్రాదేశిక భద్రతను కాపాడాలి.

మన మాతృదేశంలో భాగమైన తైవాన్ యిప్పటికీ అమెరికన్‌సామ్రాజ్యవాదుల ఆక్రమణక్రిందనే ఉంది. ఇది మన దేశభద్రతకు గొప్పప్రమాదం తెచ్చిపెడుతుంది. తైవాన్ విముక్తి పూర్తిగా మన ఆంతరంగిక సమస్య. ఆ దీవిని తిరిగి మన దేశమాత కౌగిటజేర్చే విషయంలో సంప్రతింపులు జరపడానికి, బలప్రయోగం చేయకుండా ఉండడానికి మనం సంసిద్ధులం. ఒక వేళ బలప్రయోగం అవసరమైతే, శాంతియుతసంప్రతింపుల ద్వారా యీ సమస్యను పరిష్కరించడానికి గల అన్ని అవకాశాలను వినియోగించుకున్న తర్వాతనే, లేక అట్టి సంప్రతింపులు విఫలమైన తర్వాతనే అందుకు పూనుకోవలసియుంటుంది. ఏమార్గ మవలంబించినప్పటికీ, తైవాన్‌ని విముక్తి చేసే పవిత్ర కర్తవ్యాన్ని మనం నెరవేర్చితీరుతాం; అంతిమవిజయం మనకు లభించితీరుతుంది.

## 5. అంతర్జాతీయ సంబంధాలు

చైనా దేశాన్నొక గొప్ప సోషలిస్టు రాజ్యంగా నిర్మించాలంటే, కేవలం మన దేశంలో ఏ యే శక్తులతో చేతులు కలుపవచ్చునో వటితో ఐక్యతను సాధించడ మొక్కటే

చాలదు. అంతర్జాతీయ పరిస్థితులుకూడా మన కనుకూలించేట్లు చూచుకోవాలి. ఏ యే ప్రపంచ శక్తులతో చేతులు కలపవచ్చునో అట్టి వాటన్నిటితోను మనం ఐక్యతను సాధించాలి.

నేడు మనం ఎట్టి అంతర్జాతీయ పరిస్థితుల్లో ఉన్నాం?

మొత్తంమీద చెప్పాలంటే, ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితి మన దేశంలో సోషలిస్టునిర్మాణాని కనుకూలంగా ఉంది. కారణమేమంటే, రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత సోషలిస్టు శక్తులు, జాతీయ విమోచనశక్తులు, ప్రజాతంత్ర శక్తులు, శాంతి శక్తులు అత్యున్నతస్థాయిలో అభివృద్ధిచెందాయి; సామ్రాజ్యవాదుల దురాక్రమణ కూటమి తన ప్రాబల్యాన్ని విస్తరించుకొనేందుకు, శాంతియుత సహజీవనాన్ని ప్రతిఘటించేందుకు, మరొక ప్రపంచ యుద్ధానికి సన్నద్ధమయేందుకు అనుసరిస్తున్న విధానం అంతకంతకు అప్రతిష్ఠపాలవుతోంది. ఇట్టి పరిస్థితుల్లో నేటి అంతర్జాతీయ పరిస్థితి ఉద్రిక్తతనుసడలించడానికి సహజంగా దోహదమిస్తూంది; ప్రపంచంలో సుస్థిర శాంతికి అవకాశాలిప్పుడు ప్రారంభమయాయి.

అక్టోబరు విప్లవం తర్వాత, సోవియట్ ప్రజలు సోషలిస్టు సమాజ నిర్మాణానికి పూనుకున్నప్పుడు ప్రపంచంలో మరొక సోషలిస్టు దేశమేదీ లేదు. కాని యీ రోజున మనం యిందుకు పూర్తిగా భిన్నమైన పరిస్థితుల్లో సోషలిస్టు నిర్మాణం అమలు జరుపుకొంటున్నాం. రెండవ ప్రపంచయుద్ధం తర్వాత సోవియట్ యూనియన్ యిదివరకు కన్న యెక్కువగా బలపడమే కాక, యూరపు—ఆసియా ఖండాల్లో కొత్తగా అనేక సోషలిస్టు

దేశాలు అవతరించాయి. ఈరోజున చైనాతో సహా అన్ని సోషలిస్టు దేశాల్లోను 90 కోట్ల మంది ప్రజలు నివసిస్తున్నారు. ఈ సంఖ్య ప్రపంచ జనాభాలో మూడవ వంతు. భౌగోళికంగా చూస్తే ఈ దేశాలన్నీ ఒక బ్రహ్మాండమైన భూభాగంగా ఒక దానితో ఒకటి సంబంధం కలిగియున్నాయి. సోవియట్ యూనియన్ నాయకత్వంక్రింద అన్నదమ్ముల కుటుంబం మాదిరిగా యీ సోషలిస్టు మహాదేశాలు విలసిల్లుతున్నాయి. మనమధ్యఉన్న సోదర ప్రేమ, అన్యోన్య సహకారం నిరంతరం వృద్ధిచెందుతున్నాయి. సోవియట్ యూనియన్ తదితర సోషలిస్టు దేశాలు యుగోస్లావియా ఫెడరల్ పీపుల్స్ రిపబ్లిక్‌తో తిరిగి స్నేహ సంబంధా లుంచుకున్నాయి. మనదేశంకూడా యుగోస్లావియాతో దౌత్య సంబంధాలను పెంపొందించుకొంటూంది. స్నేహ సంబంధాలను వృద్ధిచేసుకొంటూంది.

## సోషలిస్టు దేశాల శక్తి

ప్రస్తుతం సోషలిస్టు దేశాలు తమ ప్రజల శక్తి నంతటినీ శాంతియుత సోషలిస్టు నిర్మాణంలో ఉపయోగిస్తున్నాయి. వాటి పారిశ్రామికోత్పత్తి, వ్యవసాయోత్పత్తి అతివేగంగా అభివృద్ధిచెందుతూంది; పెట్టుబడిదారీ దేశాల ఉత్పత్తి యింత వేగంగా పెరగడం సాధ్యమేకాదు. విదేశాంగ వ్యవహారాల్లో మనం త్రికరణశుద్ధిగా ఖచ్చితమైన శాంతి విధానమవలంబిస్తున్నాం; అన్నిదేశాల మధ్య శాంతియుత సహజీవనం, స్నేహపూర్వక సహకారం కొరకు కృషిచేస్తున్నాం. అన్ని వ్యవస్థలకంటె సోషలిస్టు వ్యవస్థ ఉత్కృష్టమైనదని మనం నమ్ము

తాం. అందుచేత, పెట్టుబడిదారీ దేశాలతో శాంతియుతంగా పోటీచేయుడమంటే మనం భయపడం. మన విధానం ప్రపంచ ప్రజల ప్రయోజనాలకు అనుగుణ్యంగాఉంది. శాంతిని ప్రేమించే వారంతా, జాతీయ స్వాతంత్ర్యాన్ని కోరేవారంతా, సామాజికాభివృద్ధికి పాటుబడేవారంతా మన ఆదరాభిమానాలను పొందుతున్నారు. సోషలిస్టు దేశాలు యావత్ప్రపంచంలో అంతకంతకు అధికంగా గౌరవ ప్రతిష్టలు సంపాదించుకొంటున్నాయి; ప్రపంచ పరిణామాల్లో అంతకంతకు అధికంగా తమ ప్రభావాన్ని కలుగజేస్తున్నాయి. సోవియట్ యూనియన్ నాయకత్వం క్రింద విరాజిల్లుతున్న సోషలిస్టు దేశాల వ్యవస్థ సుస్థిరశాంతి స్థాపనకు జరిగే పోరాటంలో పెట్టని కోటగా నిలిచిఉంది.

గత ఫిబ్రవరిలో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ ప్రపంచ ప్రాముఖ్యతగల రాజకీయ ఘటన. ఆమహాసభ అత్యద్భుతమైన ఆరవ పంచవర్ష ప్రణాళికను ఆమోదించడమే కాక, సోషలిస్టు ఆశయాల సాధనకు అనేక ముఖ్యమైన విధానాలను, సూత్రాలను రూపొందించింది. పార్టీలో ప్రమాదకరమైన ఫలితాలకు దారితీసిన వ్యక్తిపూజను ఆమహాసభ ఖండించింది శాంతియుత సహజీవనాన్ని, అంతర్జాతీయ సహకారాన్ని, ఇంకా ఎక్కువగా పెంపొందించాలని నిర్ణయించింది. ఈ విధంగా అంతర్జాతీయ ఉద్రిక్తత మరింత సడలడానికది దోహదమిచ్చింది.

సోషలిస్టు దేశాల బలం, సంఘటితశక్తి మనదేశంలో అమలు జరుగుతున్న సోషలిస్టు నిర్మాణానికి అత్యంత అనుకూలమైన పరిస్థితులను కల్పించింది.

## జాతీయ స్వాతంత్ర్యోద్యమాలు

రెండవ ప్రపంచయుద్ధం తర్వాత జరిగిన ప్రపంచపరిణామాల్లో జాతీయ స్వాతంత్ర్యోద్యమాలు సాధించిన విజయాలు చారిత్రక ప్రాధాన్యం కలిగియున్నాయి ఇప్పటికే సోషలిస్టు మార్గంలో పురోగమిస్తున్నవియత్నాం ప్రజాతంత్రరిపబ్లిక్, కొరియాప్రజారిపబ్లిక్, చైనాప్రజారిపబ్లిక్‌లతో పాటు ఆసియా–ఆఫ్రికాఖండాల్లో అనేక దేశాలు వలస పాలనకు స్వస్తి చెప్పి,జాతీయ స్వాతంత్ర్యం సాధించుకున్నాయి.మన పొరుగు దేశమైన భారతదేశంతో సహా, యీస్వతంత్ర దేశాలన్నీ సుమారు 60 కోట్ల జనాభాను కలిగియున్నాయి. అంటే ప్రపంచ జనాభాలో నాల్గవవంతు అన్నమాట. వీటిలో అత్యధిక దేశాలు విదేశాంగ వ్యవహారాల్లో శాంతి విధానం, తటస్థవిధానం అవలంబిస్తున్నాయి. ప్రపంచవ్యవహారాల్లో యివి అంతకంతకు ముఖ్యపాత్ర వహిస్తున్నాయి. బాండుంగ్‌లోజరిగిన ఆసియా—ఆఫ్రికా దేశాల మహాసభ, అనేక ఆసియా—ఆఫ్రికా దేశాల స్వాతంత్ర్యోద్యమాలలో వచ్చిన నూతన పరిణామాలు, ముఖ్యంగా ఈజిప్టు సూయెజ్ కంపెనీని జాతీయమొనర్చడం — యివన్నీ జాతీయ స్వాతంత్ర్యోద్యమం ఒక బ్రహ్మాండమైన ప్రపంచ శక్తిగా అభివృద్ధి చెందిందనడానికి నిదర్శనాలు. గతంలో అనేక ఆసియా — ఆఫ్రికా దేశాలు సామ్రాజ్య వాదులక్రింద వలసదేశాలుగానో, అర్ధవలసదేశాలుగానో ఉండేవి; వాటిని సామ్రాజ్యవాదులు తమ యుద్ధాలకు లేదా యుద్ధసన్నాహాలకు స్థావరాలుగా ఉపయోగించుకునే వారు. కాని అవి యీరోజున వలస విధానాన్నీ యుద్ధాలనూ వ్యతిరేకిస్తున్నాయి.

శాంతియుత సహజీవనంకోరకు పాటుపడుతున్నాయి. లాటిన్ అమెరికా దేశాల్లోకూడ వలస విధానానికి వ్యతిరేకంగా పోరాటం విస్తరించుతోంది. సామ్రాజ్యవాదు లీ జాతీయ స్వాతంత్ర్యోద్యమ వెల్లువను అణచడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. కాని దాన్ని అణచటం ఎవ్వరితరంకాదు. చివరకు అది ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలను ముంచెత్తి తీరుతుంది. ప్రపంచంలో వలసవిధానమే లేకుండాపోతుంది.

సోషలిస్టు దేశాలు బలంగా ఉండడంవల్లను, అవి జాతీయ స్వాతంత్ర్యోద్యమానికి సానుభూతిసహాకారా లందజేస్తూండడం వల్లను యీ ఉద్యమం నానాట అభివృద్ధి చెందడానికి, అనేక విజయాలను సాధించడానికి అవకాశమేర్పడింది అదే సమయంలో, జాతీయస్వాతంత్ర్యోద్యమ వెల్లువ దురాక్రమణ పూరితమైన, యుద్ధోన్మాదంతో నిండిన సామ్రాజ్యవాదశక్తుల్ని బలహీనమొనర్చింది. ఇది ప్రపంచశాంతికి చాల అనుకూలమైన పరిస్థితులను కల్పించింది; అందుచేత సోషలిస్టు దేశాల్లో శాంతియుతనిర్మాణానికికూడ అనుకూలపరిస్థితు లేర్పడ్డాయి కనుకనే సోషలిస్టు దేశాలకూ జాతీయస్వాతంత్ర్యం పొందిన దేశాలకూ మధ్య స్నేహసహాకారాలు ఆ యా దేశాల ఉమ్మడి ప్రయోజనాలకే గాక, ప్రపంచశాంతిని కాపాడ్డానికికూడ దోహదమిస్తున్నాయి.

## అమెరికన్ సామ్రాజ్యవాదుల పన్నాగాలు

ఈ అద్భుతమైన చారిత్రక పరిణామాలు సామ్రాజ్యవాదుల కోర్కెలకు, ముఖ్యంగా అమెరికన్ సామ్రాజ్యవాదుల

కోర్కెలకు, భిన్నంగా ఉన్నాయి. అమెరికన్ గుత్తపెట్టుబడి దారులు రెండవ ప్రపంచయుద్ధంలో తాము సంపాదించిన అమితలాభాలను ఆధారంగా చేసుకొని, యుద్ధంతర్వాత అనేక దురాక్రమణచర్యలకు పూనుకొన్నారు. మొట్టమొదట వారు ఓడిపోయిన జర్మనీ, జపాన్ మొదలైన దేశాలపై పెత్తనం సంపాదించడానికి, ఆసియా - ఆఫ్రికా ఖండాల్లో బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన దేశాల వలసపడిప్రాంతాలను స్వాధీనం చేసుకోడానికి తీవ్రప్రయత్నాలు చేశారు. ప్రపంచాధిపత్యం కొరకు శాయశక్తులా కృషిచేశారు. కొన్ని దేశాలతో సైనిక కూటాలను నిర్మించారు; యుద్ధస్థావరాలను నెలకొల్పారు; అంతర్జాతీయ ఉద్రిక్తతను కలిగించారు; మరో ప్రపంచయుద్ధానికి సన్నాహాలు చేశారు. ఈ చర్యలన్నిటినీ "కమ్యూనిస్టు దురాక్రమణకు వ్యతిరేకమైన రక్షణచర్యలు" గా అమెరికన్ సామ్రాజ్యవాదులు వర్ణిస్తున్నారు. కాని సత్యం ముందు అసత్యాలు దాగవు. సోషలిజానికీ దురాక్రమణకూ పొత్తు కుదరదు. సోషలిస్టుదేశాల్లో దురాక్రమణ, వలసరాజ్యాధిపత్యం, విదేశమార్కెట్లపై ఆధారపడేవర్గం నిర్మూలింపబడ్డాయి. కాని సామ్రాజ్యవాదదేశాల్లో అలాకాదు. దురాక్రమణద్వారా సంపదను కూడబెట్టే గ్రూపులు తమంతటతాము దురాక్రమణకు స్వస్తిచెప్పడం అసంభవం. వాస్తవవిషయ మేమిటో ప్రపంచ ప్రజలకు తెలుసు. సోవియట్‌యూనియన్, చైనా, తదితర సోషలిస్టుదేశాలు శాంతియుతసహజీవనసూత్రాన్ని తు. చ. తప్పకుండా పాటిస్తున్నాయి; ప్రాక్పశ్చిమదేశాలమధ్య ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలను పెంపొందించడానికి కృషిచేస్తు

న్నాయి; తమ సాయుధబలాలను, సైనికఖర్చులను తగ్గించు కొనడంద్వారా యితరదేశాలకు మార్గం చూపుతున్నాయి. అమెరికన్ సామ్రాజ్యవాదు లిందుకు పూర్తిగా భిన్నమైనమార్గ మవలంబిస్తున్నారు. మారణాయుధాల ఉత్పత్తిని వారు యథాప్రకారంగా కొనసాగిస్తున్నారు. ప్రాక్పశ్చిమ దేశాలమధ్య సత్సంబంధాలను వ్యతిరేకిస్తున్నారు. శాంతియుతసహజీవనమంటే మహాప్రళయం వచ్చినట్లు భయపడుతున్నారు. ఈ క్షణంలో అమెరికన్ సాయుధబలాలు అమెరికా సరిహద్దులకు వేలాది కిలోమీటర్ల దూరంలో చైనా భూభాగమైన తైవాన్ దీవిని ఆక్రమించుకొని కూర్చున్నాయి; జపాన్ భూభాగంమీద, దక్షిణకొరియా, ఫిలిప్పీన్స్, పశ్చిమయూరపు దేశాల్లో తిష్ట వేశాయి.

"కమ్యూనిజం నుంచి రక్షణ," "కమ్యూనిజానికి ప్రతిఘటన" అనే నినాదం రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు కూడా ఉపయోగింపబడింది. ఒక దేశం ప్రపంచాధిపత్యం కొరకుచేసే ప్రయత్నాలను కప్పిపుచ్చుకునేందుకు ఆ నినాదం ఉపయోగింపబడింది. సామ్రాజ్యవాదులు సహజంగా సోషలిస్టు దేశాలను బాగా ద్వేషిస్తారు. కాని సోషలిస్టు దేశాల ఐక్యతను, శక్తిని భగ్నంచేయడం సాధ్యంకాదని వారికికూడా తెలుసు. అందుచేత, ప్రస్తుత దశలో ఆమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రధాన కార్యక్రమం "కమ్యూనిజాన్ని ప్రతిఘటించే" సాకుతో తమ దేశప్రజల్ని అణచియుంచడం, సోషలిస్టు దేశాలకూ అమెరికాకూ మధ్యనున్న విస్తృత ప్రాంతంలో సాధ్యమైనంతగా పెత్తనం సంపాదించడం, జోక్యం కలిగించుకోడం.

కాని వీరి చర్యలకు అన్నివైపులనుంచీ ప్రతిఘటన ఎక్కువవుతోంది; వీటివల్ల పెట్టుబడిదారీ వ్యవస్థలోని ఆంతరంగిక వైరుధ్యాలు తీవ్రమవుతున్నాయి. ఇదివరలో వలసవిధానం క్రింద బాధలుపడ్డ, యిప్పుడు పడుతూన్న దేశాల ప్రజలు అమెరికన్ సామ్రాజ్యవాదులే అందరికన్న పెద్ద వలస పీడకులనీ, వారే అందరికన్న దురాక్రమణపరులనీ అంతకంతకు చక్కగా అర్థం చేసుకొంటున్నారు. ఆసియా, ఆఫ్రికా ఖండాల్లో జాతీయ స్వాతంత్ర్యం పొందిన అనేక దేశాలు శాంతి విధానాన్ని, తటస్థవిధానాన్ని అవలంబిస్తున్నాయి. అమెరికా నిర్మిస్తున్న సైనిక కూటాలలో చేరడానికి నిరాకరిస్తున్నాయి. ఇది అమెరికన్ సామ్రాజ్యవాదుల వలస దురాక్రమణకు పెద్ద ఆటంకంగా ఉంది. పశ్చిమ రాజ్యాలలోకూడ అంతకంతకు ఎక్కువ దేశాలు అమెరికన్ దురాక్రమణ విధానంవల్ల తమకు కలిగే నష్టాన్ని క్రమక్రమంగా గుర్తిస్తున్నాయి. అమెరికన్ యుద్ధోన్మాదుల రథ చక్రాలకు బంధింపబడియుండడానికవి నిరాకరిస్తున్నాయి; యీ దేశాల్లో రోజు రోజుకూ తటస్థభావాలు వ్యాపిస్తున్నాయి; సోషలిస్టు దేశాలతో శాంతియుత సహజీవనాన్ని అవి కోరుతున్నాయి. అమెరికాకు ప్రధాన మిత్రదేశాలైన బ్రిటన్, ఫ్రాన్సులు అమెరికా బలంమీద ఆధారపడితే తమ ప్రయోజనాలు రక్షింపబడతాయని ఒకనాడు ఆశించాయి. కాని, యుద్ధానికి సన్నాహాలుచేసే అమెరికా అడుగుజాడల్లో నడవడంవల్ల ఆ దేశాల్లో అమెరికా ప్రాబల్యం అంతకంతకు హెచ్చుతూంది; విపరీతంగా పెరుగుతూన్న సైనిక ఖర్చులవల్ల ఆ దేశాల ఆర్థిక వ్యవస్థ అంతకంతకు అధికంగా నష్టపడుతూంది. అందువల్ల

అమెరికాయొక్క ప్రధాన మిత్రదేశాలు అమెరికన్ గుత్త పెట్టు బడిదారీ సంస్థలపట్ల, అమెరికా పెత్తనంపట్ల అసంతృప్తిని, వ్యతిరేకతను ప్రదర్శిస్తున్నాయి. ముఖ్యంగా, బ్రిటన్ — అమెరికాల మధ్య వైరుధ్యాలు తీవ్రమవుతున్నాయి. అదే సమయంలో, పశ్చిమ దేశాల ప్రజాసామాన్యంలో అమెరికన్ యుద్ధ సన్నాహాలకు వ్యతిరేకంగా శాంతి కొరకు, ప్రజాస్వామ్యం కొరకు ఉద్యమాలు అంతకంతకు ఎక్కువగా విస్తరిస్తున్నాయి. అమెరికా ప్రజలు సహితం, యీ విధానంవల్ల నడుములు విరిగే భారాలు తమమీద పడుతున్నాయనీ, యుద్ధ ప్రమాదం హెచ్చిందనీ క్రమక్రమంగా గుర్తిస్తున్నారు. అమెరికన్ పాలకవర్గాల్లో సహితం కొందరు వివేకవంతులు యుద్ధ మార్గం అమెరికాకు లాభదాయకం కాదేమోనని శంకిస్తున్నారు.

## సూయెజ్ సమస్య

బ్రిటిష్, ఫ్రెంచి పాలక వర్గాల విదేశాంగ విధానం యీ రోజున వైరుధ్యాలు, గందరగోళం అనే ఊబిలో కూరుకుపోయివుంది. బ్రిటన్, ఫ్రాన్సులు మొత్తం అంతర్జాతీయ పరిస్థితుల ప్రభావంవల్ల కొంతవరకు శాంతియుత సహజీవనానికి సుముఖత వెల్లడించాయి. కాని వలస విధానంవల్ల కలిగే స్వార్థ ప్రయోజనాలను పట్టుకు వేళ్ళాడ్డానికి విప్రయత్నిస్తున్నాయి. బలప్రయోగంద్వారా జాతీయ స్వాతంత్ర్యోద్యమాలనుఅణచే విధానాన్ని అవి విడిచిపెట్టడానికి యిష్టపడ్డంలేదు. ఈ మధ్య

ఈజిప్టు ప్రభుత్వం సూయెజ్ కంపెనీని తిరిగి వశపరచుకున్న తర్వాత జరిగిన పరిణామాలే యిందుకు స్పష్టమైన తార్కాణం. ఈజిప్టుయొక్క సర్వంసహాధికారాన్ని అపహరించేటందుకు, సూయెజ్ కాలువను తిరిగి స్వాధీనం చేసుకునేందుకు బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు సైనికంగా దురాక్రమణ జరపదలచుకొంటున్నాయి. అమెరికా ఒకవైపు బ్రిటన్, ఫ్రాన్స్‌ల దురాక్రమణ చర్యలను బలపరుస్తూనే, మరోవైపు మధ్యప్రాచ్యంలో తాను ప్రాబల్యం సంపాదించడానికి ఈ పరిస్థితిని ఉపయోగించుకొన జూస్తోంది. మధ్యప్రాచ్యంలో సామ్రాజ్యవాదుల దురాక్రమణ విధానానికీ, స్వతంత్రరాజ్యాల దురాక్రమణ వ్యతిరేక విధానానికీ మధ్య సంఘర్షణ అంతకంతకు తీవ్రమవుతోంది. ఈజిప్టుపట్ల యావత్ప్రపంచం సానుభూతిని కలిగియుంది. ప్రపంచమందలి వివిధ దృక్పథాలు గల ప్రజలు సూయెజ్ తగాదాను శాంతియుత సంప్రతింపులద్వారా పరిష్కరించాలని కోరుతున్నారు. బ్రిటన్, ఫ్రాన్స్‌లు సంప్రతింపుల పద్ధతి కంగీకరించకుండా సాయుధచర్యలకు పూనుకుంటే, ఈజిప్టుప్రజలు, అరబ్బు దేశాలప్రజలు వీరోచితంగా ప్రతిఘటనకు పూనుకోవడమేగాక, సోషలిస్టు శిబిరానికి చెందిన దేశాలన్నీ, ఆసియా—ఆఫ్రికా - లాటిన్ అమెరికా దేశాల ప్రజలంతా, పశ్చిమరాజ్యాల ప్రజానీకమంతా వ్యతిరేకించి తీరుతారు. చివరకు బ్రిటిష్, ఫ్రెంచి ప్రజలు సహితం వ్యతిరేకిస్తారు. ప్రపంచం యీరోజున శాంతివైపు పురోగమిస్తోంది. సూయెజ్ సమస్యపైగాని, జాతీయ స్వాతంత్ర్యోద్యమాలకు సంబంధించిన యితర సమస్యలపైగాని సాయుధ దురాక్రమణకు పూనుకునే విధానం పూర్తిగా విఫలమైతీరుతుంది.

అట్టి ఉద్రిక్త పరిస్థితులను సామ్రాజ్యవాదులిక ముందు కూడా కల్పిస్తారనడంలో ఎట్టి సందేహం లేదు. ప్రజల్ని అణచగల శక్తి వారి కెక్కడైతే ఉందో అక్కడల్లా ప్రజలను అణచడానికే పూనుకుంటారు. యుద్ధంయొక్క ప్రమాదం ఇప్పటికీవుంది. ఈవిషయంలో మన మేమాత్రం ఉపేక్ష వహించినా, పొరపాటు చేసినవారమవుతాం. మానవజాతి శాంతికొరకు, అభ్యుదయం కొరకు పోరాడడంలో యింకా అనేక కష్టాలను, క్లిష్ట పరిస్థితులను ఎదుర్కోవలసి వస్తుంది; కంటకావృతమైన మార్గంలో ప్రయాణంచేయవలసి యుంటుంది. కాని మొత్తం ప్రపంచ పరిస్థితి ఆశాజనకంగానే ఉంది. సోషలిస్టు దేశాలు, ప్రపంచంలోని శాంతి శక్తులు, ప్రజాస్వామ్యవాదులు సంఘటిత శక్తితో ఏకోన్ముఖంగా కృషిచేస్తే సుస్థిరశాంతి మానవాభ్యుదయం లభించి తీరుతాయి.

## శాంతి విధానం

అంతర్జాతీయ వ్యవహారాల్లో మనం అనుసరిస్తున్న విధానం ప్రపంచశాంతిని, మానవాభ్యుదయాన్ని సాధించేందుకు ఖచ్చితంగా కృషి సల్పడం. ఈ విషయంలో మనం గత కొద్దిసంవత్సరాల్లో చేసిన ప్రయత్నాలు సత్ఫలితాలనే యిచ్చాయి.

చైనా ప్రజలు సాగించిన విప్లవ పోరాటంలో సోవియట్ నాయకత్వాన శాంతి—ప్రజాస్వామ్య—సోషలిస్టు శిబిరం ఎంతో తోడ్పడింది. చైనా ప్రజా రిపబ్లిక్ స్థాపింపబడ్డ తర్వాత మనం సోవియట్ మహాదేశంతో స్నేహ — సహకార సంధి చేసు

కొన్నాం. గత కొద్ది సంవత్సరాల్లో జరిగిన ఘటనలనుబట్టి, చైనా — సోవియట్ దేశాల మధ్య మిత్రత్వం దూరప్రాచ్యం లోను, ప్రపంచంలోను శాంతికి పెట్టని కోటగా ఉన్నదని రుజువైంది నేడు మన దేశంలో జరుగుతున్న సోషలిస్టు నిర్మాణానికి సోవియట్ యూనియన్ గొప్ప సహాయం చేసింది. యూరప్, ఆసియాలలోని నూతన ప్రజాస్వామ్య దేశాలు కూడ అనేక విధాలుగా సహాయం చేశాయి. మన సోదర దేశాలు చేసిన యీ స్నేహపూర్వక సహాయాన్ని చైనా ప్రజలెన్నడూ మరువరు. ఇదివరకు, యికముందుకూడా అట్టి సహాయం మనకెంతో అవసరం. చైనా, సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు దేశాల మధ్య ఐక్యత, స్నేహం ఉమ్మడి ఆశయాలపై, అన్యోన్య సహాయంపై ఆధారపడి ఉన్నందున ఆ ఐక్యతను, స్నేహాన్ని ఎవ్వరూ చెడగొట్టలేరు; శాశ్వతంగా అవి నిలుస్తాయి. వాటినింకా సంఘటితమొనర్చి పటిష్ఠమొనర్చవలసియుంది. ఇది మన మహోత్కృష్టమైన అంతర్జాతీయ కర్తవ్యం; ఇదే మన విదేశాంగ విధానానికంతకూ ప్రాతిపదిక.

వలసవిధానం క్రింద చైనా స్వయంగా యమబాధలు అనుభవించింది. చైనాలో భాగమైన తైవాన్ యిప్పటికీ అమెరికా స్వాధీనంలోనే ఉంది. అందుచేత, చైనాప్రజలు వలసవిధానానికి వ్యతిరేకంగా జాతీయస్వాతంత్ర్యంకొరకు పోరాడే అన్ని దేశాలపట్ల, దురాక్రమణకులోనైన అన్ని దేశాలపట్ల గాఢమైన సానుభూతిని కలిగియున్నారు; వాటికి ప్రత్యక్షసహాయమందజేయడంలో వెనుదీయరు ఈ పోరాటంలో లభించే ప్రతి

విజయం — ఆసియాలోగాని, ఆఫ్రికాలోగాని, లాటిన్ అమెరికాలోగాని — శాంతిశక్తులకు బలం చేకూర్చుతుంది.

ఇతర దేశాలతో స్నేహ సంబంధాలు

మొట్టమొదటి విషయమేమంటే, మనం పంచ శీలాల ప్రాతిపదికపై పొరుగు దేశాలన్నిటితో సత్సంబంధాలుంచుకోడానికి ప్రయత్నిస్తున్నాం. ఈదేశాలతో మనకు సాంప్రదాయకమైన, గాఢమైన స్నేహ సంబంధాలున్నాయి. మనమధ్య పరిష్కరించుకోలేని తగాదా లేవీ లేవు. మన దేశానికీ, కొన్ని పొరుగు దేశాలకూ మధ్యకొన్ని చారిత్రిక పరిణామాలవల్ల ఉత్పన్నమైన సమస్యలను యింకా పరిష్కరించుకో వలసియుంది. సామ్రాజ్య వాదు లీ పరిస్థితిని ఉపయోగించుకొని, పొరుగు దేశాలతో స్నేహసంబంధాలను పెంపొందించుకోడానికి మనం చేస్తున్న ప్రయత్నాలను వమ్ముచేయాలని చూస్తున్నారు. కాని వారి కృషి భగ్నం కాకమానదు మనకూ, మన పొరుగు దేశాలకూ మధ్యగల సమస్య లన్నిటినీ శాంతియుత సంప్రతింపులద్వారా పంచశీలాల ప్రాతిపదికపై తప్పక పరిష్కరించుకోవచ్చు. మనకూ మన పొరుగుదేశాలకూ మధ్య స్నేహ సంబంధాలు పెంపొందడం మన శ్రేయస్సుకూ, వాటి శ్రేయస్సుకూకూడ అవసరం.

మనదేశం యిదివరకే యూరపులోని అనేక పశ్చిమ రాజ్యాలతో మామూలు సంబంధాలు నెలకొల్పుకొంది.

ఇంతవరకు మనదేశంతో రాజకీయ సంబంధాలు పెట్టుకొనని దేశాలతో అట్టి సంబంధా లుంచుకోడానికి మనం

సిద్ధంగా ఉన్నారు. అట్టి సంబంధాలు ఉభయపక్షాలకు శ్రేయస్కరమని మనం నమ్ముతున్నాం.

పంచశీలాల ప్రాతిపదికపై శాంతియుత సహజీవనం కొరకు మన మనుసరించేవిధానంలో ఏదేశాన్నీ మినహాయించం, అమెరికాతో కూడ శాంతియుత సహజీవనాన్ని మనం కోరుతాం. కాని అమెరికా మనదేశంపట్ల ఎల్లప్పుడూ శత్రువైఖరినే అవలంబిస్తోంది. మనదేశంలో భాగమైన తైవాన్‌ని అది ఆక్రమించుకొంది; గూఢచారుల్ని పంపి విచ్ఛిన్న చర్యలను ప్రోత్సహించింది. మనదేశంతో యితరదేశాలు వర్తకంచేయకూడదని ఆంక్ష విధించింది; అంతర్జాతీయ వ్యవహారాలలో మనదేశాన్ని పాల్గొననీయకుండా చేయడాని కెన్ని చేయాలో అన్నీ చేసింది. ఐక్యరాజ్యసమితిలో న్యాయంగా మనకీయవలసిన స్థానాన్ని యివ్వ నిరాకరించింది. ఇన్నిచేసినా, మన ప్రభుత్వం శాంతియుత సంప్రతింపుల ద్వారా అమెరికాతో తగాదాలను పరిష్కరించుకోడానికి ప్రయత్నించింది, తైవాన్ ప్రాంతంలో ఉద్రిక్తతను సడలించడానికి ఉభయదేశాల విదేశాంగమంత్రులు సమావేశమవాలని మనం పదే పదే సూచించాం. ఇందుకు మనంచేసిన ప్రయత్నాలు అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలించడాని కుద్దేశింపబడ్డవే కాని, దురాక్రమణకు లొంగిపోయేందుకు కాదు. చైనాప్రజలు తమ మాతృదేశ స్వాతంత్ర్యాన్నీ భద్రతనూ రక్షించుకోడాని కెన్ని త్యాగాలైనా చేసేందుకు సిద్ధంగాఉన్నారని ప్రపంచానికి తెలుసు. కాని అమెరికాప్రభుత్వం మనయెడల యిప్పటికీ అనుసరిస్తున్న విధానం వాస్తవపరిస్థితులకు, హేతువాదానికి భిన్నంగా ఉంది. ఫలిత

మేమంటే, అమెరికన్ సామ్రాజ్యవాదులు మన దేశాన్ని విచ్ఛిన్నమొనర్చటానికి, ఏకాకిగాచేయడానికి ఎన్ని తుచ్ఛపద్ధతు లవలంబించినప్పటికీ, నవచైనా తన కాళ్ళమీద తాను బలి ష్టంగా నిలబడేవుంది. న్యాయం మనపక్షాన వుంది; ప్రపంచ ప్రజల సానుభూతి మనకుంది. ప్రపంచంలో ఏకాకిగా ఉన్నది మనంకాదు; అమెరికన్ సామ్రాజ్యవాదులే. తాము ఇంకా ఎక్కువ అపజయాలు పొందకుండా జాగ్రత్తపడాలనుకుంటే, మన దేశంపట్లవారు వాస్తవికమైన, హేతుబద్ధమైన వైఖరి నవలం బించడమొక్కటే మార్గమని అమెరికన్లకు సైతం తెలుసు.

ఈ రోజున చైనా ప్రజలు, యావత్ప్రపంచ ప్రజలు శాంతిని కోరుతున్నారు ఒండొరులతో ఆర్థిక — సాంస్కృ తిక సంబంధాలను, స్నేహసంబంధాలను పెంపొందించుకోవాలని వారు అభిలషిస్తున్నారు. గత కొద్ది సంవత్సరాల్లో చైనా ప్రజలు ప్రపంచశాంతికి దోహదమిచ్చే అంతర్జాతీయ కార్య కలాపాలన్నిటిలో స్వయంగా పాల్గొన్నారు. అనేక దేశాల ప్రజలతో మనం ప్రత్యక్షంగా ఆర్థిక — సాంస్కృతిక సంబం ధాలను పెంపొందించుకొంటూ వచ్చాం. అనేక దేశాల్లో వివిధ జీవిత రంగాలకు చెందిన ప్రజా సంస్థలతోను, ప్రముఖ వ్యక్తులతోనుకూడా మనం స్నేహసంబంధాలను వృద్ధిచేసు కున్నాం. ఈ కార్యకలాపాలన్నిటిలో మానవ కల్పితమైన ఆటంకాలెన్నో మనల నెదుర్కొన్నప్పటికీ, ప్రపంచమంతటా మన మిత్రుల సంఖ్య రోజు రోజుకు హెచ్చుతోంది. మనకు ఉక్కుతెరలేవీ లేవని రుజువైంది; మన తలుపులు అందరికీ తెరచే ఉన్నాయి.

ఇదీ, అంతర్జాతీయ వ్యవహారాల్లో మనమింతవరకు అనుసరిస్తూ వచ్చిన విధానం. ఈ విధానాన్నే యికముందు కూడా మనం కొనసాగించవలసియుంది.

# 6. పార్టీనాయకత్వం

7 వ పార్టీ మహాసభ మొదలు 8 వ పార్టీ మహాసభ వరకు మన విప్లవం విజయాన్ని సాధించడంతోపాటు, దేశ పరిస్థితుల్లో అనేక మార్పులు రావడంతోపాటు పార్టీలోకూడా ఎన్నో గొప్ప మార్పులు వచ్చాయి. ఈరోజున మన పార్టీ దేశ వ్యాపితంగా రాజ్యాధికారం నడుపుతున్న పార్టీగావుంది; ప్రజల్లో దానికి అత్యధికమైన పలుకుబడివుంది. పార్టీనిర్మాణం ఎంతో వృద్ధిచెందింది. 1,07,30,000 మంది యీరోజున కమ్యూనిస్టు పార్టీలో సభ్యులుగాఉన్నారు. వీరిలో 100 కి 14 గురు కార్మికవర్గంనుంచి వచ్చినవారు; 69 గురు రైతులనుంచి, 12 గురు మేధావులనుంచి వచ్చారు. పార్టీ యూనిట్లు దేశమంతటా ఉన్నాయి. అవి వివిధజాతులు నివసించే ప్రాంతాల్లో విస్తరించియున్నాయి. పార్టీ సభ్యులలో అత్యధిక సంఖ్యాకులు గొప్ప విప్లవ పోరాటాల్లో రాటుదేరారు. 1949 తర్వాతచేరిన కొత్త సభ్యులు సహితం—వీరు మొత్తం సభ్యులలో 100 కి 60 మందికి పైగా ఉన్నారు—ప్రధానంగా, విప్లవపోరాటల్లోను, గత కొద్ది సంవత్సరాలుగా కొనసాగుతున్న సోషలిస్టు నిర్మాణంలోను చురుగ్గా పాల్గొన్న ప్రముఖ వ్యక్తులే.

మొత్తంమీద మన పార్టీ ప్రజలతో యిదివరకుకంటె ఎక్కువ సన్నిహితమైన సంబంధాలను కలిగియుంది; ఎక్కువ అనుభవాన్ని అది సంపాదించింది. పార్టీలో యిప్పుడున్నంత ఐక్యత యిదివరకెప్పుడూ లేదు.

శ్రామిక నియంతృత్వంలేనిదే మన దేశంలో సోషలిస్టు సమాజాన్ని నిర్మించడం అసంభవమని యిదివరకే పేర్కొన బడింది. ఈ శ్రామిక నియంతృత్వం శ్రామికపార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంద్వారా అమలు జరుగుతోంది. చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంయొక్క బలం యెందులో ఉంది? సిద్ధాంతరీత్యా మార్క్సిజం — లెనినిజాన్ని తన ఆయుధంగా స్వీకరించడంలో, సరియైన రాజకీయ విధానాన్నీ నిర్మాణ పంథానూ అనుసరించడంలో, ప్రజలపోరాటాల్లోను కార్యకలాపాల్లోను అమూల్యమైన అనుభవాన్ని సంపాదించడంలో, ప్రజలందరి జ్ఞానసంపదను చాకచక్యంగా క్రోడీకరించడంలో, దాన్ని సమైక్య మనో నిశ్చయంగా శిక్షణాయుతమైన కార్యాచరణగా మార్చడంలో—యీనాయకత్వంయొక్క బలం ఉంది. మన దేశం అనేక క్లిష్టమైన ఆంతరంగిక సమస్యలను, అంతర్జాతీయ సమస్యలను విజయవంతంగా పరిష్కరించాలంటే, యికముందుకూడా అట్టి పార్టీయొక్క నాయకత్వం మనకు అవసరం ఈ అభిప్రాయంతో అన్నితరగతుల ప్రజలు ఏకీభవిస్తున్నారు. మన దేశంలో నేడున్న ప్రజాతంత్రపార్టీలుకూడ యదార్థజీవితంలో గడించిన అనుభవాన్ని బట్టి యిదే సరియైన అభిప్రాయమని భావిస్తున్నాయి.

## పార్టీలో కొన్ని పెడధోరణులు

అయినప్పటికీ, సోషలిస్టునిర్మాణానికి సంబంధించిన కార్యాకలాపాల్లోకొందరు కామ్రేడ్స్ — వారిసంఖ్య చిన్నదే అనుకోండి—పార్టీ నాయకత్వపాత్రనుబలహీనమొనర్చడానికి ప్రయత్నిస్తూ వచ్చారు. విధానాలకు, సూత్రాలకు సంబంధించిన ప్రభుత్వవ్యవహారాల్లో మాత్రమే పార్టీ నాయకత్వం వహించాలనీ, సాంకేతికవిషయాల్లో అట్టి నాయకత్వం అనవసరమనీ వారి వాదన. సాంకేతిక సమస్యల్లో పార్టీయింకా అనుభవం సంపాదించలేదు గనుక అట్టి కార్యకలాపాల్లో అది నాయకత్వం వహించ నవసరం లేదనీ, తాముమాత్రం తమకుతోచిన పనులు చేయవచ్చుననీ వారి అభిప్రాయం. ఈ పొరబాటు ధోరణి యిదివరకే విమర్శించబడింది. సిద్ధాంతరంగంలోను, రాజకీయ సమస్యలపైన, సూత్రాలకు — విధానాలకు సంబంధించిన విషయాల్లోను పార్టీ తప్పకుండా నాయకత్వపాత్ర నిర్వహించాల్సిందే. అయితే దీనిఅర్థం, పార్టీసభ్యులు తమయిష్టంవచ్చినట్లు చేయవచ్చుననీ, అన్నివిషయాల్లోను జోక్యం కలిగించుకోవచ్చుననీ కాదు. తమకు అర్థంకాని విషయాలను తెలుసుకోకుండా ఎల్లప్పుడూ బాల్యావస్థలోనే ఉండదలచుకోడంకూడా సరికాదు. పార్టీసభ్యులు కార్యకర్తలు తమకర్థంకాని విషయాలను కష్టపడినేర్చుకోవాలనీ, వాటిలో ప్రావీణ్యత సంపాదించాలనీ పార్టీచెబుతుంది. కారణమేమంటే, ఎంతగా మనం నేర్చుకుంటామో అంతచక్కగా నాయకత్వం వహించగల్గుతాం.

ఇదివరకే స్పష్టంచేయబడినట్లు, 7 వ పార్టీమహాసభ తర్వాత మనపార్టీ అనుసరించినవిధానం సరియైనదేనని చరిత్ర

రుజువుచేసింది. కాని, అంతకంతకు గురుతరమైన బాధ్యతలను నిర్వర్తించవలసిన నేటిపరిస్థితుల్లో, పార్టీ కొన్ని చిక్కుల నెదుర్కోవలసివస్తూందనీ, కొన్ని పొరబాట్లు జరుగుతున్నాయనీ మన మంగీకరించాలి సోషలిస్టుపరిణామంలోనుసోషలిస్టునిర్మాణంలోను, రాజకీయసమస్యల్లోను మనం తాత్కాలికమైన, పరిమితమైన కొన్ని పొరబాట్లు చేశాం. అంతర్జాతీయ సమస్యలను పరిష్కరించడంలోకూడ కొన్ని లోపాలు, పొరబాట్లు జరిగాయి. అందుచేత, పార్టీనాయకత్వంయొక్క కర్తవ్యాలలో ఒకటి, గతంలో జరిగిన పొరబాట్లను పరిశీలించి, వాటినుంచి గుణపాఠాలు నేర్చుకుని, యికమీదట అన్ని ఎక్కువ తప్పులు జరక్కుండా జాగ్రత్తవహించడం; సాధ్యమైనంతవరకు అలాంటి పొరబాట్లు తిరిగి జరక్కుండా చూడ్డం; చిన్నతప్పులు పెద్ద తప్పులు కాకుండా శ్రద్ధవహించడం.

మన పార్టీ యికముందుకూడా సరియైన నాయకత్వం వహించేటట్లు చూడాలంటే, సిద్ధాంత అవగాహననుంచిఉత్పన్నమయే పొరబాట్లు యిదివరకుకంటె తక్కువగా ఉండేటట్లు పార్టీ యూనిట్లు, పార్టీ సభ్యులూ జాగ్రత్తపడాలి. మన పార్టీలో సవ్యమైన అపసవ్యమైన అవగాహనలమధ్య, సరియైనపాలసీకి సరికాని పాలసీకీ మధ్య అనేక పోరాటాలు జరిగాయి. ఆ పోరాటాలు వర్గపోరాటంయొక్క, వివిధ సాంఘిక పరిణామాలయొక్క ప్రతిబింబాలు. మన దేశజనాభాలో మొదట పెట్టీ బూర్జువావర్గం అధికభాగంగా ఉండడంవల్ల, ఆ వర్గంయొక్క మనోభావాలు తరచు మనమీద ప్రభావం కలుగజేస్తూ వచ్చాయి; వాటి ఒత్తిడికి మనం లోనుకావలసివస్తోంది. అలాగే బూర్జువావర్గం

కూడా మనమీద అనేక విధాలైన ప్రభావం కలుగజేస్తూంది. బూర్జువావర్గంయొక్క, పెటీ బూర్జువావర్గంయొక్క ఆలోచనా విధానాలు మన రాజకీయ నైర్మల్యాన్ని పాడుచేయకుండా చూచుకోవాలంటే, పార్టీ నిర్విరామంగా ఆంతరంగిక విద్యా ప్రబోధం అమలు జరపాలి. మన పొరబాట్లకుమూలం సామాజిక సంబంధాల్లోనేగాక, వాటిపట్ల మనకున్న అవగాహనలోకూడా ఉన్నాయి. ఒక వ్యక్తి వాస్తవఘటనలను ఉన్నదిఉన్నట్లుగాను, సమగ్రదృష్టితోను పరిశీలించడంద్వారానే సరియైన అవగాహనకు రాగల్గుతాడు. ఈ విషయాన్ని అతడు గ్రహించకుండా, తన మనోభావాలనుబట్టి పాక్షిక దృక్పథంతో పరిశీలించినట్లయితే, అతడెల్లప్పుడూ పొరబాట్లు చేస్తూనే ఉంటాడు; అతని ఉద్దేశాలెంత మంచివైనప్పటికీ, చిన్న తప్పులుగాని పెద్ద తప్పులుగాని జరక్కమానవు. అందుచేత పొరబాట్లు జరక్కుండా చూడాలంటే, భౌతిక పరిస్థితులనుగురించీ వాస్తవిక పరిణామాలనుగురించీ నిర్దుష్టమైన జ్ఞానం సంపాదించాలి; సవ్యమైనదేదో అపసవ్యమైనదేదో సరియైన అంచనాకు రాగలగాలి.

## పార్టీచరిత్రలో మనం గడించిన అనుభవం

మన పార్టీ సభ్యులలో 100 కి 90 మంది 7వ పార్టీ మహాసభ తర్వాత చేరినవారే. అందుచేత, పెడమార్గాలను మనమెలా అధిగమించగలిగామో తెలుసుకోడానికి పార్టీ చరిత్రలో మనం గడించిన అనుభవాన్ని క్లుప్తంగా యిక్కడ సమీక్షచేయడం ఉపయోగకరం.

మనపార్టీ గత ౨౫ సంవత్సరాల్లో నాలుగుసార్లు పాలసీ విషయంలో ప్రమాదకరమైన పొరపాట్లు చేసింది. మొదటిసారి

1927 పూర్వార్ధభాగంలో చెన్—తూస్యూ బోధించిన మితవాద అవకాశవాదమార్గం. తర్వాత 7 సంవత్సరాల కాలంలో మూడుసార్లు "అతివాద" అవకాశవాద ధోరణి పార్టీలో ప్రబలింది. కాని, 1935 జనవరిలో జరిగిన సున్ యీ మహాసభ తర్వాత 21 సంవత్సరాల కాలంలో కామ్రేడ్ మావ్ - సే - టుంగ్ నాయకత్వాన గల కేంద్రకమిటి సారథ్యంక్రింద పార్టీ ఎలాంటి పొరపాట్లూ చేయలేదు. ఈ చారిత్రక మార్పుకు కారణమేమిటి? కేవలం పార్టీ దీర్ఘకాలంగా పనిచేస్తుండడమే కారణం కాజాలదు. అది గడించిన అనుభవంకూడా కారణమని చెప్పజాలం. ఎందుచేతంటే, 1931 - 34 మధ్య పార్టీ చేసిన పొరపాట్లు అంతకుపూర్వం రెండు సార్లు చేసిన "అతివాద" పొరపాట్లకంటే ఎక్కువ ప్రమాదకరమైనవి. ఆయా దశల్లో పార్టీకి నాయకత్వంవహించిన వ్యక్తులే కారణమనికూడా చెప్పలేం. ఎందుచేతంటే, మొదట పొరపాట్లుచేసిననాయకుల్లో ఎక్కువమంది ఆ తర్వాత పార్టీకి చాల మేలుచేశారు. పార్టీ చరిత్రనుంచి మన మీ క్రిందిపాఠాన్ని గ్రహించవచ్చు; పార్టీ యొక్క అనుభవం, నాయకుల శక్తిసామర్థ్యాలు పొరపాట్ల మీద ముఖ్యమైన ప్రభావం కలుగజేసేమాట నిజమే. కాని అంతకంటె ప్రధానమైన విషయమేమంటే, పార్టీ సాధారణ సభ్యులు—ముఖ్యంగా ఉన్నత స్థాయిలలోని కార్యకర్తలు—వివిధ దశల్లో పోరాటాల అనుభవాన్ని క్రోడీకరించేటప్పుడు మార్క్సిస్టు దృక్పథాన్నీ విధానాన్నీ పద్ధతినీ సరిగా అన్వయించగలుగుతున్నారా లేదా అనీ, సత్యానికికట్టుబడి ఉంటున్నారా లేదా అనీ, పొరపాట్లను దిద్దుకుంటున్నారా లేదా అనీ — చూడాలి.

పార్టీ కార్య కర్తల మార్క్సిస్టు — లెనినిస్టు అవగాహనకు ప్రధానమైన కొలబద్ద యిదే. కార్యకర్తల మార్క్సిస్టు లెనినిస్టు అవగాహన ఎంత ఉన్నత స్థాయిలో ఉంటే అంతచక్కగా మనం సవ్యమైన అభిప్రాయాలకూ అపసవ్యమైన వాటికి మధ్యగల వ్యత్యాసాన్నీ, మంచినాయకులకూ చెడ్డనాయకులకూ గల వ్యత్యాసాన్ని తెలుసుకోగలుతాం; అంత యెక్కువ సామర్థ్యంతో కార్యకర్తలు పని చేయగల్గుతారు.

1934 కు పూర్వం మనపార్టీ అమూల్యమైన అనుభవాన్నే గడించింది; కాని ఆరోజుల్లో నాయకత్వం వహిస్తూ వచ్చిన యీనాయకులు ఆ అనుభవాన్ని లోతుగా పరిశోధించలేదు. పార్టీ అనేకసార్లు పెడమార్గాలను ఖండించినప్పటికీ, ఆచరణలో పొరపాట్లుచేసిన నాయకులపై శిక్షణచర్యలుమాత్రమే తీసుకొని సంతృప్తి చెందింది; ఆ పొరపాట్లను గురించి సరియైన అంచనా వేయలేదు; ఆ పొరపాట్లు ఏవిధంగా సిద్ధాంత అవగాహననుంచి ఉత్పన్నమయాయో చెప్పలేదు. ఈవిధంగా పార్టీకార్యకర్తల అవగాహనను వృద్ధిచేయడానికి పార్టీ సహాయపడలేదు. ముఖ్యంగా, 1931-34 మధ్యవాంగ్ మింగ్, పో-చూ ల నాయకత్వాన "అతివాద" అవకాశవాదుల ప్రాబల్యం పార్టీలో ఎక్కువగా ఉండడంవల్ల, గతంలో అనేకసార్లు ప్రబలిన పొరపాటు ధోరణులనుంచి కార్యకర్తలు పాఠాలు నేర్చుకోలేక పోయారు. అంతేకాదు. పై నాయకుల ఆలోచనావిధానంలోని పిడివాదం, ఆచరణలోని నిరంకుశపద్ధతి స్వీయమానసిక, అతివాదపాక్షిక పొరపాట్లకు దారితీశాయి. అవి మన పార్టీ చరిత్రలో కనీ విని యెరుగనంతటి ఉచ్ఛస్థాయికి వెళ్ళాయి.

రాజకీయసమస్యలపైన, సైనికవ్యవహారాల్లోను వారు అతి దుందుడుకువిధానాలను అనుసరించారు. ఆనాడు మన దేశంలోని వివిధవర్గాల వాస్తవికపరిస్థితిని వారు పూర్తిగా విస్మరించారు; మనయొక్క, శత్రువుయొక్క బలాబలాలను సరిగా అంచనా వేయలేదు. పార్టీలోకూడ వారు ప్రజాస్వామ్యపద్ధతిని పూర్తిగా విచ్ఛిన్నమొనర్చారు; విశృంఖలమైన ఆంతరంగికపోరాటం సాగించారు. వారి పొరపాటు నాయకత్వం విప్లవపోరాటంలో అనేక పరాజయాలకు కారణమైంది; విప్లవస్థావరాల్లో 100 కి 90 వంతులు మన చేతుల్లోనుంచి జారిపోయాయి; కార్మిక - కర్షక సైన్యం తీవ్రనష్టాలకు లోనైంది. కొమింటాంగ్ ఆక్రమిత ప్రాంతాల్లో పార్టీనాయకత్వంక్రింద ఉన్న యించుమించు అన్ని విప్లవసంఘాలు, పార్టీయూనిట్లు తుడిచిపెట్టుకుపోయాయి.

కాని, 1935 తర్వాత పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఈ మార్పుకు ప్రధాన కారణమేమంటే, ఉన్నత స్థాయిలోని పార్టీ కార్యకర్తల్లో అధిక సంఖ్యాకులు పరాజయాలనుంచి పాఠాలు నేర్చుకొని, తమ అవగాహనను వృద్ధి చేసుకున్నారు. 1935 తర్వాత, తప్పులుచేసిన కామ్రేడ్స్‌కి కఠిన శిక్షలు విధించకుండా, వారిని సముచితమైన నాయకత్వస్థానాల్లో పార్టీ నియమించింది. వారు తమ పొరబాట్లను సిద్ధాంతరీత్యా అర్థం చేసుకొనేటట్లుతోడ్పడింది. అంతవరకూ వేచియుండాలనే పద్ధతి నవలంబించింది. అంతేకాక, పార్టీ కార్యకర్త లందరూ సిద్ధాంతాన్నీ ఆచరణనూ సమన్వయ పరచడమెలాగో క్రమేణా తెలుసుకునేటందుకు, పార్టీ కేంద్రకమిటీ క్రమబద్ధంగా సహాయమొనర్చింది; మన స్వీయాత్మక పరిజ్ఞానం వాస్తవిక పరిస్థితుల

కనుగుణ్యంగా ఉండాలనే సూత్రాన్ని వారు అర్థం చేసుకొనేలా తోడ్పడింది. ఈవిధంగా పార్టీ తన సిద్ధాంతకృషినీ నిర్మాణ కృషినీ బాగా చక్కపరచుకోవడంవల్ల, త్వరితంగా పార్టీ ఆశయాలు నెరవేరడాని కవకాశమేర్పడింది. తప్పులుచేసిన కామ్రేడ్స్‌తోసహా అందరూగడించిన చారిత్రకానుభవాన్ని త్రికరణశుద్ధిగా అధ్యయనం చేయడంలోను, తమ పనిలో యిదివరకు వలె ఎక్కువ తప్పులు చేయకుండా ఉండడాని కవసరమైన సక్రమ అవగాహనను ఏర్పరచుకోవడంలోను (ఆలోచనా విధానం, ఆచరణ సక్రమంగా ఉండేటట్లు చూచుకోడం) సహాయం చేయడానికి పార్టీ కేంద్రకమిటి ఒక ఉద్యమాన్ని నడిపింది. సున్—యీ మహాసభ జరిగిన 7 సంవత్సరాల తర్వాత కేంద్రకమిటీ పార్టీలో ఉన్న స్వీయమానసిక ధోరణిని, అతివాత పాతికధోరణిని (స్టీరియో నిజం), పడికట్టు శబ్దాల ప్రయోగాన్ని నిర్మూలించడానికి "పునరుద్ధరణ మహోద్యమ" మనే పేరుతో ప్రఖ్యాతిగాంచిన ఒక పెద్ద ఉద్యమాన్ని దేశమంతటా కొనసాగించింది. ఈ వుద్యమంలో, కార్యకర్తలంతా తమ అభిప్రాయాలను పనిని జాగ్రత్తగా పర్యాలోచించుకొనేటట్లు చేయడానికి కొన్ని నిర్మాణ పద్ధతులను చేబట్టింది; సిద్ధాంత, రాజకీయ, నిర్మాణ రంగాల్లో పార్టీ నాయకత్వంయొక్క పనిని తనిఖీచేసే పద్ధతిని ప్రవేశపెట్టింది. నిశితమైన విమర్శన—ఆత్మవిమర్శనకు పూనుకొంది. ఇదంతా మార్క్సిస్టు—లెనినిస్టు అవగాహనకు, ఆచరణకు అనుగుణ్యంగాఉండేటట్లు జాగ్రత్త వహించింది. ఈ చర్యలన్నిటివల్ల, అనేకమంది పార్టీ కార్యకర్తల్లో మార్క్సిస్టు అవగాహనయొక్క స్థాయి పెరిగింది;

పార్టీలో మంచి చెడ్డల వ్యత్యాసాన్ని గుర్తించగల శక్తి వారిలో అభివృద్ధి చెందింది. అనేకమంది కార్యకర్తలు వాస్తవ పరిస్థితులకు భిన్నంగా ఉండే శుష్క సిద్ధాంతధోరణి(డాక్ట్రినేరిజం) వల్ల, సిద్ధాంతానికి భిన్నంగా ఉండే సంకుచిత స్వీయానుభవ ధోరణి వల్ల (ఎంపిరిసిజం) జరిగే పొరపాట్లను గుర్తించ నారంభించారు. ప్రజలతో నిత్యమూ సన్నిహిత సంబంధా లుంచుకొంటూ, అధ్యయనం — పరిశీలన ద్వారా జ్ఞానం సంపాదిస్తూ, వాస్తవ పరిస్థితులనుంచి సత్యాన్ని తెలుసుకోవా లనే కార్యవిధానాన్ని (స్టయిల్ ఆఫ్ వర్క్) అలవరచుకున్నారు. ఈ విధంగా వారు పార్టీలోను, వెలుపల వాస్తవ పరిస్థితుల కనుగుణ్యంగా పనిచేయడ మెలాగో తెలుసుకో గలిగారు; తత్ఫలితంగా, అదివరకు జరిగినన్ని పెద్దతప్పులు జరగలేదు.

పైన పేర్కొన్న చారిత్రకానుభవంవల్ల మనకు బోధ పడే విషయమేమంటే, పార్టీ కార్యక్రమం సవ్యంగా నిరా ఘాటంగా ముందుకు పోవాలంటే, పెద్ద తప్పులు జరక్కుండా చూడాలంటే—మన ఆలోచనా విధానంలో స్వీయ మానసిక ధోరణిని అధికమించాలి. ఇదే కీలక విషయం.

## పార్టీలో స్వీయ మానసిక ధోరణి

కాని నేడు అనేకమంది కార్యకర్తల ఆలోచనల్లోను, ఆచరణలోను స్వీయ మానసిక ధోరణి ప్రబలుతూండడంవల్ల కొన్ని ప్రమాదకరమైన పొరపాట్లు జరుగుతున్నాయి. తత్ఫలి తంగా మన పనిలో అనేక నష్టాలు కలుగుతున్నాయి. ఈ రోజున మనల్ని కొత్తపరిస్థితులు, కొత్త కర్తవ్యాలు ఎదు

రొ్కుంటున్నాయి. గతంలోకంటె ఎక్కువ క్లిష్టమైన సమస్య లను మనం పరిష్కరించ వలసియుంది. వాటిని గురించి మనకింత వరకు తెలియదు. ఇట్టి పరిస్థితుల్లో మనం మార్క్సిస్టు—లెని నిస్టు అవగహనను పెంపొందించుకోడానికి ప్రయత్నించక పోతే, కొత్త పరిజ్ఞానాన్ని సంపాదించుకోకపోతే, కొత పద్ధతులను శ్రద్ధగా నేర్చుకొనక పోతే, కేవలం విజయాలతోనే సంతృప్తి చెందితే స్వీయమానసిక ధోరణికి సంబంధించిన పొరపాట్లు తప్పనిసరిగా జరుగుతాయి. పైగా, మనపార్టీలో కొత్తగా చేరిన అనేకమంది సభ్యులింతవరకు మార్క్సిజం—లెనినిజంలో తగినంత తరిఫీదు పొందలేదు. వారంతా స్వీయమానసిక ధోర ణికి, శుష్కసిద్ధాంత ధోరణికి, సులభంగా లోనుగావచ్చు.

స్వీయమానసికధోరణిని మనం శక్తివంతంగా ఎదుర్కో వాలంటే ;మన పార్టీయొక్క మార్క్సిస్టు - లెనినిస్టుస్థాయిని పెంపొందించడానికి నిర్విరామంగా కృషిచేయాలి. మొట్టమొదట మన కార్యకర్తలు - ముఖ్యంగా ఉన్నతస్థాయిలోని కార్య కర్తలు - మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాలను నిర్విరామంగా అధ్యయనం చేసేటట్లు చూడాలి. అప్పుడు వారు వాస్తవ జీవితానికి సంబంధించిన సమస్యలను పరిశీలించడంలోను, వాటిని పరిష్కరించడంలోను మార్క్సిస్టు - లెనినిస్టు దృక్పథాన్నీ విధానాన్నీ పద్ధతినీ నైపుణ్యంతో అన్వయించగలుతారు; విచక్షణా దృష్టిని పెంపొందించుకొని, క్లిష్టపరిస్థితుల్లో మంచి చెడ్డల వ్యత్యాసాన్ని గుర్తించగల్గుతారు; మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాల సహాయంతో తమ జీవితానుభవాన్ని పరీక్షించు కొని క్రోడీకరించడం నేర్చుకుంటారు; ఆ అనుభవంనుంచి వివిధ

ఘటనలు ఏ సూత్రాలనుబట్టి పరిణామం చెందుతున్నాయో తెలుసుకోనగల్గుతారు. రెండవవిషయమేమంటే, సిద్ధాంతాన్నీ ఆచరణనూ సమన్వయపరిచేవిధంగా కొత్తపార్టీసభ్యులలో విద్యాబోధనను పెంపొందించాలి. అలా చేయడంవల్ల వారు క్రమేణా మార్క్సిస్టు దృక్పథాన్నీ విధానాన్నీ పద్ధతినీ అర్థం చేసుకోగల్గుతారు; మార్క్సిస్టు - లెనినిస్టు సూత్రాలను గురించీ, పార్టీచరిత్రనుగురించీ, సోషలిస్టునిర్మాణంయొక్క ప్రస్తుతపరిస్థితినిగురించీ ప్రాథమికపరిజ్ఞానం వారిలో కలుగుతుంది. స్వీయమానసికధోరణివల్ల-అంటేశుష్కసిద్ధాంతధోరణి,సంకుచిత స్వీయానుభవధోరణి - ఎట్టినష్టంవాటిల్లుతుందో వారు తెలుసుకోనగల్గుతారు. ముఖ్యంగా, కొత్తపార్టీసభ్యులలో మేధావులైనవారు శుష్కసిద్ధాంతధోరణివల్ల కలిగే ప్రమాదాన్ని గుర్తించడ మెంత అవసరమో నొక్కిచెప్పాలి. మూడవవిషయమేమంటే, పార్టీయొక్క సిద్ధాంతకృషిని మనం పటిష్ఠమొనర్చాలి. మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలలో శాస్త్రీయ పరిశోధనలు జరపడానికి - అంటే సోషలిస్టు పరిణామంలోను సోషలిస్టు నిర్మాణంలోను ఉత్పన్నమవుతున్న ప్రధానసమస్యలనూ అనుభవాన్నీ అధ్యయనంచేయడం, ప్రస్తుత అంతర్జాతీయ పరిణామాలను పరిశీలించడం, మార్క్సిస్టు—లెనినిస్టు ప్రాథమిక సూత్రాలను అధ్యయనంచేయడం, మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాలతో సన్నిహితసంబంధం గల యితర శాస్త్రీయ సమస్యలను పరిశోధించడం - త్వరితంగా పార్టీలోను వెలుపల ఉన్న శక్తులన్నిటినీ సమీకరించాలి. ఈ పరిశోధనలన్నీ పార్టీ కార్యకలాపాల అవసరాలకు తగినట్లుగా ఉండాలి. అంతేకాదు,

పార్టీ సభ్యులందరిలో, యువజనులందరిలో సిద్ధాంతాన్ని ఆచరణనూ సమన్వయపరుస్తూ కొనసాగించే మార్క్సిస్టు - లెనినిస్టు విద్యాబోధన కనుగుణ్యంగాకూడ ఆ పరిశోధనలుండాలి.

స్వీయమానసిక ధోరణిని మనం శక్తివంతంగా ఎదుర్కోవాలంటే, అన్ని స్థాయిలలోని నాయకత్వ సంస్థలు వాస్తవ పరిస్థితులను పరిశీలించే కార్యక్రమాన్ని మరింత పటిష్ఠంగా కొనసాగించాలి. గత కొద్ది సంవత్సరాల్లో వాస్తవ పరిస్థితులను సరిగా పరిశీలించడానికి, ప్రజల అనుభవాన్ని క్రోడీకరించడానికి త్రికరణశుద్ధిగా ప్రయత్నించకపోవడంవల్లనే, పార్టీలో అనేక పొరపాట్లు జరిగాయి. మితవాత యథాస్థితివాదం, ఆవేశ పూరితమైన తొందరపాటు చర్యలు నిర్బంధంగాను ఉత్తరువుల ద్వారాను పనులు చేయించుకొనే తత్వం—ఇత్యాది పొర పాట్లు జరగడానికి కారణ మిదే. పరిపాలనా సంస్థల్లో పనిచేసే కొందరు కార్యకర్తలవలెనే, అనేకమంది పార్టీ కార్యనిర్వాహకులు అహంభావంతోను, ఆత్మసంతృప్తితోను వ్యవహరించ నారంభించారు. వారు తమ ఆఫీసుల్లో తిష్టవేసి, పరిస్థితులను పరిశీలించడానికి బదులు కబుర్లతో కాలక్షేపంచేస్తూ, తమ సొంత అభిప్రాయాల కనుగుణ్యంగా విధానాలను రూపొందిస్తున్నారు. తమకింది కార్యకర్తల వద్దకు వెళ్ళి వారి అభిప్రాయాలను తెలుసుకొనేందుకు వారు ప్రయత్నించరు. పార్టీ నిర్ణయాలెలా అమలు జరుగుతున్నాయో తనిఖీచేయరు. ఆచరణలో అవి సరియైనవేనని రుజువవుతోందో లేదో పరిశీలించరు. కొత్త విషయాలను తెలుసుకోడానికి కష్టపడరు. సవ్యంగా తమజ్ఞానం అభివృద్ధిచేసుకోడానికి కృషి సల్పరు. పైన వివరించిన

స్వీయమానసిక పద్ధతులవల్ల పార్టీ పనికి ఎంతనష్టం వాటిల్లిందో వారిచేత నిశితంగా గుర్తించేటట్టు చేయడానికి పార్టీ విద్యా బోధనను పూనుకోవాలి. ప్రజలమధ్య వాస్తవపరిస్థితులను పరిశీలించడ మెలాగో వారు తెలుసుకొనేటట్లు సహాయం చేయాలి. ప్రజలనుంచి విషయాలు నేర్చుకోడం, తిరిగి ప్రజలకు నేర్పడం అనే విధానాన్ని వారికి భోధించాలి; యిట్టిమార్గ మవలంబిస్తేనే నాయకత్వ స్థానాల్లో ఉండడం సంభవమని వారిచేత గుర్తింపచేయాలి.

## సమిష్టి నాయకత్వం

అందుచేత పార్టీయొక్క నాయకత్వపాత్ర సాధ్యమైనంత వరకు వాస్తవ పరిస్థితుల కనుగుణ్యంగా ఉండేటట్లు చూడాలి; ప్రజల అనుభవాన్ని అభిప్రాయాలనూ క్రోడీకరించి తప్పులు జరిగే అవకాశాన్ని తగ్గించాలి. ఇందుకు అన్ని స్థాయిలలోని పార్టీ యూనిట్లు ఎట్టి మినహాయింపులు లేకుండా సమిష్టి నాయకత్వ సూత్రానికి ఖచ్చితంగా కట్టుబడియుండడం, పార్టీలో ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని పెంపొందించడం ఎంతేని అవసరం. ప్రధాన సమస్య లన్నిటిపైన నిర్ణయాలు చేసేముందు, ఆ యా యూనిట్లలో వాటిని సమిష్టిగా చర్చించాలి. వివిధ దృక్కోణాలనుంచి చేసే వాద ప్రతివాదనలకు పూర్తి అవకాశమివ్వాలి. అలా యిచ్చినప్పుడే, పార్టీలోను వెలుపల ఉండే ప్రజల వివిధాభిప్రాయాలు సమగ్రంగా ప్రతిబింబిస్తాయి. మరోవిధంగా చెప్పాలంటే, వాస్తవిక పరిస్థితులు పరిణామం చెందేటప్పుడు, ద్యోతకమయ్యే విభిన్నధోరణులు అప్పుడుగాని మనకు సమగ్ర

రూపంలో గోచరించవు. ప్రతినాయకుడు తన అభిప్రాయాలకు భిన్నమైన వాటిని ఓపికతో వినాలి. వాటిని గురించి ఆలోచించాలి. వ్యతిరేకాభిప్రాయాలు సహేతుకంగా ఉన్నట్లయితే వాటిని ఒప్పుకోవాలి; లేదా వాటిలో సహేతుకమైన అంశాలేమైనా ఉంటేవాటిని స్వీకరించాలి. ఏకామ్రేడ్ అయినా సదుద్దేశంతో, లేదా మామూలుపద్ధతిప్రకారం నాయకుని అభిప్రాయానికి భిన్నమైనదాన్ని ప్రకటిస్తే, అతని యెడల విముఖతతో మెలగకూడదు; యథాప్రకారంగా స్నేహంతోనే మెలగుతూ, కలిసి పనియాలి. ఇట్టి విధాన మనుసరించడం ద్వారా మనం కేవలం మాటల్లోనే కాక చేతల్లో సమిష్టి నాయకత్వాన్ని, పార్టీ ఐక్యతను సాధించగల్గుతాం; పార్టీ నిర్మాణాన్ని పార్టీపనిని మరింత పటిష మొనర్చ గల్గుతాం.

పార్టీ యొక్క సమిష్టినాయకత్వసూత్రాన్ని సమగ్రంగా పాటించే సమస్యను, పార్టీలో ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని విస్తృతపరిచే విషయాన్ని కేంద్రకమిటీ చైనాకమ్యూనిస్టుపార్టీ నూతన నిబంధనావళిలో (ముసాయిదా) కూలంకషంగా చర్చించింది. దాన్ని గురించి కామ్రేడ్ టెంగ్ సియావో-పింగ్ సమగ్రంగా వివరించబోతున్నాడు గనుక, నే నా విషయంపై లోతుకు వెళ్ళవలసిన అవసరంలేదు. పార్టీసభ్యుల, క్రిందిపార్టీ యూనిట్ల హక్కులవిషయంలో ముసాయిదా నిబంధనావళి కొన్ని కొత్తఅంశాలను చేర్చింది. పార్టీసభ్యులు తమ కార్యకలాపాల్లో సృజనాత్మకశక్తిని పూర్తిగా ప్రదర్శించే హక్కు అందులో యివ్వబడింది. పార్టీనిర్ణయాలను వారు నిర్నిబంధంగా అమలుజరుపుతూనే, వాటికి తమ అభిప్రాయాలు భిన్నంగా

ఉండేపక్షంలో ఒక నాయకత్వసంస్థకు వాటిని నివేదించుకొనే హక్కు యివ్వబడింది. స్థానికస్వభావంగల సమస్యలను, లేదా స్థానికంగా నిర్ణయింపబడవలసిన సమస్యలను ఆ యా స్థానిక యూనిట్లే అక్కడిపరిస్థితులనుబట్టి పరిష్కరించుకోవాలనీ, పై యూనిట్ చేసిన నిర్ణయాలు స్థానికపరిస్థితులకు అన్వయించవని క్రిందియూనిట్ భావిస్తే వాటిని మార్చుకోవలసిందని కోరే హక్కు క్రింది యూనిట్‌కి ఉంటుందనీ ముసాయిదా నిబంధనావళిలో పేర్కొనబడింది. అంతేకాదు. కౌంటీమహాసభలుగాని, అంతకన్న పైస్థాయిలో జరిగే మహాసభలుగాని సంవత్సరానికొకసారి జరిగితీరాలని నిబంధనావళి చెబుతోంది. వీటన్నిటివల్ల అన్నిస్థాయిలపార్టీ యూనిట్లలోను, సభ్యులందరిలోను చొరవ తప్పకుండా ఎక్కువవుతుంది.

పార్టీలో ప్రజాస్వామ్యం విస్తరించడంవల్ల కేంద్రీకృత నాయకత్వం ఎంతమాత్రమూ బలహీనపడదు; పైగా మరింత బలపడుతుంది. పార్టీసభ్యులు పూర్తిగా సొంత చొరవతో పని చేసినట్లయితే, క్రమశిక్షణ ఏమాత్రమూ దెబ్బ తినదు. పైగా మరింత పటిష్ఠమవుతుంది. అదేవిధంగా, సమిష్టి నాయకత్వం మాత్రం వ్యక్తిగత బాధ్యతను గాని, నాయకుని పాత్రనుగాని కాదనదు. పైగా నాయకుడు సక్రమంగాను, విజయవంతంగాను తన వ్యక్తిగత పాత్రను నిర్వహించడానికది హామీ యిస్తుంది. మనపార్టీకినాయకుడైన కా|| మేడ్ మావ్—సె—టుంగ్ చైనా విప్లవంలో గొప్ప సారథ్యం వహించారంటే గాని, పార్టీ అంతటిలోను ప్రజలందరిలోను ఆయనకు గొప్ప పలుకుబడి ఉందంటేగాని, కారణం మార్క్సిజం — లెనినిజం

అనే విశ్వజనీన సత్యాన్ని చైనావిప్లవంయొక్క అనుభవంతో సమన్వయ పరచడమెలాగో ఆయన తెలుసుకున్నారు; అంతే కాక ప్రజల శక్తిలోను, వారి జ్ఞానసంపదలోను ఆయనకు గట్టి విశ్వాసముండింది; పార్టీపనిలో ఆయన ప్రజాసాన్నిహిత్య పంథాను ప్రవేశపెట్టి దానికోరకు తీవ్రంగా కృషిచేశారు; ప్రజాస్వామ్యం, సమిష్టినాయకత్వం అనే పార్టీ సూత్రాలను ఆయన ఖచ్చితంగా పాటిస్తారు.

పొరపాట్లు చేసిన కామ్రేడ్స్‌పట్ల అనుసరించదగు వైఖరి

పార్టీ సరియైన నాయకత్వం వహించాలంటే, పొరపాట్లు చేసిన కామ్రేడ్స్‌పట్ల సరియైన వైఖరి నవలంబించాలి

పొరపాట్లు చేసిన కామ్రేడ్స్‌ని పార్టీ బయటికి వెళ్ళగొట్టేంతవరకు వారిపై శిక్షణచర్యలు తీసుకోడం సులభమైన పనే. కాని, ఆ పొరపాట్ల వెనుక ఆలోచనా విధానానికి సంబంధించిన మూలకారణాలు కొన్ని ఉంటాయి. వాటిని నిర్మూలించకుండా, కఠినమైన శిక్షణచర్యలు మాత్రమే తీసుకోడంవల్ల ఆ తప్పులు మళ్ళీ జరగవని చెప్పడానికి వీల్లేదు. పైగా మరింత పెద్దతప్పులు కూడా జరగవచ్చు. మనపార్టీలో "అతివాద" అవకాశవాద పంథా ప్రబలంగా ఉండేటప్పుడు అంతరంగిక పోరాటంలో "అతికఠినమైన పోరు, నిర్దాక్షిణ్యమైన దెబ్బలు" అనే పద్ధతి అమల్లో ఉండేది. దానివల్ల మంచిచెడ్డల మధ్య వ్యత్యాసం స్పష్టంగా కనబడక, పార్టీలో శక్తివిహీనత ప్రవేశించింది; పార్టీ సభ్యులలో సృజనాత్మకశక్తి నశించింది. పార్టీకి అపారమైన నష్టం వాటిల్లింది.

వాంగ్ మింగ్, పో - కూ మొదలైన కామ్రేడ్స్ అనుస రించిన అవకాశవాదపంథావల్ల జరిగిన పొరపాట్లను సరిదిద్దిన తర్వాత, కామ్రేడ్ మావ్ - సె - టుంగ్ నాయకత్వాన కేంద్రకమిటీ అంతరంగికపోరాటంలో జరుగుతూవచ్చిన అపసవ్య పద్ధతులను పూర్తిగా నిర్మూలించి ,తీవ్రమైన మార్పు తీసు కొచ్చింది.

అంతరంగిక పోరాటంలో మొట్టమొదటపార్టీ తీసు కొచ్చిన మార్పు ఏమంటే, పార్టీలోని మంచిచెడుగులకూ, పార్టీలో రహస్యంగా ప్రవేశించిన విప్లవప్రతిఘాతకులు - పరమ నీచులు - తదితర దుష్టశక్తులకూ మధ్య ఖచ్చితమైన వ్యత్యాసం చూపెట్టింది.

పార్టీలో రహస్యంగా ప్రవేశించిన విప్లవప్రతిఘాతకుల పట్ల, పార్టీలో నిరంతరం చీలికలుతేస్తూ విచ్ఛిన్నచర్యలకు పూనుకొనే అన్యవర్గశక్తులపట్ల, అవినీతిపరులపట్ల, తదితర నీచులపట్ల పార్టీ అతికఠినమైన వైఖరి నవలంబించింది. అట్టివారిని పూర్తిగా తొలగించివేసింది. మనపార్టీలో కొందరు విప్లవప్రతీ ఘాతకులు, తదితర దుష్టశక్తులు ప్రవేశించినమాట నిజమే. వారిలో కొందరిని తొలగించివేశాం. ఇకముందుకూడా అట్టి వారిమీద గట్టి నిగా ఉంచి తొలగించివేస్తాం. కాని అలాంటి వారు బహుకొద్దిమందే ఉన్నారని వాస్తవఘటనలు రుజువు చేశాయి.

మనపార్టీ అధికారంలోకి వచ్చాక అవినీతిపోకడలు, దుష్టలక్షణాలు, చట్టధిక్కారం, శిక్షణారహిత్యం, నైతికపతనం

కొంతవరకు ప్రబలాయి. ఈ ప్రమాదకర స్థితిని మనం నిర్మూలించాలి. గతంలో మనం అవినీతిని, దుబారాను, చట్టధిక్కారాన్ని, శిక్షణారాహిత్యాన్ని రూపుమాపడానికి పెద్దయెత్తున ఒక ఉద్యమం నడిపాం; ఆ తర్వాత కుట్రలద్వారా ప్రభుత్వాన్ని పార్టీని హస్తగతంచేసుకోడానికి ప్రయత్నించిన కౌ - కాంగ్, జవ్ - షూషీలవంటి పార్టీ వ్యతిరేకుల ముఠాను తుడిచిపెట్టాం. ఇకముందుకూడా మనం అవినీతిని, దుష్టలక్షణాలను నిర్మూలించేందుకు ఎడతెగకుండా సిద్ధాంత, నిర్మాణపోరాటాలు సాగించవలసియుంటుంది; సరిదిద్దలేని అవినీతిపరులను, దుష్టశక్తులను ఎప్పటికప్పుడు పార్టీనుంచి తొలగించవలసియుంటుంది.

కాని, ఏకామ్రేడ్ అయినా అపసవ్యమైన ఆలోచనావిధానంవల్ల తన పనిలో పొరపాటుచేసినట్లయితే, అతనిపట్ల అనుసరించేవైఖరిలో పార్టీ యీ క్రింది సూత్రాలకు ఖచ్చితంగా కట్టుబడియుండాలి: "ఇకముందు జాగ్రత్తగా ఉండాలంటే, గతంనుంచి గుణపాఠంనేర్చుకో; రోగిని కాపాడాలంటే రోగానికి మందువేయి; ఒక వ్యక్తియొక్క ఆలోచనావిధానంలో ఉత్పన్నమైన సమస్యకు పరిష్కారమార్గంచూపు; కామ్రేడ్‌గా అతనితో కలిసి పనిచేయి." ఆలోచనావిధానానికి సంబంధించిన విద్యాబోధనకు మనం ప్రాముఖ్యత యివ్వాలి; తొందరపడి శిక్షణచర్యలకు పూనుకోరాదు. కామ్రేడ్స్‌యొక్క పొరపాటు అభిప్రాయాలను ఆచరణతో జోడించి విమర్శించడం, వాటి మూలకారణాలను పరిశీలించడం ఎంతో అవసరం. ఇందుకు ఎప్పటికప్పుడు వారికి సహాయంచేస్తూ, వారితో కలిసి పచేనిస్తూ ఉండాలి. పెద్ద తప్పులుచేసిన కామ్రేడ్స్‌పై ఉచితరీతిని శిక్షణా

చర్యలు తీసుకోవలసిన అవసరమేర్పడినప్పటికీ, లేదా యితర పదవులకు వారిని మార్చవలసివచ్చినప్పటికీ, వారు తమ పొర పాట్లను గ్రహించేటట్లు, సరిదిద్దుకొనేటట్లు స్నేహభావంతో సహాయంచేయడం చాల అవసరం.

క్లుప్తంగా చెప్పాలంటే, ఒక కామ్రేడ్ చేసిన పొర పాటును పార్టీలో సరిదిద్దడం సాధ్యమైతే, అలా దిద్దుకోడాని కతడు ప్రయత్నిస్తే అతన్ని పార్టీలోనే ఉండనిచ్చి ఆ పొరపా టును సరిదిద్దుకోనివ్వాలి. అతనిపై అక్రమంగా శిక్షణచర్య తీసుకొని, పార్టీ అధికారాన్ని దుర్వినియోగ పరచకూడదు. పైగా, ఆలోచనా విధానానికి సంబంధించిన పొరపాట్లను సరిదిద్ద డంలో కఠినమైన మోటువద్ధతు లవలంబించడంవల్ల ఆ పొర పాట్లు మళ్ళీమళ్ళీ జరగడమే కాకుండా, పార్టీలో ఉండవలసిన సౌమనస్యం దెబ్బతింటుంది. మామూలు అభిప్రాయభేదాలు కూడా నిర్మాణంలో చిలికలకు దారితీయవచ్చు.

## పార్టీలో ఐక్యత

పార్టీ తన సభ్యులలో మార్క్సిస్టు—లెనినిస్టు అవగా హనను వృద్ధిచేసింది. వాస్తవ పరిస్థితుల పరిశీలనను పెంపొందిం చింది. పార్టీలో ప్రజాస్వామ్యాన్ని విస్తృతమొనర్చింది. పార్టీ సభ్యుల పొరపాట్లయెడ సరియైన విధానమవలంబించింది. వీట న్నిటిఫలితంగా పార్టీ ఐక్యత, పార్టీ సభ్యులమధ్య ఐక్యమనో నిశ్చయం రోజురోజుకు వృద్ధిచెంది తీరుతాయి. పార్టీ ఐక్యత, పార్టీ సభ్యులమధ్య ఐక్య మనోనిశ్చయం కేవలం పార్టీ కేగాక మొత్తం కార్మికవర్గానికి యావన్మంది ప్రజలకూ ఎంతో ఉప

యోగకరం. ఎందుచేతంటే, మొత్తం కార్మికవర్గానికీ ప్రజలం దరికీ నాయకత్వం వహిస్తున్న అగ్రగామిశక్తి పార్టియే.

మొత్తం కార్మికవర్గాన్నీ, ప్రజాసామాన్యాన్నీ గట్టి పునాదులపై సంఘటిత మొనర్చాలంటే, మనం పార్టీ అంత టినీ కట్టుదిట్టమొనర్చి సమీకరించాలి. మొత్తం కార్మికవర్గం మీద, ప్రజలందరిమీద ఆధారపడగల శక్తే మన బలం. చైనాదేశాన్ని మనం ఒక గొప్ప సోషలిస్టు దేశంగా నిర్మించా లంటే, పార్టికీ ప్రజలకూ మధ్యగల సంబంధాన్ని మరింత పటిష్ఠ మొనర్చడానికి శాయశక్తులా పనిచేయాలి.

నేడు మనదేశంలో అత్యధిక సంఖ్యాక ప్రజలు యిది వరకే సంఘటితులయారు. అనేక ప్రజాసంస్థల ద్వారా పార్టీ ప్రజలతో సన్నిహిత సంబంధాలుంచుకొంటూంది. రైతులు స్వయంగా నిర్మించుకున్న సహకార సంస్థలతో పాటు ట్రేడ్ యూనియన్లు, యువజన సంఘాలు, మహిళాసంస్థలు ముఖ్య మైన ప్రజాసంస్థలుగా పనిచేస్తున్నాయి.

ఈనాడు మన ట్రేడ్ యూనియన్లలో 1 కోటి 20 లక్షల మంది సభ్యు లున్నారు. జాతీయ నిర్మా ణంలో అవి ప్రజముఖపాత్ర నిర్వహిస్తున్నాయి. ట్రేడ్ యూనియన్లను పనిచేయించడంలో పార్టీ తన నాయకత్వాన్ని మరింత చక్కబరచుకోవాలి; వాటి ద్వారా కార్మిక వర్గం యొక్క శక్తిసామర్థ్యాలను అభివృద్ధిచేయాలి. ఆవర్గం సంఘ టితమైన, రాజకీయ చైతన్యం గల్గిన వర్గంగా పెంపొందేటట్లు చూడాలి; సాంస్కృతికంగాను, సాంకేతికంగాను అభివృద్ధి

చెందేటట్లు చూడాలి; కార్మిక ప్రజాసామాన్యం పార్టీకి అతి సన్నిహితంగా ఉండేటట్లు సమీకరించాలి. సోషలిస్టు నిర్మాణంలో ట్రేడ్ యూనియన్లు విద్యాబోధన ద్వారానూ, ఒప్పించే పద్ధతి ద్వారానూ, కార్మికులకు నాయకత్వం వహించాలి; సోషలిస్టు పోటీద్వారానూ, ప్రావీణ్యతను ప్రోత్సహించటం ద్వారానూ నిరంతరం శ్రామికోత్పాదక శక్తిని పెంచడానికి కృషిచేయాలి. మరోవైపు ట్రేడ్ యూనియన్లు ప్రజల స్థితిగతులపట్ల శ్రద్ధ వహించాలి; వివిధపారిశ్రామిక సంస్థల్లో చట్టధిక్కారం, శిక్షణా రాహిత్యం, ప్రజాశ్రేయస్సుకు భిన్నంగా ప్రవర్తించడం, ప్రజల స్థితిగతులపట్ల ఉపేక్షాభావం మొదలైన రూపాల్లో వ్యక్తమయ్యే నిరంకుశత్వాన్ని రూపుమాపేందుకు తీవ్రమైన పోరాటం జరపాలి. ఈ రెండు కర్తవ్యాల్లో దేన్ని నిర్లక్ష్యంచేసినా పొరపాటే అవుతుంది. అట్టి ధోరణిని సరిదిద్దాలి.

2 కోట్ల సభ్యత్వంగల చైనా నూతనప్రజాతంత్రయువజన సమితి యికమీదట చైనాకమ్యూనిస్టు యువజనసమితి అనే పేరుతో వ్యవహరించుతుంది. గత కొద్దిసంవత్సరాల్లో యువజనసమితి విజయవంతంగా కృషిసల్పడంవల్ల, శక్తిసామర్థ్యాలు గల యువకార్మికులనుంచి, ఆఫీసుపనివారలనుంచి, యువకరైతుల నుంచి, శాస్త్రపరిశోధకుల సాంకేతికనిపుణుల తదితర యువక మేధావులనుంచి అనేకమంది ప్రవీణులు నిరంతరం ఉద్భవిస్తున్నారు. వారంతా ముందుముందు పార్టీలో సభ్యులుగా చేరవలసిన రిజర్వుదళమని చెప్పవచ్చు. పార్టీనాయకత్వంక్రింద యువజనసమితి తన సభ్యుల్లోను, యువకప్రజాసామాన్యంలోను మరింత తీవ్రంగా సిద్ధాంతకృషినీ, నిర్మాణకార్యకలాపాలను

కొనసాగించవలసియుంది; యువకుల లక్షణాలకు తగినట్లు కార్య విధానాన్ని రూపొందించడంలో ఉపేక్షవహిస్తున్న, యువక ప్రజాసామాన్యంలో విద్యాబోధనద్వారాను ఒప్పించేపద్ధతి ద్వారాను వారి చొరవను శక్తిసామర్థ్యాలను ప్రోత్సహించ నిరాకరిస్తున్న కొన్నిశాఖలలో పాలను సరిదిద్దవలసి యుంది.

మనపార్టీ చాలకాలంనుంచీ స్త్రీలవిముక్తి ఉద్యమాన్ని బలపరచడంలో ఎక్కువశ్రద్ధ తీసుకొంటూంది. స్త్రీలసంపూర్ణ విముక్తి దాని ప్రధానలక్ష్యాల్లో ఒకటి. ఈరోజున మన దేశంలో స్త్రీలుపారిశ్రామిక, వ్యవసాయరంగాల్లోను, యితర వృత్తుల్లోను అంతకంతకు అధికంగా ప్రముఖస్థానాలాక్రమిస్తున్నారు. తాము కూడా పురోగమించాలనే అభిలాషను స్త్రీలలో అన్నివిధాల ప్రోత్సహించడానికి పార్టీ నిర్విరామంగా కృషిచేయాలి; కొన్ని పనుల్లో స్త్రీలకు గల ప్రత్యేకచిక్కులను తొలగించడానికి సహాయపడాలి: వారు తమ నైపుణ్యాన్ని పెంపొందించుకోడంలో తోడ్పడాలి. పార్టీలోను, వెలుపల స్త్రీలవిషయమై విచక్షణచూపే పొరపాటు ధోరణులనుకూడా పార్టీ సరిదిద్దాలి. స్త్రీపురుషులమధ్య సమానత్వం, స్త్రీల-బిడ్డల రక్షణ అనే సూత్రాన్ని ఆధారంగా చేసుకొని, సామాజిక-గృహజీవితాల్లో ఒక కొత్తనీతిని ప్రవేశపెట్టడానికి మనం పూనుకోవాలి. దేశవ్యాపితంగా అనేక శాఖలుగల ప్రజాతంత్ర మహిళాసమాఖ్య ప్రజల అభిమానాన్ని చూరగొంది. దానిశాఖలను పనిచేయించడంలో పార్టీ సహాయపడాలి; వాటిద్వారా పార్టీకి స్త్రీజన బాహుళ్యానికీ మధ్య సంబంధాలను పటిష్ఠమొనర్చాలి.

పార్టీకీ ప్రజలకూ మధ్యగల సంబంధాలను మరింత సన్నిహిత మొనర్చాలంటే, అన్ని ప్రజారంగాల్లోను మనం మరింత తీవ్రంగా పనిచేయాలి. ముఖ్యంగా పార్టీ కార్యకర్తలకూ, సభ్యులకూ హృదయపూర్వకమైన ప్రజాసేవలో శిక్షణ గరపాలి. మంచి పార్టీ సభ్యుని, నాయకుని ముఖ్య లక్షణాల్లో ఒకటి ప్రజల నిత్య జీవితంతో పరిచయం కలిగి యుండడం, వారి శ్రేయస్సుపట్ల శ్రద్ధ వహించడం, వారి హృదయాంతరాళాల్లో ఉన్న విషయాలను తెలుసుకోవడం. అతడెల్లప్పుడూ కష్టపడి పనిచేస్తాడు; నిరాడంబర జీవితం గడుపుతాడు; ప్రజల సుఖదుఃఖాలలో పాలుపంచుకుంటాడు. ప్రజల విమర్శనను, తనిఖీని సహృదయంలో స్వీకరిస్తాడు; వారి యెదుట ఆర్భాటాలు చేయడు; తన సమస్యలను గురించి అతడు ప్రజలతో సంప్రదిస్తాడు; ప్రజలుకూడా అతనికి తమ హృదయం విప్పిచెబుతారు. అలాంటి సభ్యుల్ని మనపార్టీ కలిగి యున్నంత కాలం మన శక్తి అజేయం.

జాతీయంగా మనం ప్రజల అండపై ఆధారపడుతూన్నట్లే, అంత ర్జాతీయంగాకూడ ప్రపంచకార్మికుల అండపైన, ప్రపంచ ప్రజల అండపైన అధారపడుతున్నాం. ప్రపంచ కార్మికుల సంఘటితశక్తి లేకపోతే, మన సోషలిస్టు ఆశయం జయించదు; ఒకవేళ జయించినా, సుస్థిరంగా నిలవదు.

మనం యికముందుకూడ అన్ని దేశాల కమ్యూనిస్టు పార్టీలతోను వర్కర్స్ పార్టీలతోను, సోదర సంబంధాలను వృద్ధిచేసుకోవాలి; విప్లవం విషయంలోను, సోషలిస్టునిర్మాణం

విషయంలోను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ యొక్క అనుభవం నుంచి, యితరదేశాల కమ్యూనిస్టుపార్టీలు గడించిన అనుభవం నుంచి పాఠాలు నేర్చుకోవాలి. సోదరపార్టీలతో మనకుగల సంబంధాల్లో స్నేహాన్ని ప్రదర్శించాలి. వాటి యెడల నిరాడంబరవైఖరి నవలంబించాలి. జాతీయ దురహంకార వైపు, లేదా బూర్జువా జాతీయవాదం వైపు ప్రమాదకరమైన మొగ్గు కనిపించినట్లయితే, దాన్ని దృఢనిశ్చయంతో ప్రతిఘటించాలి.

చైనా విప్లవం అంతర్జాతీయ కార్మిక విప్లవోద్యమంలో ఒకభాగం. మనవిజయాల్లో అన్నిదేశాల కార్మికులు, కష్టజీవులు సాగించినపోరాటాల ఫలితాలున్నాయి. చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ యీ శుభసమయంలో అన్ని దేశాల కమ్యూనిస్టు పార్టీలకు, వాటిద్వారా ఆ యాదేశాల కార్మికులకు కష్టజీవులకు హృదయపూర్వకంగా గౌరవాభివందన లందజేస్తూంది. ధన్యవాదాలర్పిస్తోంది. వారితో ఎల్లవేళల స్నేహాన్ని పెంపొందించుకుంటామని వాగ్దానం చేస్తూంది.

కామ్రేడ్స్! మనమంతా ఎల్లకాలం ఐక్యతతో పని చేద్దాం! మన దేశప్రజలతోను, అన్నిదేశాల కార్మికులతోను ప్రపంచ ప్రజలందరితోను ఎల్లప్పుడూ ఐక్యతను పెంపొందించుకొందాం! మనసోషలిస్టు మహాదాశయం సిద్ధించితీరుతుంది! ప్రపంచంలో ఎవ్వరూ మనవిజయాన్ని అడ్డుకోలేరు!

---

# చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభ

# చౌ ఎన్ - లై నివేదిక

1956 సెప్టెంబరు 3 వ వారంలో జరిగిన చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభకు కేంద్ర కమిటీ తరఫున ద్వితీయ పంచవర్ష ప్రణాళికపై సమర్పింపబడిన యీ నివేదిక అన్ని దేశాల కమ్యూనిస్టులకు—ముఖ్యంగా భారతదేశ కమ్యూనిస్టులకు - అమూల్యమైన గ్రంథం.

భారతదేశంలో మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తి అయి, రెండవ ప్రణాళిక అమలుజరుగుతూంది. చైనాలో మొదటి పంచవర్ష ప్రణాళిక యింకొక సంవత్సరంలో పూర్తిఅయి, రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభమవుతుంది. ఇట్టి పరిస్థితుల్లో ఉభయదేశాల ప్రణాళికలను సరిపోల్చి చూడ్డం ఎంతేని అవసరం.

చైనా ప్రజలు మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో సాధించిన విజయాలు, రెండవ ప్రణాళిక కాలంలో వివిధ ప్రభుత్వ శాఖలకు కేటాయించదలచుకున్న ధనం, ఆర్థిక వనరులను సేకరించడానికి అనుసరించదలచుకొన్న పద్ధతులు, ప్రజల జీవనప్రమాణాన్ని పెంచేటందుకు సూచించిన మార్గాలు — యీ నివేదికలో వివరింపబడ్డాయి. సోషలిస్టు నిర్మాణంలో కొందరు పార్టీ కార్యకర్తల వక్రధోరణులను సరిదిద్దడానికి చేసిన సూచనలుకూడా యిందులో ఉన్నాయి. ప్రతి కమ్యూనిస్టు తప్పకుండా చదవవలసిన గ్రంథం.

పేజీలు 86 — వెల : 0-8-0

ప్రతులకు :

## విశాలాంధ్ర ప్రచురణాలయం,

## విజయవాడ - 2.

స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్సు, విజయవాడ-2.